

సంపుటము 20
సంచిక 11

# భారతి

స్వభాను కార్తికము
1943 నవంబరు

## రాధిక

= 'స్వైరవిహారి' =

త్వద్వేణుమంజులధ్వని రొయికించుక గల్గు సురసాలపికపాలి జూచినాను;
నీతనుద్యుతిరామణీయకంబును బూను నీలాభ్రముల నెల్ల నెమకినాను;
భవదీయపింఛసంపద గాంచి రాగించు పొదలలో నెమిళులకై వెదకినాను;
తావకపాద సోదరభావము వహించు నబ్జాతతతి సర్వ మరసినాను;
నీదురూపము నెదను చింతించుకొనుచు - వెదుకదగుచోటు లెల్లను వెదకినాను;
లేవా ? ధృతినూని కన్పింపలేవా ? సేవ - కావనాత్త స్వభావ ! దేవాదిదేవ !

శరదిందుబింబనిష్యంది శీతలసాంద్రచంద్రికారుచులెల్ల జతనపరచి;
దివిజగంగాస్రవంతీ తుంగభంగ శీకరలాస్యరీతినే కట్టినిలిపి;
వానంతసుమవనీ ప్రాసవోల్లాసదాయక సువర్ణములనే అరసి కూర్చి;
కోకిలాకోమలీ కాకలీ శ్రీకలస్వనమనోజ్ఞత కొంత పదిలపరచి;
పావనావనభావ నీసేవనమున - కెదురుచూచెడి నాశ్రమ మెల్ల దేవ !
నీవు రాకున్న బూది పన్నీరుపోయు - టగును తనివారగా రాగదగును వేగ !

కనిపించ కెందొ దాగొనుట పౌరుషమొకో ? కనిపించి తప్పించుకొనుట గొప్ప;
పిలిచినం బలుకకే కిలకిలలాడుటా ? పలుకునందు ఛలోక్తి మెలప మేలు ;
దొసగు లెయ్యవి సేసి పొసగినంతనె చెల్మికే సుడిబెట్టు టదేటి తగవు ?
నను నింక నెన్నడైనను పిల్వవా ? చూడు మింతకన్నను విసివింతు నిన్ను ;
ఏది, నిను పరీక్షింతు నే నిదిగొ కనులు-మూసికొనుచుంటి విప్పకమున్నె యెదుట
పడుము నీశక్తి దాన కన్పడునుగాని-యిట్లు పనిబూని విసివింప నేమిసొంపు ?

అకలంకకూలంకషామృతామేయఝంపావలద్వీచికా ప్రాభవములా ?
వాసంతలతికాంత వాసితస్రగ్జాత జాతమంజుల మాన్యసౌరభములా ?
శ్రుతిపేయకమనీయతతదివ్యవల్లకీ స్వనసరఃప్లవమాన సమ్మదములా ?
పరివృతాంబరయుతాంభః పూర్ణవర్షాభ్రసంభూత చంచలాసంభ్రమములా ?
మందపవమాన చలనసంపదలా ? లవణి -.
మాచ్ఛకుసుమాళిసుమధూళికామృతములా ?
కనులకును దోచి యంతలోననె యదృశ్య
మైన త్వత్పాదయుగళియో? ప్రాణనాధ !

చిరతపఃఫలమునే చేతి కందించి యంతనె తీవ్రగతి లాగుకొనినయట్లు ;
సుందరాంబరచుంబి నంద సౌధాగ్రమందుండి నేలకు పడద్రోసినట్లు ;
తులలేని దివ్యకాంతుల నొక్కసారి చూపించి కన్నులను మూయించినట్లు,
దరిగానరాని సాగరమధ్యదేశాన విడిచి పల్కాడక వెడలినట్లు,
సుంత కన్పించి యెంతయో సంతసమిడి-అంతలోననె యదృశ్యమై వసంత
శోభ వెంటనె శైశిరశూన్యదుస్థి-తియును నాయెడ గూర్చితే ? దేవదేవ !



# యాజ్ఞవల్క్యుడు - శుక్లయజుస్సు



= శ్రీ అఖండం సీతారామశాస్త్రి =

ఈ యోగీంద్రుని పేరు చాలమంది విన్నను గొంతమంది వీరి చరిత్ర దెలియమిని వీరు గురునితో గలహించినప్పుడు వేదబాహ్యు డయ్యెనని యు, వీరు సూర్యునిగూర్చి తపంబొనర్ప నాదిత్యుడు ప్రత్యక్షమై తన కొకచోట నుండుట కవకాశము లేదని తన రథముపై గూర్చుండబెట్టుకొని వేదము చెప్పె ననియు, నా రథధ్వనిచే నాత డొకటి జెప్ప నీత డొకటి గ్రహించె ననియు, నందుచేతనే యీ వేదమున కిట్టి దీర్ఘస్వరములు వచ్చె ననియు కొంద ఱపౌరుషేయమగు వేదమును విమర్శింపగా వారికి బ్రత్యేకసమాధాన మిచ్చుట కవకాశము లేకపోవుటయే కాక సార్వజనీనముగా నుపయోగించు నను నుద్దేశముతో నీ చిన్నవ్యాసమున నీవిషయమును సంగ్రహముగ బొందుపరచెదను.

యజ్ఞవల్కుని కుమారు డగు యాజ్ఞవల్క్యుడు కార్తికశుద్ధ ద్వాదశినాడు జనన మొందెను.

"ఊర్జే మాసి సితే యమే రవిదినే లగ్నే ధనుష్కే తథా"—యజ్ఞస్య వల్కః వక్తా= యజ్ఞవల్కః; తస్యాపత్యం యాజ్ఞవల్క్యః. దైవరాతి రిత్యర్థః. (శంకరాచార్య కృత బృహదారణ్యక భాష్యము, ౧ అధ్యా-౪ కండిక-3 బ్రాహ్మణము).

యాజ్ఞవల్క్యునకు దండ్రి సకాలమున నుపనయనము జేసి యొకనాడు కుమారుని బిలిచి "నేను ముదుసలి నగుటచే నీకు బ్రహ్మోపదేశము చేయుట దక్క నిన్ను సర్వవేదవిదునిగా జేయ శక్తి లేకుంటిని గాన నీవు ఋగాదివేదముల జదువుటకు బాష్కలాదుల కడకు బొ" మ్మనెను. అతడు మాతాపితరుల యనుమతిని బాష్కలునియొద్ద ఋగ్వేదమును జదివెను. "పారాశరిం తృతీయాంతు యాజ్ఞవల్క్య మథాపరామ్" (బ్రహ్మాండపురాణము, పూర్వ. 3 అధ్యా). పిమ్మట సామవేదమును జైమినియొద్ద జదివెను. "సామ్నాం సహస్రశః శాఖాం జైమినేః స్వీచకార సః" (చి. యా. ౨ అధ్యా.) అట్లే ఉద్దాలకుని యొద్ద నథర్వవేదమును జదివెను.

*"After being invested with the sacred thread Yaznavalkya studied the Rigveda under Bashkala, the Sama and Adharva vedas under Jaimini and Aruni (Uddalaka)"*
*—P. B. Joshi.*

ఆరుణి యను నామాంతరము గల యుద్దాలకుని యొద్ద వేదాధ్యయనకాలముననే శుష్కకాష్ఠమున మంత్రోదకము జల్లిన నది చిగుర్చునట్టి మంత్రములను గూడ నేర్చుకొనెను.

"ఏతద్ధైత ముద్దాలక ఆరుణి ర్వాజసనేయాయ యాజ్ఞవల్క్యా యాంతేవాసిన ఉక్త్వోవాచాపి య ఏనం శుష్కే స్థాణౌ నిషించే జ్జాయేరన్ఛాఖాః ప్రరోహేయుః పలాశా ఇతి" (శతపథము౧౪-౯-౪-౪)

ఇట్లు ఋక్సామాథర్వవేద పఠనానంతరమున యాగములు చేయుటయే ప్రధానముగా నుండిన యాకాలమున యజుర్వేదమును జదువ మేనమామయగు విదగ్ధశాకల్యునొద్దకు బోయెను. ఈ విదగ్ధశాకల్యునకే వైశంపాయను డనియు నామాంతరము గలదు. పాఠములు చెప్పుటలో మిగుల నేర్పుగలవాడుగాన నీతనికి విదగ్ధశాకల్యు డను పేరు గలిగెను. యజుర్వేదమునకు యజ్ఞమునందే ప్రయోజనము. అట్లే ఋగ్వేదమునకు శంసనము, సామవేదమునకు స్తోత్రము, అథర్వవేదమునకు జపమును ప్రయోజనము.

"యద్వేవ ఋగ్భిః శంసంతి, యజుర్భి ర్యజంతి, సామభి స్తువం, త్యథర్వభి ర్జపంతి" (కౌశక. సం. ౪-౪).

శాకల్యుడు వర్ధమానపురమును బాలించు సూర్యవంశప్రసూతు డగు సుప్రియునకు బురోహితుడుగా నుండెను.

"చకార స తదా విప్రః
పౌరోహిత్యం మహీపతేః,
సూర్యవంశే ప్రసూతస్య
సుప్రియస్య మహాత్మనః"
(స్కాంద. నాగ. ౧౫-అధ్యా.)

సుప్రియుడు దుర్వ్యసనాసక్తు డగుటచే శరీరారోగ్యమును గోలుపోయి కొంతకాలమునకు మహావ్యాధిగ్రస్తు డయ్యెను. అప్పుడు నరపతి శాకల్యునొద్దకు వచ్చి "తా ముపదేశించు నీతిమార్గము దప్పి చరించుటచే నా కీచేటు మూడినది. తా మెట్లైన నా కీవ్యాధి తొలగు నుపాయ మూహించి రక్షింపు"డనగా శాకల్యు డాలోచించి "మహాపాతకములవలన గానుపించిన ఫలము శాంతిక మొనర్చుటవలన నచిరకాలములో గానుపించు" నని చెప్పి, శిష్యుల నందర బిలిచి దినమున కొక్కరుచొప్పున శాంతిక మొనర్చి రాజునకు దీర్థమీయు డనగా నంద రంగీకరించి యూరకుండిరిగాని యాజ్ఞవల్క్యుడుమాత్ర మూరకుండక "గురువర్యా! యుక్తాయుక్తముల నెఱుంగక వర్తించువారియెడ నెట్లు మెలగవలయునో తామే సెలవీయు" డన "నట్టివారల నజ్ఞులుగ నెంచి 'ఇక వారి చెంతకు బోను' అని శపథముచేయుటయే" యని చెప్పెను. దాని కంగీకరించి యూరకుండెను.

ఇట్లు కొంతకాల మగునప్పటికి యాజ్ఞవల్క్యుడు మంత్రోదకము నీయవలసిన రోజు రాగా నాతడు యథాశాస్త్రముగ శాంతిక మొనర్చి తీర్థమును రాజునొద్దకు గొంపోయి "మహారాజా! మంత్రోదకమును దీసికొను" మనగా నిష్ఠాగరిష్ఠులగు విప్రమాణవకుల మంత్రోదకమే నావ్యాధినివారకము కానప్పుడు బాహ్యవేషము గల నీమంత్రోదకమా నన్ను నీరోగునిగా జేయునది? అయినను నీమంత్రోదక ప్రభావమును జూతము, ఈ యెండుకట్టెపై బోయు" మన నాతడు "ద్రివం మాతేభిః" (కాణ్వ. సం. ౫-౧౦-౪) అను మంత్రము నుచ్చరించి యాతీర్థము నాశుష్కకాష్ఠముపై బోసి గురుసన్నిధి కేగి వృత్తాంతము నంతయు జెప్పెను.

ఇచట రాజునింట నా మంత్రోదక ప్రభావముచే నాయెండుకట్టె చిగిర్చి కొమ్మలు గలిగి యుండెను. అప్పుడు రాజు మంత్రోదక ప్రభావమును దెలిసికొని "ఆహా, యాతీర్థోదకపానముచే నావ్యాధి నిర్మూలమై యుండెడిది. తెలివిమాలినవాడనై యాతని బరిహసించితి"నని వగచెను. "అయినను మన శాకల్యుని శిష్యుడేకదా! తిరిగి తీసికొని రమ్మనుమని కోరెదను" అనుకొని వార్తనంపెను. కాని యాజ్ఞవల్క్యుడు నిరాకరించెను. గురువు స్వయముగా జెప్పినను "నను రానాడు చేయుమనిన రీతిని శపథమొనర్చితిని గాన నే బోవుటకు వలనుపడ"దనెను. ఎన్ని చెప్పినను వినకుండిన శాకల్యుడు విసువుజెంది "నాకడ నభ్యసించిన వేదము నిచ్చి వెడలు" మన నాతడు తన యోగసామర్థ్యముచే నావేదమును మూర్తిమంతముగ జేసి క్రక్కెను. దానిని శాకల్యశిష్యులు తిత్తిరిపక్షులై భక్షించిరి.

పైవిషయమున ప్రామాణ్యములు చాల యున్నను నిచట గ్రంథవిస్తరభీతిచే నొకటి రెంటినిమాత్ర మిచ్చుచుంటిని.

"యోగసామర్థ్యతో విద్వాం
మూర్తిం కృత్వావమత్తదా,
అన్యే తిత్తిరయో భూత్వా
కించిత్కాంచి దభక్షయన్"
(విద్యారణ్యకృత కాణ్వమంత్రభాష్యము)

ఇట్లే భాగవతమున ౧౨-వ స్కంధమున ౬-వ అధ్యాయమునను, విష్ణుపురాణమున ౩ అం. ౫-వ అధ్యాయమునను, స్కాంద పురాణ కాళికా ఖండమున ౧౮-వ యధ్యాయమునను, జాబాలసంహితలో ౧-వ అధ్యాయమునను, బ్రహ్మాండ పురాణమున ౩౪-వ అధ్యాయమునను గానుపించుచున్నది.

దీనికే మఱియొకవిధముగ గూడ జెప్పెదరు. తిత్తిరి యను ఋషిచే జెప్పబడుటచే నీ సంహితకు తైత్తిరీయసంహిత యని పేరు గలిగెనందురు. కాని "సూ. తిత్తిరి వరతంతు ఖండికోఖాచ్ఛణ్" (౪-౩-౧౦౨)—తిత్తిరి శబ్దము గల యీ సూత్రమునకు మహాభాష్యము లేదనియు, నాభాష్యమున "తిత్తిరిణా ప్రోక్తాః శ్లోకాః" అనియే యున్నది కాని యెందును ఛందస్సునకు సంబంధించి యుండలే

దనియు, నందుచే బకింజలికి బిమ్మట వేఱొకరో యీ సూత్రమును గల్పించి రనియు చెప్పరు ఉదాహరణములతో జూపెను.

అట్లు యాజ్ఞవల్క్యుడు శాకల్య గృహమును వదలి వచ్చునప్పుడా శాకల్యునితో "నీ వేదము బుద్ధిమాంద్యము గలిగించునదియు, బూర్వోత్తరాంగ రహితమును, నవ్యవస్థితము నై యున్న" దని ధిక్కరించి పలికి, క్రక్కినదానిని మరల జూచుటకైనను సహింపనట్లే నీకడ జదివిన యజుస్సులను స్మరణమునకైనను రానీయ ననియు, నింతకంటె సర్వవిధముల నధికమగు వేదమును బడసెదననియు చెప్పి యాదిత్యోపాసనము గావించి కర్మబ్రహ్మవిద్యలు సక్రమముగా నుండునట్టి శుక్లయజుర్వేదమును బ్రకాశింప జేసె నని చెప్పుదురు. కథల మాట యెట్లున్నను యాజ్ఞవల్క్యుడు వైశంపాయనునితో ద్వేషించి పోయి మఱియొక యజుర్వేదమును ప్రకాశింపజేసిన తరువాత నేకదా యజుర్వేదము శుక్లయజుర్వేద మనియు, కృష్ణయజుర్వేద మనియు రెండువిధము లయ్యెను.

యాజ్ఞవల్క్యుడు శుక్లయజుర్వేదమును సూర్యునివలన బొందినట్లీక్రింది ప్రమాణములవలన దెలియుచున్నది:

"మయాదిత్యా దవాప్తాని
యజూంషి మిథిలాధిప !
ప్రీతేన చాహం విభునా
సూర్యేణోక్త స్తదానఘ !
వరం వృణీష్వ విప్రర్షే
యదిష్టం తే సుదుర్లభమ్
తతః ప్రణమ్య శిరసా
మయోక్త స్తపతాంవరః
యజూంషి నోపయుక్తాని
క్షిప్ర మిచ్ఛామి వేదితుమ్
తతో మాం భగవా నాహ
వితరిష్యామి తే ద్విజ
సరస్వతీహ వాగ్భూతా
శరీరం తే ప్రవేక్ష్యతి
తతో మా మాహ భగవా
నాస్యం స్వం వివృతం కురు
వివృతంచ తతో మేఽస్యం
ప్రవిష్టాచ సరస్వతీ
తతో విదహ్యమానోఽహం
ప్రవిష్టోఽంభ స్తదానఘ
తతో విదహ్యమానం మా
మువాచ భగవాన్ రవిః
ముహూర్తం సహ్యతాం దాహ
స్తతః శీతీభవిష్యతి
శీతీభూతంచ మాం దృష్ట్వా
భగవా నాహ భాస్కరః
ప్రతిభాస్యతి తే వేదః
సఖిలః సోత్తరో ద్విజ
కృత్స్నం శతపథంచైవ
ప్రణేష్యసి ద్విజర్షభ"
(భార. శాంతి. ౩౧౩ అధ్యా)

"సత్త్వప్రధానం శుక్లాఖ్యం
యజూరూపం సువిస్తరమ్
శబ్దబ్రహ్మమయం వేదం
సత్కర్మబ్రహ్మవాచకమ్
మునిమధ్యాపయామాస
ప్రథమం సవితా స్వయమ్"
(స్కాంద. సనత్కు. సం. ౫ అధ్యా)

"యాజ్ఞవల్క్య స్తదా సూర్య
మారాధ్యాప్య దధీతవాన్
వ్యవస్థితప్రకరణం
యజుః శుక్లం తదీర్యతే."
(విద్యారణ్యకృత కాణ్వసంహితాభాష్యము)

శంకరభాష్యము — "తానీమాని శుక్లానీతి— అవ్యామిశ్రాణి బ్రాహ్మణేన. అథవా, అయాతయామానీమాని యజూంషి. తాని శుక్లాని. శుద్ధానీతి యావత్"

"బుద్ధినైర్మల్యహేతు ర్య
త్తద్యజుః శుక్ల మీరితమ్"
(వేదతత్త్వ నిరూపణము, ౧౮ పే.)

ఇట్లు యాజ్ఞవల్క్యుడు సూర్యునివలన బొందిన వేదమును బ్రథమమున కణ్వు డను శిష్యున కుపదేశించెను. పిమ్మట మఱికొంతమంది కుపదేశించెను. ప్రథమశిష్యు డగు కణ్వుని శాఖకు జెందినవా రగుటచే నీశాఖీయులకు బ్రథమశాఖీయు లనియు, కాణ్వీయులనియు

పేరు గలిగెను. శుక్లయజుర్వేద బ్రాహ్మణమునకే శత పథబ్రాహ్మణ మని పేరు. అనగా నూటనాలు గధ్యాయములు గలది. శత (నూఱు), పథ (నాలుగు). ఈ బ్రాహ్మణమునందు పాశ్చాత్యులకు గూడ గౌరవ మెక్కువ.

*"I now turn to the Brahmana of the White Yazus ie. Satapatha Brahmana* ***which*** *from its compass and contents undoubtedly occupies the most significant and important position of all the Brahmanas" (p. 116-117)—Veber.*

పిమ్మట యాజ్ఞవల్క్యుడు కొన్ని క్రతువుల జేయించుట, ఈతనితో వాదమొనర్చి శాకల్యాదులు జనకసభలో నోడిపోవుట, గార్గి యను యోగిని యీతని మహాత్త్వము బొగడుట, జనకగురుత్వము, వీరి వివాహము, తురీయాశ్రమస్వీకారము మున్నగునవి శతపథమునందే వివరింపబడుటచే నిచ్చట వ్రాయబడ లేదు. పైనజెప్పిన కారణములనుబట్టి యాజ్ఞవల్క్యుకు వేదవమనానంతరము వేదరహితు డగుటగాని, సూర్యుని రథముపై గూరుచుండి యాతడొకటి చెప్పిన నీత డొకటి గ్రహించుటగాని జరుగలేదని సువిదితములు.

---

"సంగీతసాహిత్యనామక విద్యాయుగళంబు"



ఆలాపన

మంద్రం-ఏక తాళం-ప్రథమ కాలం.

మధ్యమం-జంపెతాళం-ద్వితీయకాలం.

తారకం-ధ్రువతాళం-తృతీయ కాలం.

# జానకి

— 'సముద్రుడు' —

చెలులు తమంత తాము తమ సిగ్గుల వెన్నెలనిగ్గుతో కలం
తలను గులాబిపూల లలితమ్మగు సన్నని కమ్మతావిలో
పొలిపిన మాటపోడుముల పోకిరిచక్కిలిగింత నీరెండల్
పులకలుబొందగా పసిడిబుగ్గల సొట్టలు జాజువారగన్.

పదనుకు వచ్చియున్న యెలప్రాయపు పచ్చని కోర్కెపచ్చికన్
మెదలెడి గోరువెచ్చ సుతిమెత్తనిభావము గొల్లభామయై
అదరుచు గంతులేయు మనసార వచింప తలంచు మాట లా
కదలని మోవిపై ప్రిదుల గాలికి చీలిన మబ్బుతున్కలై.

అంచుల పొంగి పొర్ల పొగలార్చగ నుంచిన శీధుమాధురుల్
మంచులతోడ మిశ్రితములా యనుచున్, కడ డాయలేక, పో
నెంచక, శైత్యతీవ్రత సహించగలేక, వడంకుతారక్రొ
మ్మించుల మించు చూపుల తమిన్ వెలిజేయక దాపలేకయున్.

ఆ రమణీయసౌధశిఖరాగ్రమునన్ నిలుచుండి, ఏవిధో
కూరిమిమల్లెపువ్వులను కువ్వలుకువ్వలుగాగ రువ్వినా
వో, రజతంబుతోడ తెరువున్ నగిషీపని జేసినావొ ఏ
మో రచియించినావు తెలిపూతలు దాగని మూగనవ్వులన్.

నీనయనాంచలాల రమణీయములై అలరించుచున్ జయం
బౌ నిక పోయిరమ్మను సుహాసమరీచులు గోచరించె, ఈ
శానుని వింటిచేవను బజారుల బెట్టగబోవు రాముపై
జానకిదేవి మెల్ల వెదజల్లిన చల్లని పిల్లనవ్వులై.

ఈ నరలోకమంతటికి ఏనె నియంత నటంచు సోమనో
మానవతీకటాక్షసుమమాల్యపరిష్కృతకంఠుడా మరు
త్వానుడ నైతి నంచు, వితతత్రిజగత్పతినేలు విష్ణువే
నే నయితంచు నమ్మితిని నమ్మని నీవు ననుం గనుంగొనన్.

ఆ చిరునవ్వులం దెదిరెయొ, అందము మార్దవమున్ మహత్వమున్
ఆ చిరుగాజునవ్వడుల నద్భుతమౌ పరిణీతిగీతముల్
దోచెను నాకు నాచెవులలో మధురమ్ముగ మారుమ్రోగె ఆ
లోచన లేవొ పైకెగసె రోదసి గీదసి వ్రక్కలించుచున్.

రామము లేక ఏకలలు రాముని భావనవెంట నంటెనో
వేమరు లవ్వియే నను వివేకవిదూరుని చేసె; కాని శ్రీ
రాముని ప్రేమ సార్థకత రాజిలె; మామక మాయె వమ్ము హా
ఏమిది యన్న నాతలపులే మిగిలెన్ ప్రణయావశిష్టమై.

అందముచిందు ఆ స్మితదృగంచలముల్ ఎట బోయెనంచు ఇం
దందని లేక నే వెదకులాడితి సర్వమహీస్థలంబు, నా
కెందును కానరాక, ఎటు లేగెనొ, ఏమెష మాయమాయెనో,
పొందెనొ నిండుచందురుని, పోయెనొ రిక్కల వెక్కిరింపగన్.

మాయని ఈర్ధహోవిరహమార్గములంబడి పోవపోవ ఏ
దోయొకనాటికేని ఇటనో అటనో నిను కానలేన 'జా
నీ'యనలేన యన్న ఒకటే ఒకటే ఒక ఆశమాత్రమే
నాయెద నాకృశించు లలనా ధ్రువమై ధ్రువతారతీరునన్.





## జీవయాత్ర

= శ్రీ యస్. ధనపాల్ =

# వజ్జలగ్గ : : :

= శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు =

'వజ్జలగ్గ' కూడ గాథాసప్తశతివంటి యొక సంకలిత కావ్యము. దీనియందలి భాషయు దానియందు వలెనే మహారాష్ట్రియు. దీని సంకలనకర్త జయవల్లభుడు. ఇతడు శ్వేతాంబరశాఖకు జెందిన జైనుడు. కాలము తెలియదు. ఈ 'వజ్జలగ్గ'కే 'జయవల్లభ' మనియు మరుపేరు[1]. ఈకావ్యమునందు నలువది యెనిమిది పద్ధతు లున్నవి. దాదాపు ఏడునూరుల శ్లోకములు. కవి యీ సంకలన మొనర్చువాటికి హాలుని 'సప్తశతి' ప్రసిద్ధముగా నుండినది. అందుచే నీతడు గాథాసప్తశతి కూడ నొరవడిగా నుంచుకొనియుండును. ఈగ్రంథమునకు వ్యాఖ్యాకర్త రత్నదేవుడు. ఇతని కాలము విక్రమ శకపు ౧౩౯౩.

'వజ్జలగ్గ'లోని సంకలనములలో 'గాథసహము' లోని శ్లోకములు కొన్ని యున్నవి. సప్తశతిలోనివి కూడ కొన్నికలవు. సప్తశతిలోని ప్రసిద్ధమైన "అమియం పాఇయకవ్వం" అను గాథయు దీనియం దున్నది. సంకలితములనే కవి యేల చేర్చెనో! లేక యాత డేప్రతి జూచెనో! ఇతరగ్రంథముల కెట్లున్నను గాథాసప్తశతికి మాత్ర మనేకములగు పాఠాంతరములు, గ్రంథభేదములు కనబడుచున్నవి. హాలుడు తన సంకలనములం దాయాగ్రంథకర్తల పేరు లొసగినాడు. దానిచే నాటి యజ్ఞాతకవుల నామములు కొన్నియైనను దెలిసికొన వీలగుచున్నది. ఈగ్రంథమునం దాయవకాశమును లేదు. లేక, ఈతడు కూర్చునాటికి ఆచాటువులు, తత్కర్తలగు కవుల నామములు ప్రసిద్ధములుగా నుండెనో! ఎట్లును చెప్పలేము. మనకుమాత్రము నిరాశ తప్పనిసరియైనది. ప్రాకృతములు వ్యావహారికము లగుటచే నేటి వేమన పద్యములవలెనే యీచాటువులు జనసమూహమునం దత్యంతప్రసిద్ధము లైయుండెనేమో! వానిలోకూడ 'వరకులముల'[2]ను గ్రహించి జయవల్లభుడు సంకలించెనట. ఇక పేరు లెందుకు సూచించుట?

తన గ్రంథమునకు 'వజ్జలగ్గ'యని పేరిడుటకు జయవల్లభుడు కారణ మీరీతి జెప్పెను:

> ఏకత్థే పత్థావే
> జత్థ పఢిజ్జంతి పవురగాహాఓ
> తంఖలు వజ్జాలగ్గం
> వజ్జేత్తియ పద్ధయీ భణియా[3].

గోష్ఠియం దొకానొక ప్రస్తావమునందు పలుకు చాటువులకు 'వజ్జాలగ్గ'మని పేరట. 'వజ్జ' యనగా పద్ధతి యని జయవల్లభుడే వ్యాఖ్యానించెను. 'లగ్గ' లగ్న శబ్దభవ మగునా!

హాలుడు, జయవల్లభుడు - వీరిరువు రొనర్చిన కార్య మొక్కటే యైనను దృష్టులు విభిన్నములు. హాలుడు రాజు; శృంగారప్రియుడు; స్వయముగా కవి. స్థూల దృష్టితో జూచినప్పుడు సప్తశతిలోని సంకలనమున కొక నిర్దిష్టమగు నుద్దేశ్యము లేదని తోచినను—కొంత చిక్కగ నాలోచించినచో శృంగారమే హాలుని పరదైవత మని తేలును. హాలున కేమి? ప్రాకృతమునకే శృంగార ముపాస్యదేవత. జయవల్లభుడు జైనసన్యాసి. కనుక నతనికి ధర్మము ముఖ్యము. తరువాతి వర్థకామములు. అసలు కవితకు మోక్షోపయోగిత్వ మున్నదని మరి యాతడు నమ్మెనో లేదో! త్రివర్గములను మాత్రమే చేర్చినాడు.[4] 'వజ్జలగ్గ'లోని చాటువులను చూచినప్పుడు కామము నాతడానుషంగికముగనే

---

1. "విహిణా జయవల్లహం ణామ"
2. "వివిహకఇ విరఇయాణం
   గాహాణం వరకులాణి ఘేత్తూణ",
3. "ఏకార్థ ప్రస్తావే
   యత్ర పఠ్యంతే ప్రచుర గాథాః.
   తత్ఖలు వజ్జాలగ్గం
   వజ్జేతి చ పద్ధతి ర్భణితా."
4. "ధమ్మాయి తివగ్గఝుయం
   సుయణాణ సుహాసియం వోచ్ఛం"—

# వజ్జలగ్గ : : :

= శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు =

'వజ్జలగ్గ' కూడ గాథాసప్తశతివంటి యొక సంకలిత కావ్యము. దీనియందలి భాషయు దానియందువలెనే మహారాష్ట్రియు. దీని సంకలనకర్త జయవల్లభుడు. ఇతడు శ్వేతాంబరశాఖకు చెందిన జైనుడు. కాలము తెలియదు. ఈ 'వజ్జలగ్గ'కే 'జయవల్లభ' మనియు మారుపేరు[1]. ఈకావ్యమునందు నలుబది యెనిమిది పద్ధతు లున్నవి. దాదాపు ఏడునూరుల శ్లోకములు. కవి యీ సంకలన మొనర్చునాటికి హాలుని 'సప్తశతి' ప్రసిద్ధముగా నుండినది. అందుచే నీతడు గాథాసప్తశతి కూడ నొరవడిగా నుంచుకొనియుండును. ఈగ్రంథమునకు వ్యాఖ్యాకర్త రత్నదేవుడు. ఇతని కాలము విక్రమశకపు ౧౩౯౩.

'వజ్జలగ్గ'లోని సంకలనములలో 'గౌడవహము' లోని శ్లోకములు కొన్ని యున్నవి. సప్తశతిలోనివి కూడ కొన్నికలవు. సప్తశతిలోని ప్రసిద్ధమైన "అమియం పాఇయకవ్వం" అను గాథయు దీనియం దున్నది. సంకలితములనే కవి యేల చేర్చెనో! లేక యాత డేప్రతి జూచెనో! ఇతరగ్రంథముల కెట్లున్నను గాథాసప్తశతికి మాత్ర మనేకములగు పాఠాంతరములు, గ్రంథభేదములు కనబడుచున్నవి. హాలుడు తన సంకలనములం దాయాగ్రంథకర్తల పేరు లొసగినాడు. దానిచే నాటి యజ్ఞాతకవుల నామములు కొన్నియైనను తెలిసికొన వీలగుచున్నది. ఈగ్రంథమునం దాయవకాశమును లేదు. లేక, ఈతడు కూర్చునాటికి ఆచాటువులు, తత్కర్తలగు కవుల నామములు ప్రసిద్ధములుగా నుండెనో! ఎట్లును చెప్పలేము. మనకుమాత్రము నిరాశ తప్పనిసరియైనది. ప్రాకృతములు వ్యావహారికము లగుటచే నేటి వేమన పద్యములవలెనే నీచాటువులు జనసమూహమునం దత్యంతప్రసిద్ధము లైయుండెనేమో! వానిలోకూడ 'వరకులము'[2]ను గ్రహించి జయవల్లభుడు సంకలించెనట. ఇక పేరు లెందుకు సూచించును?

తన గ్రంథమునకు 'వజ్జలగ్గ'యని పేరిడుటకు జయవల్లభుడు కారణ మీరీతి జెప్పెను:

ఏకత్థే పత్థావే
జత్థ పఢిజ్జంతి పవురగాహావో
తంఖలు వజ్జాలగ్గం
వజ్జేత్తియ పద్ధయీ భణియా[3].

గోష్ఠియం దొకానొక ప్రస్తావమునందు పలుకు చాటువులకు 'వజ్జాలగ్గ'మని పేరట. 'వజ్జ' యనగా పద్ధతి యని జయవల్లభుడే వ్యాఖ్యానించెను. 'లగ్గ' లగ్న శబ్దభవ మగునా!

హాలుడు, జయవల్లభుడు - వీరిరువు రొనర్చిన కార్య మొకటే యైనను దృష్టులు విభిన్నములు. హాలుడు రాజు; శృంగారప్రియుడు; స్వయముగా కవి. స్థూలదృష్టితో జూచినప్పుడు సప్తశతిలోని సంకలనమున కొక నిర్దిష్టమగు నుద్దేశ్యము లేదని తోచినను—కొంత చిక్కగ నాలోచించినచో శృంగారమే హాలుని పరదైవత మని తేలును. హాలున కేమి? ప్రాకృతమునకే శృంగార ముపాస్యదేవత. జయవల్లభుడు జైనసన్యాసి. కనుక నతనికి ధర్మము ముఖ్యము. తరువాతి వర్థకామములు. అసలు కవితకు మోక్షోపయోగిత్వ మున్నదని మరి యాతడు నమ్మెనో లేదో! త్రివర్గములను మాత్రమే చేర్చినాడు.[4] 'వజ్జలగ్గ'లోని చాటువులను చూచినప్పుడు కామము నాత డానుషంగికముగనే

---

1. "విహిణా జయవల్లహం ణామ"
2. "వివిహకఇ విరఇయాణం
   గాహాణం వరకులాణి ఘేత్తూణ",
3. "ఏకార్థే ప్రస్తావే
   యత్ర పఠ్యంతే ప్రచుర గాథాః.
   తత్ఖలు వజ్జాలగ్గం
   వజ్జేతిచ పద్ధతి ర్భణితా."
4 "ధమ్మాయి తివగ్గజుయం
   సుయణాణ సుహాసియం వోచ్ఛం"—

చేర్చికొన్న ట్లున్న దంతే. ఇంత పెద్ద గ్రంథములో శృంగారమునుగురించినవి సుమా రొక నూరుశ్లోకము లైనను లేకుండుట కీయభిప్రాయముగాక మరేముం డును? తన కావ్యఫలమునుకూడ జయవల్లభుడు—

ఏయం వజ్జాలగ్గం
సవ్వం జో పఢయి అవసరమ్మి సయా
పాయియకవ్వకయిా
సో హోయి కిత్తిమంతోయ 5.

అంతేకాని హాలునివలె ప్రాకృతమును జదివిన వాడు 'కామతత్త్వ చింతన'యందు నిపుణు డగునని చెప్పలేదు. కనుక ఈసంకలనము ప్రాకృతభాషాతత్త్వ మునకు ఏకదర్పణము కాకున్నను, నాటి జనుల యాచార స్వభావములను, వారి జీవితములలోని లాలిత్యమును గ్రహించుటకు కొంతవఱకు తోడుపడు ననుటలో సం దేహము లేదు. ఒక కవి యన్నాడు చూడుడు.

అద్ధక్ఖర భణియాయింం
ణూణం సవిలాసముద్ధహసి యాయింం
అద్ధచ్ఛిపెచ్ఛియాయింం
గాహాహి వినా ణ ణజ్జంతి.6

సుందరులయొక్క యర్ధాక్షరభణితములు, సవి లాసముగ్ధహసితములు, అర్ధాక్షిప్రేక్షితములును గాథలు లేక తెలియవట. అనగా ప్రాకృత కవుల చాటువు లలో శృంగారమునకే సార్వభౌమత్వము. వారి చాటు వులును సంస్కృత కవిత్వము వలె శాస్త్రపుమర్యాదల తో, పాండిత్య బలముతో నడచునవి కావు. మరి "చింతామంథరమంథిత మగు విస్తరమైన కవిహృదయ సాగరమునందు బుట్టు రత్నములు." 7 ప్రా కృత సంస్కృత కవుల ధ్యేయమునందలి విభిన్నత ఈక్రింది శ్లోకములను పోల్చిచూచినప్పుడు మరింత స్పష్టముగా కనబడును.

కిం కవేః తేన కావ్యేన
కిం కాండేన ధనుష్మతాం,
పరస్య హృదయే లగ్నం
నఘూర్ణయతి యచ్ఛిరః.

ప్రాకృతచాటువు:—

రయణుజ్జలపయసోహం
తంకవ్వం జం తవేయి పడివక్ఖం
పురిసాయంతవిలాసిణి
రసణాదామమ్మివ రసంతం8.

సంస్కృతశ్లోకమునందు పాండిత్యబల మున్నది. ప్రాకృతచాటువునిండ హృదయమే. ఆప్రాకృతకవి ఉపమానములలోని తీపి, ఆతీపిలోని మనసు సంస్కృ తమున లేదు. ఆ ఉపమానము వారి లౌకికౌశలయందలి చాపల్యమునకు జయధ్వజమువలె నున్నది. ఆ ప్రాకృత కవుల దృష్టిలో కావ్యమునకును, ప్రేమకును భేదమే

---

(ధర్మాది త్రివర్గయుక్తం
సుజనానాం సుభాషితం వక్ష్యామి)

5. "ఏతం వజ్జాలగ్గం
సర్వం యః పఠతి అవసరే సదా,
ప్రాకృత కావ్యకవి
స్స భవతి కీర్తిమానపి"

6. "అర్ధాక్షరభణితాని
నూనం సవిలాస ముగ్ధ హసితాని,
అర్ధాక్షిప్రేక్షితాని
గాథాభిర్వినా నజ్ఞాయంతే."

7. "చింతామందరమంథాణ
మంథియే విత్థరమ్మి అత్థాహే
ఉప్పజ్జంతి కయిాహియ
యసాయరే కవ్వరయణాయిం."

(చింతామందర మంథాన
మథితే విస్తారే అస్తాఘే
ఉత్పద్యంతే కవిహృదయ
సాగరే కావ్యరత్నాని.)

8. (రత్నోజ్జ్వలపదశోభం
తత్కావ్యం యత్తాపయతి ప్రతిపక్షం,
పురుషాయమానవిలాసినీ
రశనదామేవ రసంతం)

లేదు.[9] అనగా, శృంగారము వారి జీవితములయందంత యోతప్రోత మన్నమాట. పైచాటువుకన్నను నింకను మెఱుగైన చాటు వింకొకటున్నది. చూడుడు:

ఛన్నం ధమ్మం, పయడం
  చ పోరిసం, పరకలత్త వంచణయం,
గంజణరహిఆో జమ్మో
  రాధాయిత్తాణ సంపడయి[10].

అనగా, ప్రాకృతకవుల దృష్టిలో ఛన్నముగా ధర్మమును సాధించుకొను నిష్ఠాశీలునకును, పరకళత్రములను వంచించి సుఖించు పుణ్యాత్ముడైన భోగికిని అవగింజంతయైన భేదము లేదన్నమాట. వారి చాపల్యమునకు హద్దులే లేవు. వారనుభవించిన సుఖములోని లాలిత్యమునకు, వైవిధ్యమునకుకూడ హద్దులు లేవు. జయవల్లభునివంటి సన్యాసికికూడ ప్రాకృత కావ్య పరిచయముచే—ధర్మమునం దెంతగా దనకు పట్టుదలయున్నను దన కావ్యమునందు సురతపద్ధతి నొకదానిని చేర్పు బుద్ధి పుట్టినది. వారి శృంగారమునకు మరుగులు లేవు; ఉపకరణములు లేవు. ప్రాకృతకవులు ప్రకృతి పెంచిన బిడ్డలు. వారి విలాసములు, ఈర్ష్యామానములు అన్నియు ప్రకృతిని చూచి నేర్పుకొన్నవే. ప్రకృతి నుండి వారిని విడదీయ యత్నించినచో సాధ్యము కాదు. ప్రకృతి లేక వారు లేనేలేరు.

ప్రాకృతకవులు ప్రకృతిని ప్రేమించినవిధము అసాధారణమైనది. ఆకు ఆకులో, పూవు పూవులో జీవితమును, ప్రేమను దర్శించిన పుణ్యులు వారు. ఆ తరుణ లలితములగు నెమలిపురులు చెక్కుకొని పోవు శబరకాంతలు, మానమాణిక్యమును విడువ వీలు లేక కన్నీరు పెట్టు హరిణాంగన, ప్రియురాలిని తలచుకొని తొండముతో నెత్తికొన్న కిసలయకబళమును దినక నిశ్చల స్తిమితమైనవనగజము, పల్లకీలతా పరిముషితశిఖరమైన వింధ్యపర్వతము ప్రాకృతకవులు మహాతపస్సు జేసి కవితాలోకమునకు దించుకొన్న వస్తువులు. వింధ్యపర్వతము వారి యింటిదేవత. ప్రాకృతకవనమునందలి స్త్రీలకు శ్యామలవర్ణ మెక్కువ ప్రియమైనది. అట్లే 'శ్యామా' యను పదముగూడ. ప్రాకృత నవోఢ యెట్లున్నదో చూడుడు:

మగ్గమ్మియ అలహంతో
  హారోపీణుణ్ణయాణ థణయాణం
ఉబ్బింబో భమఇ ఉరే
  జవుణానయిఫేణ పుంజోవ్వ.[11]

ఆ మెళకీరము నల్లనిది. పయోధరము లున్నతములు. ఆ నల్లని స్తనములపై తెల్లని హారము కదలుచున్నప్పుడు యమునానదీఫేనపుంజమువలె కాక మరెట్టు లుండును ?

విశకలితములై కాలవాహినిలో కలసిపోవుచున్న ప్రాకృత గాథలకు స్వరూపమిచ్చిన జయవల్లభుడు మహాధన్యుడు. మరి వానిని చదువువారు ?

పాఇయకవ్వమ్మి నమో
  పాయియకవ్వంచ ణిమ్మియం జేణ
తాహంచియ ఫణమామో
  పఢిఊణయ జేవియాణంతి.[12]
వారి కదే తగిన పురస్కృతి.

---

9. "జం ణఘుణావయి పీసం
కవ్వం పెమ్మంచ కిం తేన"
(యన్నఘూర్ణయతే శీర్షం
కావ్యం ప్రేమ చ కిం తేన)

10. "ఛన్నోధర్మః ప్రకటం
చ పౌరుషం పరకళత్ర వంచనమ్,
కలంకరహితమోజః
భవాత్మనాం సంపద్యతే"

11. "మార్గమేవాలభమానః
హారః పీనోన్నతయోః స్తనయోః
భీతో భ్రమత్యురసి
యమునానదీ ఫేనపుంజఇవ."

12. "ప్రాకృతకావ్యాయ నమః
ప్రాకృతకావ్యంచ నిర్మితం యేన,
తేభ్య ఏవ ప్రణమామః
పఠితుంచ యేభిజానంతి."

నాణ్యము, బరువు, చౌకధరలకు

రోషన్ సబ్బులనే తప్పక వాడుడు.




## రోజ్ - ది

## రాక్సీ

కార్బాలిక్ 36%

సోల్ ఏజంటు:—

ఆర్. ఎన్. రాజన్,

43, బందరువీధి, మద్రాసు.

---

ఆర్యరసాయనశాల

ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925

ప్రశస్తాయుర్వేదౌషధములకునిలయము. ఏమందుకావలసిననుమాకువ్రాయుడు. నమ్మకమైనవిలభింపగలవు.

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకరశాస్త్రి ఎ.ఎం.బి.

CONSULTING PHYSICIAN

---

డా॥ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి

& సన్సు, రాజమండ్రి.

## ప్రకటన

ఔషధములను తయారుచేయు దినుసులన్నిటికిని ధరలు విపరీతముగ పెరిగిపోయినవి. అందుచే మేముకూడ కొన్ని మందులకు ధరలను కొద్దిగ హెచ్చింపవలసి వచ్చినది. మరియు జనరలుగ ఇచ్చుచున్న రెండు అణాలు కమీషనును కూడ తగ్గించడమైనది. గాన ఈవిషయము అందరకును తెలియపర్చడమైనది.

ఇట్లు,

డాక్టర శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# భీమఖండము - శ్రీనాథుడు

●

= శ్రీ క్రొవ్విడి రామం =

పలుకుపలుకునా రసాన్ని ఒలికించి, ముద్దులుమూట కట్టేటట్టు ముచ్చటైన సరళిలో కావ్యాల్ని రచించిన మహాకవి శ్రీనాథుడు. బతుకుబాటలో మజిలీలన్నీ జాగ్రతగా పరిశీలించి, సింహాచలక్షేత్ర సందర్శనానికి వచ్చిన నియోగిభామ మొదలు పల్నాటిసీమలో చవిచూసిన జొన్నకూడువరకూ అన్నీ కూడా యీయన కవితాసామగ్రిగా పరిగణించి, వాటిని అతి మనోజ్ఞంగా వర్ణించేడు. నిశితప్రతిభావంతుడైన పండితుడూ, రసికత పెరిగిన కవీ కావడంచేత విద్వదౌషధమనీ, అయఃపిండమనీ ప్రసిద్ధిపొందిన కావ్యాల్ని ఆంధ్రంలోకి అనువదించి తన పాండిత్యపటిమను, కవితానైపుణ్యాన్ని ప్రదర్శించేడు. జీవితవిధానంలో వుండే వివిధప్రవృత్తులను ఆహ్లాదకరంగా నిరూపించడంతో పాటు భక్తిభావాన్నికూడా శ్రీనాథుడు చక్కగా ప్రదర్శించేడు. పోతన శ్రీహరిదివ్యకథామృతాన్ని తన్మయత్వంతో సంకీర్తనచేసినట్టే, యీమహాకవి పరమశివుని గుణగణాల్ని భక్తిపారవశ్యంలో వర్ణించి తరించేడు.

## గ్రంథ విశిష్టత

అంతే కాదు. తెనుగు సీమలో మహాక్షేత్రమని పేరుపొందిన దక్షారామ క్షేత్రంయొక్క స్థలపురాణాన్ని తెలుగు భాషలోకి అనువదించి ఆంధ్రులకు మహోపకారం చేసేడు. ఆంధ్రభూమికి త్రిలింగదేశం అనే పేరు వున్నట్టు మొట్టమొదట బ్రహ్మాండ పురాణంలో కనపడుతున్నదని శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు ఆంధ్రదేశచరిత్రలో వ్రాసేరు. బ్రహ్మాండపురాణం పదకొండవ శతాబ్దిలో వ్రాయబడిందని పండితుల అభిప్రాయం. కాబట్టి త్రిలింగదేశానికి ఒక సరిహద్దుగా వున్న భీమేశ్వరాలయం పదకొండవ శతాబ్దికి ముందునుంచే లోకుల మన్ననలను పొందుతున్నప్పటికీ, యీక్షేత్రంతాలూకు ప్రతిభను తెలియజేసే గ్రంథం ఆంధ్రంలో పదిహేనో శతాబ్దివరకూ వెలువడలేదు. ఈస్థలపురాణాన్ని అతిహృద్యంగా ఆంధ్రీకరించిన మహాకవి శ్రీనాథుడు. ఈ ఆంధ్రీకరణం ౧౪౩౦లో జరిగివుంటుంది. దీనికి మూలం స్కాందపురాణంలో వుంది.

"ఈభీమేశ్వరస్వామి ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకాకు చెందిన దక్షారామమునందు వెలసిన మహాదేవుడు. ఈ దక్షారామమునకు ప్రాచీన శాసనములందు 'డాకిరేమి'యను పేరుండెను. ఆ 'డాకిరేమి' యను దేశియనామమే దక్షారామమని సంస్కృత రూపమును దాల్చినది. ఈభీమనాయకుని చాళుక్యనృపసోముడైన భీముడు ప్రతిష్ఠించి, యీదేవునికి తన పేరిడి యచ్చట నొక శివాలయమును నిర్మించెను. ఇది చరిత్రప్రసిద్ధమైన విషయము. అట్టి చరిత్రాత్మకమైన వృత్తాంతమున కొక పురాణమును బుట్టించి, డాకిరేమిని దక్షారామముగా మార్చి, దాని కొక క్షేత్రమాహాత్మ్యమును గల్పించి, యాస్థలమే దక్షు సవనాగార మని సవరించి, యచ్చటనే గ్రహరాజగు భానుడు కైలాసమునుండి శివుని దీసుకొని వచ్చి, భీమేశ్వరు డను నామముతో నాసోమశేఖరుని దక్షారామములో బ్రతిష్ఠించెనని యొక పెద్ద పురాణమును మన పూర్వులు గల్పించిరి" అని శ్రీ కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ. గారు వావిళ్లవారి సమ్మానసంపుటంలో వ్రాసేరు. రమారమి పదవ శతాబ్దిలో ఈ భీమేశ్వరస్వామి ఆక్షేత్రంలో ప్రతిష్ఠింపబడివుంటాడని వీరి విశ్వాసం.

## సరిక్రొత్త సంప్రదాయం

ప్రౌఢనిర్భరవయఃపరిపాకంలో భోగమోక్షప్రదమైన యీక్షేత్రమాహాత్మ్యాన్ని తెలిగించి శ్రీనాథుడు తన బంధువైన అన్నయమంత్రికి కృతియిచ్చేడు. అయితే కృతినాథుని వంశవర్ణనతోపాటు కృతిపతికి

ఏలిక అయిన వేమభూపాలుని వంశవర్ణన కూడా యీ గ్రంథంలో కనపడుతుంది. ఇది ఒక విశిష్టమైన సంప్రదాయ మనే చెప్పాలి. ఆవర్ణనలనుబట్టి చూస్తే ఆరాజ్యం దేవబ్రాహ్మణభక్తివర్ధితమయినదిగా తెలుస్తున్నది. అతని కాలంలో బ్రాహ్మణులు దర్భలకు బదులుగా వారి వేళ్లకు మాణిక్యాంగుళీయకములను పెట్టుకునే వారుట. బ్రాహ్మణాగ్రహారాల్లో ఎక్కడ చూసినా వెండి, బంగారం సమృద్ధిగా వుండేవిట. పైగా వేమభూపాలుడు పుణ్యక్షేత్రాలలో ఎన్నో భూదానాలు చేసినట్టు యీ క్రింది పద్యంవల్ల మనకు తెలుస్తున్నది:

"కాంచీ శ్రీగిరి కాశీ
పంచారామాదిదేవ భవనంబుల వ్రా
యించెను వేమక్ష్మాపతి
యాంచితభూదానశాసనాతురపంక్తుల్."

ఈ ప్రభువుకి అమాత్యశేఖరుడైన అన్నయమంత్రి సర్వసమర్థుడు. శివభక్తాగ్రేసరుడు. సర్వసామ్రాజ్యాధిపతి అయిన అహమదు నేనుకు వేమభూపాలుడు లేఖ వ్రాయవలసివస్తే, పారసీభాషలో ఆ ఉత్తరప్రత్యుత్తరాలన్నీ అన్నయమంత్రే జరిపేవాడనీ, ఆ వర్ణపద్ధతులు కన్నులపండుగగా వుండేవనీ శ్రీనాథుడు మెచ్చుకున్నాడు. "అరబీభాష, తురుష్కభాష, గజకర్ణాటాంధ్రగాంధార ఘూర్జరభాషల్ మళయాళభాష, శకభాషాసింధుసౌవీరబర్బరభాషల్ కరహాటభాష, మరియుం భాషావిశేషంబు లచ్చెరువై వచ్చు నరేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్" అని యీకవి వ్రాయడంచేత కృతిపతి బహుభాషావిశారదుడని మనకు తెలుస్తున్నది. కృతిని తప్పించి సప్తసంతానాలు పొందే భాగ్యం యీ అన్నయమంత్రికి కలిగింది. ఆలోటు తీర్చడానికే తన కొక గ్రంథం అంకితం ఇమ్మని యితను శ్రీనాథుని అర్థించేడు. ఇందుకళాధరుడే యిలవేల్పుగా గల కవి యీ స్థల పురాణాన్ని అతనికి అర్పించేడు. ఇందులో కూడా ఒక విశేషం వుంది. శివభక్తాగ్రేసరుడైన అన్నయమంత్రి భీమేశ్వరాలయానికి మంటప ప్రాకారాదులను నిర్మించేడు. అవిషయంకూడా భీమఖండంలో వున్న యీ ద్విపాదాలవల్ల మనకు తెలుస్తున్నది.

"దక్షవాటికయందు దరుణేందుమౌళికి
మెంగళివాకిట ధామమును రచించె"
"ప్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున
సప్తముని సింధుసోపాన సరణికలన
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయ యన్నయామాత్యవరుడు"

అన్నయమంత్రికి ప్రీతిజనకమైన యీ ఆలయం యొక్క కీర్తి శాశ్వతంగా వుండిపోవా లని శ్రీనాథుడు యీ క్షేత్రప్రతిభను వివరించి అతనికి కృతియిచ్చినట్టు కనపడుతుంది.

## శృంగారరస రక్తిమ

శ్రీనాథమహాకవి శృంగార రసపిపాసి అనిన్నీ, స్త్రీలోలు డనిన్నీ అందరూ చెప్పుకుంటారు. ఈరక్తిమ కృతిపతిలో కూడా వున్నట్టు కనపడుతుంది. కృతిపతిని "పంచారామవధూటీ పంచాస్త్రవిహార కేలి పాంచాలు"డని యీకవి వర్ణించేడు. కృతిలో ప్రధానపాత్ర వహించిన భీమేశ్వరస్వామికూడా తదనుగుణంగానే చిత్రింపబడ్డాడు. ఫాలనేత్రంతో పంచాస్త్రుడిన్ని దగ్ధంచేసిన పరమశివుడు యీ క్షేత్రంలో సానికూతులతో విహరించేవాడు. మచ్చుకు రెండు పద్యాలు చూడండి:

"ఎవయంగల్గిన కూర్మి భృంగిరిటిగా
నీ, తండుగానీ నికుం
భునిగానీ కయిదండ పట్టుకొని సం
భోగేచ్ఛ నంతఃపురాం
గవలం గన్నుమొఱంగి యప్పురమునం
గన్నెరు కాదారి ప్రా
ద్దున భీమేశుడు సానివాడ కరుగున్
ధూర్త ప్రకారంబుగన్"

"గజచర్మ మెన్నడో కాని నిచ్చలుగట్టు
పసిడికమ్ముల పట్టుపచ్చడంబు
భసిత మెన్నడో కాని ప్రతిదినంబులయందు
మలయజంబు కురంగమదము గూర్చు
నిడుదపాములరాజు తొడవు లెన్నడోగాని
ధరియించు కల్హారదామ మెపుడు

* * *

నెన్నడో పిశాచులనుగాని యిందుముఖుల
నెల్ల కాలంబు దలచు భీమేశ్వరుండు".

భోగమోక్షప్రదమైన క్షేత్రంలో వెలిసేడుగనక రాగసంజాతుడైనప్పటికీ భీమేశ్వరుడు మాత్రం నిరుపమానమహిమాసమన్వితుడని యీక్రింది పద్యపాదాల వల్ల వ్యక్తమవుతుంది.

"హాలాహలం బను నల్లానేరెడిపండు
మిసిమింతుడునుగాక మ్రింగినాడు
పెనుత్రేలి కొనగోర బిసరుహాసను మోము
గెందమ్మివిరివోలె గిల్లినాడు
పంచవన్నియతోడ బ్రసవవారాచుని
నెత్తుటిచ్చురకంట జొత్తినాడు
మెఱుగుగోఱలు దుల్ల మృత్యుదేవతనోరు
ఘట్టించి యఱకాల దన్నినాడు"

భీమఖండంలో కథావిధానాన్నిగురించి ప్రత్యేకంగా వ్రాయవలసినది యెక్కువగా వుండదు. ఇది స్థలపురాణంగనక మొదటినుంచి కొసవరకూ దక్షారామం దక్షిణకాశి అనీన్నీ, కాశికంటే యిదే పుణ్యతమమైన క్షేత్రమనీన్నీ, భీమనాయకుడు భక్తులపాలిటి కల్పవృక్షమనీ వుంటుంది. అయితే మహాకవి అనువదించేడుగనక ప్రతిపద్యం అతిహృద్యంగా వుంటుంది.

## వ్యాసుని భక్తిపరీక్ష

వ్యాసుని భక్తి పరీక్షిద్దామని పరమేశ్వరుడు వారంరోజులు కాశిలో అతనికి ఒక్క మెతుకైనా పుట్టకుండా చేస్తాడు. ఆకలిమంటతో అటమటలాడుతున్న తపసి భిక్షాపాత్రను నేలకేసి కొట్టి, "మాభూత్ త్రైపూరుషీ విద్యా, మాభూత్ త్రైపూరుషం ధనం, మాభూత్ త్రైపూరుషీ భక్తిః కాశ్యాం నివసతాంసదా" అని శపించబోతాడు. ఆసమయంలో పార్వతి ముసలి ముత్తైదువవేషంతో అడ్డువచ్చి, అతని నిగ్రహాన్ని పరీక్ష చెయ్యడానికి యిది అభవుడు చేసిన పరీక్ష అయివుంటుం దనీన్నీ, లేకపోతే కాశీవంటి క్షేత్రంలో భిక్ష పుట్టకపోవడం అసంభవమనీ చెప్పి, శిష్యసమేతంగా వ్యాసుణ్ణి భోజనానికి రమ్మని ఆహ్వానిస్తుంది. వారంతా అరటాకులవద్ద కూర్చున్నారుగాని, వంట చేసిన చిహ్నాలు యెక్కడా కనపడకపోవడంచేత ఆందోళనతో ముం దేమి జరగబోతుందో అని యెదురు చూస్తూవుండగా, ఆపోశనం పట్టమని ఆగృహిణి ఆజ్ఞాపించింది. తదాజ్ఞానుసారం శివనామస్మరణతో కూడా పరిషేచన చేసేసరికల్లా, వాటంతట అవే పప్పు, పిండి వంటలు మొదలైనవి అరటాకులలో ప్రత్యక్షమయ్యాయి. తరువాత,

"ఎవ్వ డీపదార్థ మెంతేని జింతించు
నతని కాపదార్థ మంత గలిగి
యరటియాకుమీద నవతారమైయుండు
నిట్టిమహిమ చూడ మెన్నడేని"

ఆమహిమను చూసి, ఆముత్తైదువ నిశ్చయంగా జగదంబ అయివుంటుం దని నిర్ణయించుకున్నారు. వారి క్షుధాశాంతి అయినతరువాత ఈశ్వరుడు ఉమాసహితంగా వ్యాసునివద్దకు వచ్చి, తన శుద్ధాంతకాంత అయిన కాశిని శపించబోయినందుకుగాను వ్యాసుడు ఆస్థలాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోవలసిన దని ఆజ్ఞాపించేడు. పారాశర్యుడు దేశసంచారార్థం కాశినుంచి నిర్గమిస్తాడు. పీఠికాపురందగ్గర అగస్త్యుడు ఎదురుపడి వ్యాసుని ఖేదకారణాన్ని కనుక్కుంటాడు. అప్పుడు అగస్త్యమహర్షి వ్యాసునికి దక్షారామభీమేశ్వరమహిమను వెలువరిస్తాడు. తరువాత యిద్దరూ ఆకాశమార్గం గుండా ముందు యీక్షేత్రాన్ని సందర్శించి శుభసమయంలో అక్కడ ప్రవేశిస్తారు. వ్యాసుడు పరితప్త హృదయంతోనూ, తన్మయత్వంతోనూ భీమేశ్వరుని ప్రార్థిస్తాడు. అగస్త్యుడు తీర్థమాహాత్మ్యాన్ని అతనికి నివేదిస్తాడు. తరువాత క్షీరసాగర మథనవృత్తాంతం యిక్కడ వివరింపబడింది. మథనసమయంలో విఘ్నేశ్వరపూజ మరిచిపోవడంచేత అమృతానికి బదులుగా హాలాహలం పుట్టింది. భయంకరమైన జ్వాలాకుల క్ష్వేళాన్ని మింగి లోకాన్ని రక్షించడంచేతనే యీ క్షేత్రంలో వెలిసిన శివుడికి భీమనాయకు డని పేరు వచ్చిందిట. ఈక్రిందిపద్యం చూస్తే ఆవిషయం మనకు సుబోధకమవుతుంది.

"భీమమగు గరళకూటము
భూమియు, గగనమును దిశల బొడచూపినచో
భీమగతి మ్రింగెగావున
భీమేశ్వరు డయ్యె నితడు బిరుదాంకమునన్."

త్రిపురాసురవధ, తుల్యభాగఉత్పత్తిక్రమం చెప్పి, తరువాత సూర్యుడు కైలాసానికి వెళ్లి ఉమా సహితంగా మహేశ్వరుణ్ణి దక్షారామానికి తీసుకు రావడం, శివుడు భీమనాయకునిలో ఐక్యమవడం కూడా యీపురాణకర్తలు వివరించేరు. ఆవిషయా లన్నీ చక్కగా అనువదింపబడ్డాయి. సప్తమునిస్తోత్రం తోనూ, గౌరికి శంకరుడు భక్తివిజ్ఞానయోగం ఉపదేశించడంతోనూ గ్రంథం సమాప్తి చెందుతుంది.

### భక్తిభావము

మిసిమిజవ్వనుల వలపువగల సొంపును చిత్రించడంలోనే యెక్కువ మక్కువ చూపే యీకవి భీమనాయకుని మహిమను వివరించినప్పుడు యథార్థంగా అమితమైన భక్తిభావాన్ని ప్రదర్శించేడు. కొన్ని చోట్ల భక్తిభావవిలసితములైన పద్యాలు పోతనగారి పద్యాల్ని మించివున్నాయా అనిపిస్తుంది. పరితప్త హృదయంతోనూ, భక్తిపారవశ్యంతోనూ వ్యాసుడు భీమేశ్వరుని సందర్శించిన దృశ్యాన్ని యీకవి యెంత చక్కగా వర్ణించేడో చూడండి:

"పరిరంభ మొనరించు బాహాద్వయంబున
దేవదేవుని సుధాదివ్యమూర్తి
దాకించుకొను జటాస్తబకంబువిరియంగ
బానవట్టముతోడ ఫాలతలము
గురుదక్షపురితోడగూడ బట్టణమున
కంగప్రదక్షిణం బాచరించు
బాతాళభైరవప్రముఖనానాదిశా
పరివార దేవతాప్రతతి దెలుపు
కాశికాపట్టణద్రోహి గావు మభవ
విశ్వపతిదూషితుని బ్రోవు విశ్వనాథ
కల్ల చేసితి రక్షింపు కాలకంఠ
యనుచు బ్రార్థించు భీమనాయకుని దపసి"

పోతనగారు "కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" అని ప్రహ్లాద చరిత్రలో వ్రాసిన పద్యానికి సరిగ్గా ప్రతివచ్చే పద్యం మనకు భీమఖండంలోకూడా కనపడుతుంది.

"శ్రీభీమనాయక శివనామధేయంబు
జింతింపనేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్ష మోహనమూర్తి
జూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయిపావనకీర్తి
చే నింపనేర్చిన చెవులు చెవులు."

అని యీవిధంగా పద్యం అంతా నడిపించేడు.

ఒక ఘట్టం అంతా పూర్తిగా చిత్రిస్తే అక్కడ ప్రదర్శించిన భక్తిభావం పాఠకుని మనోనేత్రం ముందు స్ఫుటంగా గోచరిస్తుంది. కాని యీ చిన్న వ్యాసంలో అంత విస్తరించడం సాధ్యం కాదు. మూడవ ఆశ్వాసంలో "జయజయ దేవగంధర్వసిద్ధవిద్యాధర" అన్న దగ్గరనుంచి రమారమి ఆశ్వాసాంతంవరకూ వున్న గద్యలో భక్తిభావం మూర్తీభవించివుంది. అది చదివితే ఉక్కుకన్న కఠినమైన గుండె కల పాషండునికికూడా హృదయంలో భక్తిభావం ఉప్పొంగుతుందేమో అనిపిస్తుంది.

### నవ్యకావ్యకళా చమత్కృతులు

అయితే యీ గ్రంథం ఆంధ్రదేశమంతటా బహుళ వ్యాప్తిని పొందాలనే ఉద్దేశంతో శ్రీనాథుడు యీ రచనలో నిరుపమానమైన నవ్యకావ్యకళాచమత్కృతులను ప్రదర్శించేడు. ఇది కేవలం స్థలపురాణమైనప్పటికీ రసవత్తరమైన కావ్యఫక్కిలోని కొత్తపోకడలు యిందులో కనబడుతున్నాయి. దక్షవాటి భోగమోక్షప్రదమైన క్షేత్రమని యిదివరకే మనవిచేసేను. ఈ క్షేత్రం అజరామరమైన కీర్తిని పొందాలని దీనిని యీకవి యెంత రమ్యంగా వర్ణించేడో చూడండి.

"ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ
గంధవాహుని యాలు కసవునూడ్చు
లక్ష్మి కెంగేలి లీలారవిందమ్మున
గలయంపి చిలికించు గమ్మదేనె
బ్రామపర్ణియు దాను తారకాపథగంగ
వలిముత్యముల రంగవల్లి దీర్చు
నధివాసమును జేయు యముని శుద్ధాంతంబు
ధూపార్తి మహిసాక్షి ధూమఘుటిక
సప్తపాతాళ నాగేంద్ర చంద్రముఖులు
ఫణమణి జ్యోత్స్న దివియంగ బలము లసుదురు

సోమమఖటుని గారాబుజోటియైన
దక్షువాటికి బ్రతిమహోత్సవమునందు."

నలరాజును గెలిచిన మహామహుణ్ని కూడా వల పించే ప్రౌఢలు అక్కడ వున్నారుట. ఈక్రిందిపద్యం ఆ వలపుల పొలతుల సోయగాన్నీ, శ్రీనాథుని పీసపు నడకసొంపునీకూడా వ్యక్తీకరిస్తుంది :

"ముడువంగనేర్తురు మూలగమ్మనితావి
గలుగు క్రొవ్విరులు లో గందపండ
మురియంగనేర్తురు మోహావాస్పదమైన
మొుగలివాకిటిచాయ నగరవీథి
వలపింపనేర్తురు నలరాజు గెలిచిన
పెద్దగాలము వేల్పు భీమనాథు
బలుకంగనేర్తురు పాటలాధరముల
మొల్కలేనగవులు ముద్దు గురియ
జందురునితోడ, కల్పవృక్షములతోడ
దారతో లక్ష్మితో నమృతంబుతోడ
గౌస్తుభముతోడ మున్నీట గలిగివారు
విబుధ గంధర్వజాతు లవ్వీటి సతులు."

మహేంద్ర వైభవంతో తులతూగుతున్నప్పటికీ, యిది పుణ్యభూమి గనక—

"అచట దానంబు హోమ మధ్యయనవిధులు
శ్రాద్ధమును దేవతా సమర్పనము వ్రతము
లొక్కటొక్కటి కోటిగుణోపలబ్ధి
సంభవించును సతతంబు సాధకులకు."

అని యీ కవి ముచ్చటించేడు.

## పలుకుబళ్లు

భావుకు జీవకళలను ప్రసాదించే చవి గల పలుకుబడులు కొన్ని వుంటాయి. వాటిని యథార్థంగా ప్రయోగిస్తే రసార్ద్రహృదయానికి అరచన పరమ ప్రమోదదాయకంగా వుంటుంది. గ్రంథం సర్వులకూ శిరసా పరిధార్య మవుతుంది. ఆ చవి గల పలుకుబళ్లనే ఇంగ్లీషులో Idioms అనీ, మరికొన్నింటిని సామెతలనీ అంటారు. అటువంటి హృద్యమైన ప్రయోగాలు యీ క్రింది పద్యంలో శ్రీనాథుడు యెంత చక్కగా ఉపయోగించేడో చూడండి :

"కూడు పెట్టకయేవాళ్ల కుతిలపరచి
గాసి సేయుట యిది తప్పు గాదె తనకు
నెదురు కెదురేల కోపించె నిందుధరుడు
అకట గుడ్డెద్దు బాదరాయణుని మీద."

'గుడ్డెద్దు' అనే ప్రయోగం అప్పటికే శిష్టజన వ్యవహృతమై వున్నదన్న మాట. కేవలం సన్నిహితుల విషయంలో కూడా నిష్ఠురంగాను, నిర్మొగమాటంగాను మాట్లాడితే "ముక్కు మొగం చూడకుండా అలా అనడమే" అని లోకులు వాడతారు. ఆప్రయోగంకూడా యీ గ్రంథంలో మూడో ఆశ్వాసంలో కనపడుతుంది. "ముక్కు మొగంబు చూడ కొక మోసపు మాటకు విశ్వనాయకుండు..." "గొడ్డె క్రొవ్వియు నెలగ్రస్తె కొరికినట్లు" "పువ్వు ముడిచిన పురవీథి భూమియందు గట్టె మోవంగవలసిన కారణమున" మొదలైన సామెతలుకూడా భీమఖండంలో యీకవి ప్రయోగించేడు.

## నాటకీయధోరణి

నాటకంలోని దృశ్యాల్లాగే యీ గ్రంథంలో కూడా కొన్నికొన్ని సంఘటనలు కళ్లకు కట్టినట్టుగా వివరింపబడ్డాయి. అవిధమైన సంఘటనా సంవిధానమూ, మూలానికే మెరుగుపెట్టే వర్ణనాచమత్కృతీ, భావశబలతా ఉండడంచేతనే,దీనిలో కావ్యకళ ప్రకటితమయినదని మనవిచేసేను. అక్షుద్రక్షుధాశాంతికోసం పార్వతి వ్యాసునికి, అతని అంతేవాసులకు పెట్టిన భిక్ష, ఆ సందర్భంలో ఆమెచూపిన మాహాత్మ్యంకూడా రసిక హృదయ హృదయాహ్లాదకరంగా వివరింపబడ్డాయి. పాత్రల హావభావ విలాసాల్ని చిత్రించడంలో కూడా యీకవి నిరుపమానమైన ప్రతిభను ప్రదర్శించేడు. అగస్త్యుడుకూడా వ్యాసునిలాగే దక్షిణదేశానికి వలస పోయిన మహర్షి. కాశీనుంచి బహిష్కరింపబడి దేశ సంచారం ప్రారంభించిన వ్యాసుడు అగస్త్యుని కలుసుకున్న సందర్భంలో అవ్యాజంగా వారి హృదయాంతరాళాల్లోనుంచీ ఉప్పొంగివచ్చే ప్రేమను యీకవి మనోజ్ఞంగా వివరించేడు.

"యోజనగంధినందనుడు,
సూర్యశిపట్టియు నిర్ణిరోధని
ర్వ్యాజ నిరంకుశ ప్రణయ
వైభవ సంపద సొంపు మావసాం

భోజములం దలిర్ప ముని
పుంగవు లొండొరు గౌగిలించి వి
భ్రాజితలీల జల్పిరి ప
రస్పరముం గుశల ప్రసంగముల్."

"వినయము భక్తియు సంభ్రమ
మును సౌహార్దంబు హృదయముల మెలతేరన్
వినుతిరొనర్చి రగస్త్యున
కును వైశంపాయనాదికులు మునిశిష్యుల్"

### భావనాశక్తిసంపద

కవిత్వం ఉత్తమశ్రేణికి చెందిం దని చెప్పడానికి దానిలో హృదయావేశము (Emotion), భావనాశక్తి (Imagination) కూడా వుండా లని ఆలంకారికుల సిద్ధాంతం. అప్రతిహత ప్రతిభా సమన్వితుడైన యీ మహాకవి యీ రచనలో చేసిన వర్ణనలవల్ల ఆ భావనాశక్తి మనకు వ్యక్తమవుతుంది. అప్పుడే తూర్పు దిక్కునుంచీ పైకి ఎగబ్రాకుతున్న చీకట్లు కెంపువారిన సంధ్యారాగంతో మిళితమైనప్పుడు బ్రహ్మాండభాండం బాగా పండి, దానంతట అదే చెట్టునుండి పడిపోయిన తాటిపండులాగా వుందని ఉత్ప్రేక్షించి యీ క్రింది పద్యం చెప్పేడు.

"సంజకెంపును దిమిరపుంజంపు నలుపు
గమిచి బ్రహ్మాండభాండంబు గరము మెరసె
పరమపరిపాకదశ వృంతబంధ మెడలి
పతనమగు తాటిపండుతో ప్రతిఘటించి."

మూలంలో లేనప్పటికీ, యితను తన భావనాబలంచేత యెన్నో యిటువంటి రమ్యమైన వర్ణనలను చేసేడు. అర్థాలంకారాలే కాకుండా యీ రచనలో ప్రయోగించిన శబ్దాలంకారాలు కూడా కృతికి అలంకారభూతాలుగా వుండి శ్రీనాథుని ప్రతిభను తెలియచేస్తున్నాయి. సీసపద్యంలో ప్రతిపదంకూడా "భ"అనే అక్షరంతో ప్రారంభించి, పద్యాన్ని కొసవరకూ యెంతో శ్రవణపేయంగా నడిపించేడు. మచ్చుకు రెండుపాదాలు చిత్తగించండి.

"భవు భవానీభర్త భావసంభవవైరి
భవరోగభంజను భాలనయను
భోగప్రదుని, భోగి, భోగిరాజ విభూషు
భూవభోభివ్యాప్తు భువనవంద్యు"

పద్యం అంతా యీ ప్రకారంగానే నడిచింది.

### హృదయావేశము

హృదయావేశంకూడా యథార్థంగా యీరచనలో మనకు వ్యక్తమవుతుంది. ఆకలిమంటతో ఆటమట లాడుతున్న వ్యాసుడు కోపోద్రేకంతో భిక్షాపాత్రను నేలకేసి కొట్టిన సందర్భంలో వ్రాయబడిన పద్యం చదివితే మనకే గుండె ఝల్లుమంటుంది.

"కుక్షిప్రోద్భవ నిష్ఠురక్షుధితుడు
ప్రోద్ధాంధకారంబునం
చక్షుల్ రెండును జిమ్మచీకటులుగా
సంరంభ శుంభద్గతిం
ప్రేక్షచ్ఛాత్రులు భీతిబొంద గడు ను
ద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము రాతిమీద శతధా
భిన్నంబుగా వైచితిన్".

సంసారబంధాన్ని సడలించి, జీవునికి ముక్తిమార్గాన్ని ప్రదర్శించే సాధనాల్లో భక్తియోగం ఒకటి. నిశ్చలమైన భక్తిభావం స్థిరీకృతమైవుండడానికీ, దేవదేవునిపైన భక్తిప్రపత్తులు అభివృద్ధి చెందడానికీ యీ పుణ్యక్షేత్రాలు వెలిసేయి. అలాంటివాట్లో దక్షారామం అగ్రస్థానాన్ని అలంకరిస్తుంది. అక్కడ ఆలయానికి మంటపాది కట్టడాలతో శోభను చేకూర్చిన అమాత్యశేఖరుడు, శివభక్తాగ్రేసరుడు అన్నయమంత్రి. ఈ క్షేత్రానికి ఆచంద్రతారార్కమైన కీర్తిప్రతిష్ఠలు వచ్చేటట్టు యీస్థలపురాణాన్ని ఆంధ్రంలోకి అనువదించి తరించిన మహాకవి శ్రీనాథుడు. ఈయన వ్రాసిన శివరాత్రిమాహాత్మ్యం, కాశీఖండం మొదలైన కృతులు శివభక్తిప్రయుక్తాలుగానే వున్నా, ప్రౌఢనిర్భరవయః పరిపాకంలో చెప్పిన యీ భీమనాయకుని మహిమ కావ్యకళలతో, కొత్తవెలుగుతో శోభిస్తున్నది.

# బిందుగారబ్బాయ్

[ఆఖ్యాయిక]

శ్రీ శరచ్చంద్రుని కృతి

= అనుకృతి: శ్రీ వేలూరి శివరామశాస్త్రి =

౬

బిందువాసిని పుట్టింటినుంచి తిరిగివచ్చిన పది రోజుల కొకనాడు అన్నపూర్ణ ఆమెగది లోనికి వెళ్లి 'చెల్లీ!' అని పిలిచింది.

మాసిన గుడ్డలు ఒక గుట్టైనయితే ముందు పడేసుకుని కూచుంది చెల్లెలు.

"వాక లేమయినా వచ్చాడా?" అని అడిగింది అన్నపూర్ణ.

తోడికోడలు మాటాడలేదు. అన్నపూర్ణ ఆమె ముఖభంగి చూచి భయపడ్డది. "అల్లా కూచున్నా వేం?" అని ఉద్వేగంతో అడిగింది.

బిందువాసిని కాల్చిన సిగరెట్ పీకెలు కొన్ని చూపి "ఇవి అబ్బాయిజేబుల్లోంచి బయటబడ్డయ్" అని అన్నది.

మాట రాక అన్నపూర్ణ మొద్దల్లే నిలబడి పోయింది.

బిందువాసిని హఠాత్తుగా ఏడ్చేసి "మీ కాళ్లట్టుకుంటా. వాళ్ల నిక్కడనుంచి పంపేసినా సరే, లేకపోతే మమ్మల్నిక్కణ్ణుంచి పంపేసినా సరే, మీ యిష్టం. ఈ రెంటిలో ఏదో ఒకటి చేయండి" అని అన్నది.

అన్నపూర్ణ జవాబు చెప్పలేకపోయింది. ఆమె మరి రెండు నిమిషాలు అక్కడే నిల్చొని మాటాడకుండా వెళిపోయింది.

అపరాహ్ణంవేళ అనంతు డింటికొచ్చి ఫలాహారం చేసి ఆడుకోడానికి వెళ్లాడు. బిందువాసిని అతనితో ఒక మాటకూడా మాటాడలేదు. ఆటుతరువాత భైరవుడు బిందువాసినిదగ్గిరికి పరుగెత్తుకొచ్చి "అమ్మగారండీ, నరహరి బాబుగారు నావల్ల తప్పేమీ లేందే లెంపకాయ కొట్టారు చూడండీ" అని మనవి చేశాడు.

బిందువాసిని పెదవి విరిచి "పోయి అక్కగారితో చెప్పు" అని అన్నది.

మాధవుడు కోర్టునుంచి తిరిగివచ్చి బట్టలు మార్చుకుంటూ మార్చుకుంటూ కొద్దిగా పరసం చెయ్యబోయి చివాట్లు తిని నోరు మూసుకూరుకున్నాడు. ఎవరికీ తెలియకుండా ఈ యింట్లో తుపాను పెరిగి పోతూ ఉండడం ఒక్క అన్నపూర్ణకే తెలుసు. సాయంకాలంవరకూ ఆమె ఎల్లాగో ఒకల్లా ఆకష్టమంతా సహించి తుదకు ఒంటరిగా చూచి బిందువాసినిచేతులు రెండూ పట్టుకుని సవినయంగా "నీయింటికి వాడు నీకొడుకే. ఈసారి వాణ్ణి క్షమించు! లేకపోతే చాటుకు పిలిచి రెండు చివాట్లు పెట్టు" అని అన్నది.

"ఇదిగో, అతడు నాకొడుకు కాదు. ఈమాట నాకూ తెలుసు, మీకూ తెలుసు. ఊరికే మాటలు పెంచుకోవడ మెందుకూ?" అని బిందు అన్నది.

"నేను కాదు, నీవే వాడి తల్లివి. నేను వాణ్ణి ఎప్పటికీ నీ కిచ్చెయ్యలేదూ?" అని అన్నపూర్ణ అన్నది.

"చిన్నప్పుడు అతణ్ణయితే నేను పెంచానుగాని ఇప్పుడు పెద్దవాడైపోయాడు. ఇహ మీపుత్రాణ్ణి మీరు తీసుకోండి. నాకు సెలవు" అని బిందువాసిని వెళిపోయింది.

రాత్రి ఏడుపుమొహంతో అనంతం అన్నపూర్ణ దగ్గిరికి చేరాడు.

అన్నపూర్ణ గ్రహించి, విరక్తితో "ఇక్కడికొచ్చావెందుకూ? ఫో, ఇక్కణ్ణించి పోతావా పోవా?" అని అన్నది.

అనంతం అక్కడినుంచి మెల్లగా తండ్రిగదిలోకి వెళ్లాడు. అతడు నిద్దరలో ఉన్నాడు. అనంతం మరి మాటాడక బయటికి వెళిపోయాడు.

తెలవారుకట్ట కదంబ అంట్లగిన్నెలు తీసుకుని వెళడానికి వంటింటిముందరికి వచ్చి వరాండామూల పుల్లలూ పిడకలూ కలిసిన గుట్టమీద అనంతం నిద్రపోతూండడం చూచి గబగబా పరుగెత్తి బిందువాసినిని తీసుకుని వచ్చింది. అన్నపూర్ణకూడా లేచి వాకట్లోకి వస్తూంది. వచ్చి వీళ్ల పక్కనే నిలుచుంది.

"అక్కయ్యగారూ! రాత్రి ఇతన్ని మీరు కొట్టి పారేశారా? అతడుంటే మీకు నిద్రాభంగం కాదూ?" అని బిందు అన్నది.

కొడుకుఅవస్థకు కలతచేతా, దుఃఖంచేతా అన్నపూర్ణకుకూడా కళ్లలో నీరు తిరిగిందికాని బిందువాసిని నిష్ఠురంగా ఎత్తిపొడవడంవల్ల అట్టుడికిపోయి "ఇదుగో, నీవు నీతప్పు ఇతరులమీద మోపందే బతకలేవు" అని అన్నది.

బిందువాసిని కుర్రవాణ్ణి ఎత్తుకుందామని వెళ్లి ఒళ్లు పట్టి చూచింది. వెచ్చగా ఉంది. "జ్వరం వచ్చినట్టుంది" అని, "ఈ కార్తికమాసపు మంచులో రాత్రల్లా పడుక్కుంటే జ్వరం రాదా? తగ్గిపోవాలి బాబూ! తగ్గిపోతే బతికిపోతాను" అని అన్నది.

అన్నపూర్ణ తొందరతొందరగా దాపులకువచ్చి ముందుకు వంగిచూచి "ఏదీ, జ్వరం వచ్చిందీ? చూదాం" అని అన్నది.

బిందువాసిని గాఠ్ఠిగా ఆమెచేయి తోసేసి "చాల్లెండి, మీరు చూడక్కరలేదు" అని విదిలించి, నిద్రపోతూన్న కుర్రవాణ్ణి మెల్లిగా ఎత్తుకొని అన్నపూర్ణమీద ఒక విసపుచూపు విసిరి తన గదిలోకి వెళిపోయింది.

అయిదారు రోజులకే అనంతుడికి మళ్లా ఆరోగ్యం కలిగిందికాని, బిందువాసిని తోడికోడలి అపరాధాన్నిమాత్రం సహించగలిగింది కాదు. ఆనాడుమొదలుకొని బిందువాసిని అన్నపూర్ణతో తిన్నగా మాటాడడం మానేసింది.

అన్నపూర్ణ సమస్తమూ ఎరుగు, అల్లా ఎరిగీనిన్నీ ఆమెకూడా మౌనం తాల్చింది.

బిందువాసిని అందరిఎదుటా ఈఅపరాధమంతా తనమీదే మోపడం అన్నపూర్ణకూడా మరచిపోలేకపోయింది. ఒకనాడు వేణమ్మ, తానూ మాటాడుకుంటూ కూచున్నారు. ఏదో మాటమీద "వాడి అదృష్టంవల్ల చావలేదుగాని, పింతల్లిగారివల్లనే ఆనాడు వాడికి జ్వర మొచ్చింది" అని అన్నపూర్ణ పొక్కింది.

వేణమ్మ ఈమాట బిందువాసినిదగ్గిరికి మోసుకెళ్లడాని కెంతమాత్రమూ ఆలస్యం చేయలేదు. బిందు చాకగా విందికాని పయికేమీ అనలేదు. ఈమాట ఆమె వినడమునేది వేణమ్మకు తప్ప ఇంకొకరికి తెలియదు.

బిందువాసిని అన్నపూర్ణతో మాటాడడం సాంతంగా కట్టిపెట్టేసింది. చాలారోజులనుంచీ ఈయింటిసామానులన్నీ కొత్తగా కట్టిన మేడలోకి తీసుకుపోతున్నారు. రేపు పొద్దున్నే అందరూ అక్కడికి వెళిపోతారు. యాదవుడు పిల్లలను పెట్టుకుని ఆయింట్లోఉన్నాడు. మాధవు డేదో కేసుపనిమీద మరోవూరు వెళ్లాడు. ఇంట్లో మగవా ళ్లెవళ్లూ లేరు. ఇటువంటి సందర్భంలో ఈయింట్లో ఒక గందరగోళం జరిగింది. సాయంకాలప్పూట పిల్లాడికి పాఠం చెప్పడానికి పంతులుగారు రాగా, ఏమిబుద్ధిపుట్టిందో, బిందువాసిని ఆయనను పిలిపించి "అయ్యా పంతులుగారూ, రేపటినుంచీ మీరు ఆయింట్లో పాఠం చెప్పండి" అని అనంగానే 'చిత్తం చిత్తం' అని అనుకుంటూ పంతులుగారు వెళుతుండగా బిందు "మీశిష్యుడు తిన్నగా చదువుకుంటున్నాడా?" అని అడిగింది.

"చదువులో అతడు మొదటినుంచీ మేలే. ప్రతి మాటూ ఫస్టే"

"అయితే కాదచ్చుగాని ఇప్పుడు సిగరెట్లు నేర్చుకుంటున్నాడండీ"

పంతులు "సిగరెట్ నేర్చుకుంటున్నాడూ!" అని ఆశ్చర్యపడ్డాడు. ఇట్లా ఆశ్చర్యపడి వెంటనే "ఇందులో ఏమీ ఆశ్చర్యం లేదు. వాణ్ణీ వీణ్ణీ చూచి పిల్లలు నేర్చుకుంటారు." అని అన్నాడు.

"ఎవరిని చూచి?" అని బిందు అడిగింది. పంతులు మాటాడలేదు. "ఈసంగతి మీరు ఇతని తండ్రిగారితో చెప్పండి" అని బిందు అన్నది. పంతులు తలతిప్పుతూ, "ఇది వినండి. ఇప్పటి కయిదారు రోజు లయింది, బళ్లోకి వెళ్లే దార్లో ఒక తోట ఉంది, కొందరు పిల్లలు అందులో దూరి మామిడిపిందెలు కొట్టి మండలు విరిచేశారు. తోటమాలి వచ్చి గోలపెడితే వాణ్ణి పట్టుకు తన్ని ఒక యుద్ధకాండ చేశారుట. ఈ సంగతి మా హెడ్‌మాస్టరుగారు చెప్పారు" అని అన్నాడు.

బిందు ప్రాణాలు బిగబట్టుకొని "ఆ తరువాత ఏమి జరిగింది?" అని అడిగింది.

"ఆటుతరువాత తోటమాలి హెడ్‌మాస్టరుగారి దగ్గిరికి పోయి లబలబలాడాట్ట. ఆయన పిల్లలకు పది రూపాయలు జరిమానా వేసి వాడి కిచ్చి శాంతపరచి పంపించారట"

బిందువాసిని ఈమాటలు నమ్మలేక "మా అనంతం కూడా వారిలో ఉన్నాడా? వీడికి డబ్బెక్కణ్ణుంచి వొచ్చింది?" అని అడిగింది.

"ఆసంగతంతా నాకు తెలియదుగాని వారిలో అనంతంకూడా ఉన్నాడు. మీయింట్లో వుండే నరహరి కూడా ఉన్నాడు. ఇంకా నలుగురయిదుగురు చెడ్డ పిల్లకాయలుగూడా ఉన్నారు. మా హెడ్‌మాస్టరు గారు చెపుతూవుండంగా నేను విన్నాను."

"డబ్బుకూడా వసూలయిందా?"

"ఆ. అదికూడా వసూలయిం దని విన్నాను"

"మంచిది, ఇక వెళ్లండి" అని బిందువాసిని అక్కడే కూలబడ్డది. "వాడు చెప్పకుండా వీడికి డబ్బిచ్చే సాహసం ఈయింట్లో ఎవరికుంది?" అనే యీ ఒక్కమాటా ఆవిడనోట్లోంచి అస్ఫుటంగా బయటికి కొచ్చింది. ఒక చెంప ఆమెమనస్సు పాడై వుంది. అందులో అక్కగారితో మాటా మంతీ మానేసింది. దానిమీద ఈసంగతొకటి వచ్చి ఆమెకు వెర్రెత్తేసింది. ఆమె అక్కణ్ణించి లేచి వంటింట్లోకి వెళ్లింది. అన్నపూర్ణ రాత్రికిగాను కూరతరుగుతూ మొహమెత్తి చూచింది. తోడికోడలు మొహంమీద మబ్బులు!

"అక్కగారూ! మీ రీవడువ అనంతుడి కేమయినా డబ్బిచ్చారా?"

సరిగ్గా ఈమాటే అడుగుతుం దని అన్నపూర్ణ భయపడిపోతూంది. భయంతో ఆమెనాలుక ఎండి చక్కాపోయింది. "ఎవరు చెప్పారూ!"అని మెత్తగా అడిగింది.

"ఆమాట అంత అవసరం కాదు. అత డేమని పుచ్చుకున్నాడు, మీ రేమని ఇచ్చారు? ఇదే అవసరం."అని బిందు అన్నది. అన్నపూర్ణ మాటాడ కూరుకుంది.

"నే నతనిని అదుపులో ఉంచటం మీ కిష్టం లేదు. అందుకోసమే మీరు నాదగ్గిర ఈమాట దాచారు. అనంతు డెన్ని పాడుపనులు చేసినా పెద్దల దగ్గర అబద్ధాలు చెప్పడు. మీకు అతడు చేసిన పని తెలిసేఉండచ్చు. తెలిసే మీ రిచ్చారు. నిజ మవునా కాదా చెప్పండి"అని బిందు అన్నది.

అన్నపూర్ణ మెల్లమెల్లగా "నిజం. కాని ఈ ఒక్కసారిమాత్రం వాణ్ణి క్షమించు చెల్లీ! నేను క్షమాపణ కోరుతున్నాను"అని అన్నది.

బిందువాసిని లోపల్లోపల ఉడికిపోతూ "ఈ ఒక్కసారా? ఇప్పటినుంచీ ఇక చివరవరకూ క్షమించాను. ఇక చెప్పను. మరి మాటాడను. ఇక పిల్లా నాకళ్ల యెదుట కొంచెంకొంచెంగా పాడైపోవడం చూచి నేను సహించలేను. ఇంతకంటె ఒకేసారి పాడై పోనీండిగాని, అమ్మా! మీ కెంత సాహసమూ!" అని అన్నది.

ఈ చివరమాట అన్నపూర్ణకు గాటంగా తగిలింది. అయినప్పటికీ ఆమె యేమీ మాటాడలేదు. కాని మాట లనుకుంటూపోతున్న కొద్దీ బిందువాసినికి

క్రోధం ఎక్కువౌతూపోయింది. ఆమె మళ్లీ ఇల్లా గర్జించింది: "అన్ని విషయాలలోనూ మీరు వెర్రి బాగులదానికిమల్లే ఉండి 'ఈసారి క్షమించు ఈసారి క్షమించు'అని అంటూ కూచుంటారు. దోషమంతా మీదిగాని అతని దేమంత కాదు. మిమ్మన్ని మాత్రం నేను క్షమించను"

చాటుగా ఉండి నవుకరులూ, చాకరులూ ఈ మాట లన్నీ వింటున్నారు.

అన్నపూర్ణ ఇహ సహించలేక—"క్షమించవూ? ఏం చేస్తా వేమిటి? ఉరిశిక్ష వేస్తావా?"అని అన్నది.

నిప్పులో నేయి పడ్డది. "అదే మీకు తగిన శిక్ష"అని బిందువాసిని తుపాకల్లే మోతలు పెట్టింది.

"నా కొడుక్కు నేను రెండు రూపాయ లిచ్చుకున్నాను. ఇదేకదా నాతప్పు?" అని అన్నపూర్ణ అన్నది.

మాటమీద ఇంకోమాట రావడంవల్ల బిందువాసిని అసలుమాట మరచిపోయి "ఆ రెండు రూపాయలే నాయిరి. పాడుచేయడానికి డబ్బెక్కడి నుంచి వస్తుం దనుకున్నారు?"అని అన్నది.

"డబ్బు నీవు పాడుచేయడం లేదూ?"అని అన్నపూర్ణ అన్నది.

"నాడబ్బు నేను పాడుచేసుకుంటున్నాను సరే కాని మీ రెవరి డబ్బు పాడుచేస్తున్నారో కొంచెం చెప్పండి"అని బిందు అన్నది.

ఈమాటకు అన్నపూర్ణకు వచ్చిన కోపం చూస్తే భయం వేసిపోతుంది. ఆమె పేదయింటినుంచి వచ్చింది. బిందువాసిని తనను ఈమాటే ఎత్తిపొడిచిం దని అనుకుని లేచి నిలుచుని "నీవు మహా అయినావులెద్దూ భాగ్యవంతుల పిల్లవ్! అల్లా అని మరి రెవళ్లూ తమ పిల్లలకు రెండు రూపాయ లిచ్చుకోలేరని అహంకారపడకు!" అని అన్నది.

"నా కా అహంకారం లేదు. అయితే ఒకపైసా అయినా ఇస్తే ఆపైసా రెవరిదో అడిగూడా మీ రాలోచించుకోండి" అని బిందు అన్నది.

"ఏమిటే? ఆపైసా రెవరిదో అనా? నోటి కొచ్చినట్లల్లా పేలితే సరి. పో అతలికి పో, నాయెదట నుంచి" అని అన్నపూర్ణ అన్నది.

"అతలికి? ఈ ఒక్క రాత్రి పోంగానే పోతాను కాని మీ రెవరి డబ్బు ఖర్చుపెటుకున్నారో మీకు తెలియదేం? ఎవరి సంపాదనమీద మీరు బతుకుతున్నారో ఆమాత్రం తెలియదేం?" అని బిందు నోరు జార్చి కిమ్మనకుండా ఊరుకుంది.

అన్నపూర్ణ మొహం సున్నంకొట్టిన ట్టయింది. క్షణకాలం ఆమె తోడికోడలి మొహంకేసి రెప్పవాల్చకుండా చూచి "మేము మీవారి సంపాదనమీద బతుకుతున్నామనీ, నేను మీకు దాసీదాన్ననీ, వారు మీకు నౌకరనీ కదా నీ అభిప్రాయం? ఇన్నాళ్లనుంచీ ఈ మాట చెప్పావ్ కావేం?" అని అన్నది.

అన్నపూర్ణ పెదవులు మాటిమాటికీ వణికెయ్. ఆమె పెదవిని పంటితో నొక్కిపెట్టి ఒక నిమిషం సేపు ఆగి "తమ్ముడి చదువుకోసం నీబావగారు ఒక్కసారిగా రెండుబట్టలు కొనుక్కోవాలనప్పుడు నీ వెక్కడున్నావమ్మా తోడుకోడలా? ఇల్లు తగులడిపోగా చెట్టుకింద అన్నం వండుకుని తింటూ మళ్లా ఈయిల్లు కట్టించినప్పుడు నీ వెక్కడున్నావమ్మా చెల్లీ?" అని అంటూఅంటూవుండగా కళ్లనుండి జరజరజారిన నీళ్లు తుడుచుకుని మళ్లా "మీ మనస్సులో మాట వారికి గనుక తెలిసివుంటే ఇల్లా నల్లమందు భాయీ ఐ, తూగుతూ తూలుతూ కాలం గడిపే మనిషి ఆయనకాదు. ఆయనసంగతి మీవారికి తెలుసు; ఆకాశంలో వున్న దేవతలకు తెలుసు. నన్ను అడ్డంపెట్టుకుని వారిని అవమాన పరుస్తావా?" అని అన్నది.

మగనిమీద ఉండే అభిమానంచేత అన్నపూర్ణ వక్షం ఉబికుబికిపడడం మొదలుపెట్టింది. "నీవు నీ ఉద్దేశం తెలపడం మంచిదే అయింది. దక్షుడు తన మగనిని అవమానంచేయగా సతీదేవి ఆత్మహత్య చేసుకుంది. నేను నీ అన్నం తినడంకంటె ఒకళ్ల యింట్లో వంటచేసుకు బతుకుతాను. ఇదే ఒట్టు. నీవు వారికి అవమానం చేస్తావుకాదూ?" అని అన్నది.

సరిగ్గా ఆసమయంలో యాదవుడు ముంగిట్లోకి వచ్చి, "ఓయ్" అని భార్యను పిలిచాడు. మగని

కంఠస్వరం వినేసరికల్లా అన్నపూర్ణ అభిమానం తుఫానుచే రేగిన సముద్రంలాగా తాడెత్తున పెరిగింది. ఆమె గబగబా వాకిట్లోకి వచ్చి "ఛీఛీ. ఆలుబిడ్డలను పోషించలేని మనిషికి ఉరిపోసుకు ఛావడాని కొక్కడేనా కసింత తాడు దొరక్కపోయిందా?" అని అన్నది.

యాదవుడి కేమీ తెలియలేదు. 'ఏమిటదీ?' అని అన్నాడు.

"ఏమిటదా? ఏమిటీ లేదు. నేను తన దాసీదాన్ననీ, మీరు తన నవుకర్లనీ తోడుకోడలివ్వాళ స్పష్టంగా చెప్పేసింది."

ఇంట్లోపల ఉన్న బిందువాసిని నాలుక కొరుకుకొని చెవులలో వేళ్లు గుచ్చుకుంది.

అన్నపూర్ణ ఏడుస్తూ ఏడుస్తూ "చేయెత్తి ఒక పైసా ఎవరికీ యిచ్చే అధికారం నాకు లేదు,- మీరు బతికున్నప్పటికీ నేడు నేనీ మాట వినవలసొచ్చింది. ఇదిగో ఇప్పుడు నేను మీయెదుట నుంచొని శపథం చేస్తున్నాను. ఇవ్వాళనుంచీ వారి అన్నం గనుక నేను తింటే అనంతుడిమీద ఒట్టు!" అని అన్నది.

మూసుకొన్న బిందు చెవులలో ఈ మాటలు అస్పష్టంగా ప్రవేశించెయ్. బిందువాసిని "ఎంత ఒట్టు పెట్టుకొన్నావమ్మా అక్కా" అని అస్ఫుటంగా అంటూ, పన్నెండేండ్ల తరువాత మళ్లా ఈ రోజున మూర్ఛ వచ్చి విరుచుకు పడిపోయింది.

౭

యాదవుడూ, అన్నపూర్ణా, అనంతమూ తప్ప తతిమ్మావాళ్లంతా కొత్తమేడలోకి వచ్చేశారు. పొరుగూళ్లనుంచి బిందుపినతల్లీ, పినతల్లి కూతురూ, ఆమెసంతానమూనున్నూ, పుట్టింటినుంచి తలిదండ్రులూ వారి నవుకర్లూ చాకర్లూనున్నూ వచ్చారు. మేడంతా జనంతో కిటకిటలాడిపోతూంది. ఈ మేడలోకివచ్చేరోజున బిందుకవళిక బాగుండలేదుగాని మరునాటినుంచీ మళ్లా బాగానే ఉంది. కోపం చల్లారిపోంగానే అన్నపూర్ణ వస్తుందని బిందువాసినికి గట్టి నమ్మకం. ఈ మేడలో గృహదేవతలను పూజించి సంతర్పణ చేయవలసిఉంది. కాబట్టి బిందువాసిని ఆ ప్రయత్నంలో మునిగిఉంది.

"అమ్మాయీ, నీకొడుకు కనబడడం లేదేమీ?" అని బిందుతండ్రి అడిగాడు.

"ఆయింట్లో ఉన్నాడు" అని బిందు సంక్షేపించింది.

"రావడానికి ఇంకా తీరిక కాలేదుకాబోలు మీతోడుకోడలికి" అని తల్లి అన్నది.

"ఊఁహుఁ." అని బిందు అన్నది.

అప్పుడు ఆమెతల్లే ఇల్లా వివరించింది: "కానులే. అందరూ లేవొస్తే అక్కడుండే దెవరు? తాతతండ్రులు సంపాయించిన ఇంటిని మూసిపెట్టడంకూడా మంచిది కాదు."

బిందువాసిని మాటాడక పనిమీద వెళ్లిపోయింది.

యాదవుడు ప్రతిరోజూ సాయంకాలప్పూట ఈ కొత్తమేడకు వచ్చి వాకిట్లో కూచుని అందరి సమాచారమూ కనుక్కుని వెళుతున్నాడు. కాని లోపలికి మాత్రం అడుగుపెట్టడం లేదు. గృహపూజ చేసిన పూర్వరాత్రి అతడింట్లోకి వెళ్లి వేణమ్మను పిలిచి యోగక్షేమా లడిగాడు. అప్పుడు బిందువాసిని చాటుగా నిలుచుని విన్నది. బావగారంటే ఆమెకు తండ్రి కంటె ఎక్కువ. ఆయన తన నెప్పుడూ 'అమ్మా' అని పిలిచేవాడేకాని 'మరదలా' అని పిలిచి యెరగడు. తనకూ తోడుకోడలికీ మాటా మాటా పొసగినప్పుడు ఆమాట పట్టుకుని తా నెన్నిసార్లో ఆయనముందుకు వెళ్లింది. తాను మోసుకుని వెళ్లిన మాట నెన్నడూ ఆయన కాదనలేదు. అటువంటాయనముందుకు వెళ్లడానికి బిందువాసిని యీనాడు జంకిపోయింది. ఆమె గొంతుక బిగిసిపోయింది. యాదవుడు వెళిపోయాడు. ఎక్కడ చూచినా జనం ఉండడంచేత ఆమె చాటుగా గదిలోకి వెళ్లి నోట్లో కొంగు కుక్కుకుని వెక్కివెక్కి యేడ్చింది.

మరునాడు పొద్దున బిందువాసిని మగనిని పిలిపించుకుని "పొద్దెక్కింది. వసిష్ఠ కనిపెట్టుకుని కూచు

న్నాడు. బావగా రింకా వచ్చారు కారు" అని అన్నది.

"ఆయ నెందుకూ?" అని మాధవుడు వింతగా అడిగాడు.

"ఆయ నెందు కంటా రేమిటి? ఆయనకాక ఇదంతా మరెవరు చేస్తారు?" అని బిందువాసిని అంతకంటె వింతగా అన్నది.

"చేస్తే నేను చేస్తాను, లేకపోతే బావ పేరిశాస్త్రుల్లు చేస్తాడు. అన్నగారు రారు" అని మాధవుడన్నాడు.

బిందుకు కోపం వచ్చింది. ఇల్లా అన్నది: "రారంటే అయిపోయిందా యేమిటి? ఆయన ఉండంగా మరెవరికయినా ఇక్కడ అధికారం ఉందా? తీసేయండా మాటలన్నీ. ఆయ నుండంగా మరొకరిని ఇందులో నేను వేలు పెట్టనివ్వను."

"అవునయితే ఈపనులన్నీ ఆపెయ్. ఆయన ఇంట్లో లేడు, ఏదో పనిమీద వెళ్లాడు" అని మాధవుడన్నాడు.

"ఇదంతా తోడుకోడలిగారి యెత్తు. అలాగైతే ఆవిడకూడా రావట్టు కనబడుతుంది" అని బిందువాసిని కళ్లనీళ్లతో వెళ్లిపోయింది. ఇప్పుడామెకి పూజా, పురస్కారమూ, సంతర్పణమూ సకలమూ వృథాగా కనబడ్డది. "నేడు బావగారొస్తారు, అక్క వస్తుంది, అనంతం వస్తా"డని మూన్నాళ్లనుంచీ ప్రతిరోజూ అనుకుంటూంది. వాళ్లు తప్పకుండా వస్తారనే ధైర్యం మీదనే ఇన్నాళ్లనుంచీ ప్రొద్దుటినుంచీ సాయంకాలం దాకా పనిపాటలు చేసుకుంటూంది. ఇప్పుడు మాధవుడు పలికిన ఒక్కమాటతో ఆధైర్యమంతా ఎండమావులులాగా ఎగిరిపోయింది. దాంతో ఈ ఉత్సవ సన్నాహ మంతా ఆమెకుండేలకు బరువైపోయింది.

వేణమ్మ వచ్చి "ఏమమ్మా, కొట్టుబీగం ఒకసారి ఇయ్యి! మిఠాయివాడు లడ్లు పట్టుకొచ్చి నిలబడి ఉన్నాడు" అని అన్నది.

బిందు విసువుదలతో "అక్క డెక్కడయినా పెట్టమందురూ! తరువాత చూచుకుందాం" అని అన్నది.

"ఎక్కడ పెడతాం? కాకులు పాడుచెయ్యవూ?" అని వేణమ్మ అన్నది.

"పాడుచేస్తే పాడుచేసెయ్. అక్కడ పడేసి పొమ్మనండి" అని బిందు అన్నది.

పినతల్లి వచ్చి "అమ్మా బిందూ! ఈనాటికి ఎంత మైదాపిండి పట్టుకుందో కొంచెం చూసిపోతావూ" అని అడిగింది.

బిందువాసిని మొహం భారగించుకుని "ఎంత కావాలో నాకేం తెలుస్తుంది? చేసినవాళ్లు మీ రెరగరుటమ్మా?" అని అన్నది.

పినతల్లి ఆశ్చర్యపడి "ఇదేమిటే? ఎంతమందిని పిలిచావో ఆసంగతి నాకేం తెలుస్తుంది?" అని అన్నది.

బిందువాసిని కోపగించుకుని "అలాగయితే పోయి ఆయన నడుగు! నీవు మా అక్కగారి పని చూచివుండవలసింది. అనంతుడికి వడుగైనప్పుడు మూడు రోజులూ ఊరంతా ఇక్కడే భోజనం. అప్పుడు కూడా ఆమె 'ఇదెంత కావాలి, అదెంత కావాలి; ఈపని చూడు, ఆపని చూడు!' అని ఎన్నడూ నాకొక్కమాటకూడా చెప్పలా. ఈయింట్లో వాండ్లందరూ కలిసినా ఆమెవేలికి పోలరు" అని మరోగదిలోకి వెళ్లిపోయింది.

కదంబ వచ్చి "అమ్మా! అయ్యగారు పూజా వస్త్రాలు–" అని అంటూవుండంగా దాని మాట సాగనీయక బిందువాసిని "నన్ను మీరందరూ కలిసి విరుచుకుతినండి. ఫో, నాయెదుటనుంచి అవతలికి పో" అని కసురుకుంది. అది కుందేలులాగా పారిపోయింది.

మరి కాసేపటికి మాధవుడు వచ్చి పిలుపుమీద పిలుపుగా పిలిచి "ఓయ్! వినబడటం లేదా?" అని అన్నాడు.

బిందు దగ్గిరికొచ్చి "వినబడటం లేదు. నాచేతకాదిహ నాచేతకాదు. ఊc. అయిందా?" అని ఝుంకరించింది.

మాధవుడు మరి మాట రాక చూస్తూ నిలబడ్డాడు.

"మీరు సన్నం చేస్తారు మహా? పెంచ కురి పోస్తారా? పోనీ పొయ్యండి" అని బిందువాసిని ఏడుస్తూ వడివడిగా అవతలికి చాటుకుపోయింది.

క్రమక్రమంగా ప్రొద్దెక్కింది. బిందువాసిని పని యేమీ లేకపోయినా తీరిక లేకుండా ఆగదీ ఈగదీ తిరగవెయ్యడం, ఇతరుల లోపాలు పట్టుకొని గందరగోళం చేయడం మొదలు పెట్టింది. ఎవరో తొందరమీద కొన్ని గిన్నెలు వడిచే వాట్లో పెట్టారు. బిందువాసిని రోడ్లో పోయిపడేటట్లు వాట్ల నొకతాపు తన్ని వాట్ల నెక్కడ పెట్టాలో బోధించింది. అందరూ తిరిగేచోట ఎవరో బట్ట లారవేశారు; అవి బిందువాసినికాలికి మట్టుకొన్నయ్. ఆమె వానిని చింపిపారేసి ఎక్కడ ఆరగట్టాలో చూపించింది. ఆమె కెదురుపడ్డవాళ్లందరూ భయంతో పక్కగా తప్పుకుని నిలబడిపోతున్నారు.

పాపం, వసిష్ఠ లోపలికి వెళ్లి "ఇదేమిటి? పొద్దెక్కిపోతూంది, ఇక్కడ ఇంకా సంస్కారం ఏమీ చేశారు కారేం?" అని అన్నాడు.

బిందువాసిని చాటున నిలబడి "కార్యంపట్ల కొంచెం అలస్యం కాక మానుతుందా?" అని గాటంగా జవాబు చెప్పి, అక్కడ ఒక పళ్లెం ఉండంగా దాన్ని కాలికొద్దీ తన్ని మరొక గదిలోకి పోయి చైతన్యం లేని దాని చందంగా పడివుంది. అయిదారు నిమిషాలలో లోగడ ఆమె కలవాటయిన కంఠధ్వని ఒకటి వినబడగానే గబగబా లేచి నిలబడి తలుపుసందునుంచి అఱ్ఱు చాచి చూచింది. అన్నపూర్ణ వచ్చి మెల్లలో నిలబడ్డది.

బిందువాసిని దుఃఖంతోటీ, అభిమానంతోటీ యేడ్చేసి కళ్లు తుడుచుకుని చప్పుడు చేసుకుంటూ ముందుకొచ్చి గళవస్త్రం వేసుకుని చేతులుజోడించి "పది పదకొండు కావచ్చింది. ఇంకా ఎంత కత్రుత్వం పెట్టుకుంటావమ్మా? నీకు గనుక కోరికైతే నేను విష ముగ్చుకుంటాను, లేకపోతే ఇంటికి పోయి ఒక గిన్నెడు పంపించు" అని తాళంచెవులుత్తి ఆమె పాదాలముందు గణగణా మోగేట్టు పడేసి తన గదిలోకి పోయి తలుపు వేసుకుని నేలమీద పొరలుతూ ఏడవడం మొదలుపెట్టింది.

అన్నపూర్ణ యేమీ మాటాడకుండా తాళపు చెవులుత్తి తీసుకుని వెళ్లి కొట్టుతలుపులు తెరిచి అందులో ప్రవేశించింది.

అందరి భోజనాలూ అయినవి. రాకపోకలు ఉడిగినవి. అపరాహ్ణం అయింది. అయినా బిందువాసిని తీరిక లేకుండా అతలుపూ ఈతలుపూ తెరిచి తిరుగుతూనే ఉంది. "అనంతబాబు ఇస్కూలులో లే"డని భైరవు డొచ్చి చెప్పాడు.

బిందువాసిని భైరవుడిమీద నిప్పులు కురిపించి "దౌర్భాగ్యుడా! పిల్లలు రాత్రివేళ బళ్లో ఉంటారా? నీ కిదేం కొత్తా? ఆయింట్లోకి పోయి ఒకసారి చూచి రాకపోయావ్?" అని అన్నది.

"వెళ్లానండీ! అక్కడగూడా లేరు"

"అల్లా అయితే అత నెక్కడో వెధవలతో కుంటబంతి ఆడుతూ ఉండాలె. అతనికి భయమూ భక్తీ పోయినయ్. ఈసారి ఈ పాడుఆటలో ఒక కన్నుగిరిపోతే అన్నపూర్ణమ్మగారి కోరిక సిద్ధిస్తుంది. అప్పుడు కడుపునిండా అన్నం తింటుంది. ఫో, ఎక్కడున్నాడో వెతుక్కురా"

అన్నపూర్ణ కొట్టుగదపలోపలపక్క కూచుని ఇంట్లో వున్న పెద్దముత్తయిదువలతో మాట్లాడుతూ తోడుకోడలి కరుకుమాటలు విన్నది.

ఒకగంటకు భైరవు డొచ్చి "అనంతబాబు ఇంటి కొచ్చారుగాని యిక్కడికి రానన్నారు" అని అన్నాడు.

బిందు నమ్మలేదు. "రానన్నాడు రా? నేను రమ్మన్నానని చెప్పావా?" అని బిందు అడిగింది.

భైరవుడు తల త్రిప్పి "ఆఁ. చెప్పానండీ! మరి గత్తే చెప్పినాకానీ రావంటున్నారండీ" అనిఅన్నాడు.

బిందు ఒక నిమిషంపాటు ఊరుకుని "ఇది అతని తప్పు కాదు. తల్లిచార పిల్లడు రాకపోడు. నేనిహ పిల్లిద్దరి మొహం మాస్తే వొట్టు!" అని అన్నది.

రాత్రి చాలా పొద్దుపోయింది. అన్నపూర్ణ ఇంటికి వెళ్లడానికి లేచింది. మాధవుడు పంపించి రావడానికి స్వయంగా వచ్చాడు. బిందువాసిని గబగబా వచ్చి మగని నుద్దేశించి భయంకరమైన స్వరంతో "పంపించి

గావడానికైతే బయలుదేరారు. ఆవిడ ఇంతవరకు మంచినీళ్లయినా ముట్టుకోలేదు. ఈసంగతి మీకు తెలుసూ?" అని అన్నది.

"ఆసంగతి తెలియవలసింది నీకు. నా కెట్లా తెలుస్తుంది? ఇక్కడ ఇవ్వాళ ఏపనీ జరగక ఇల్లా అఘాను అయిపోతుంటే నేనే పోయి పిలుచుకొచ్చాను. ఇప్పుడు మళ్లా నేనే దిగబెట్టి రాబోతున్నాను" అని మాధవుడన్నాడు.

"ఓహో, బహు బాగా వుంది. అలాగయితే మీరుగూడా వారిపక్షమే నన్నమాట" అని బిందు అన్నది.

మాధవు డిందుకు జవాబు చెప్పక "మరి జాగు చేయకండి, పదండి" అని వొదినగారితో అన్నాడు.

'పదండి' అని అన్నపూర్ణ రెండడుగులు వేయగానే, బిందువాసిని "జ్ఞాతిశత్రుత్వం! నోటికొచ్చినట్లు ఛది కల్పించి చెప్పితే సరి. పుసపుసా ఒట్లు పెట్టుకుంటే సరి. నాలుగు పగళ్లు, నాలుగు రాత్రులు కుర్రాడి మొహం చూడనిచ్చింది కాదు. దేవు డిందుకు సరిగ్గా చూడకమానడు" అని గర్జించి నోట్లో కొంగు కుక్కుకుని ఏడుపు నాపుకుని వంటింటి వరాండాలోకి పోయి కుప్పన కూలబడి మూర్ఛపోయింది. నలుగురూ చేరారు. ఈ గడబిడ విని అన్నపూర్ణ వెనక్కి తిరిగి "ఏమిటో చూదాంపదండి" అని అన్నది.

"చూడక్కరలేదు పదండి" అని మాధవుడన్నాడు.

తోడుకోడళ్ల పోట్లాట ఇన్నాళ్లూ చాటుచాటుగా ఉందిగాని ఇప్పుడు బయటబడ్డది. మరురోజు ఆడంగులంతా ఒకచోట కూచున్న సమయంలో వేణమ్మ "తోడుకోడళ్లు పోట్లాడుకుంటే పోట్లాడుకున్నారు; కుర్రాడి కేం! ఒక్కసారి చూచిపోతే ఏం పాడౌ? తల్లిచార పిల్ల కొస్తుం దని బిందు అన్నమాట వట్టిమాట కాదు. నే నెందరి పిల్లలనో చూచానుగాని, రామరామా, ఈలాటి విశ్వాసఘాతకుణ్ణి ఎక్కడా చూడలేదు" అని అన్నది.

బిందువాసిని వినుకుదలగా వేణమ్మను ఒక్కసారి చూచి సిగ్గుతో, ఈసుతో తల వంచుకుంది. వేణమ్మ మళ్లా ఇల్లా అంది: "బిందూ! నీకు పిల్లలంటే మహా ప్రేమ. మా నరహరిని తీసుకో! కావాలంటే ఇచ్చేస్తా. చంపివెయ్, నరికివెయ్, ఏమయినా చెయ్; ఏమీ అనే రకంకాదు. అలా అనేవాళ్లు నాకడుపున పుట్టరు." బిందువాసిని మాటాడకుండా కూచుంది. ఆమెతల్లి వేణమ్మకు జవాబుచెప్పింది. ఆమె యేండ్లుచెల్లిన మనిషి. ధనికుల యింటి ఆడుబడుచు. ధనికులయింటి కోడలు. ముక్కాకలు తీరినది. ఇట్టే బిందుతల్లి చిరునవ్వు నవ్వి "ఏమి టీగందరగోళమంతా? అనంతం దాని రక్తమాంసాలతో కలిసిపోయున్నాడు. దా న్నిల్లా గందరగోళం చేయకండి! బిందూ! మీకోపా లంటే మహా ఒకరోజా రెండురోజాలు! ఇంతమాత్రంచాతనే కుర్రాడు నీకు వేరైపోతాడా యేమిటి?" అని అన్నది.

బిందువాసిని కన్నీటితో కలకలలాడుతూ తల్లికేసి చూచి మెదలక కూచుని ఊరుకుంది. సంధ్యాసమయంలో ఆమె కదంబను పిలిచి "పోనీ నీవే చెప్పు నీవుకూడా ఉంటివికదా. ఆవిడ ఇంత నొచ్చేట్టుకు! కుందుకు తగినంత తప్పు నా దేమయినా వుందా?" అని అడిగింది.

ఈ యాలోచన చేయడానికి తనను పిలిచిం దని కదంబ నమ్మలేక చాలా సంకోచంతో మౌనంగా ఊరుకుంది. అలా ఊరుకున్నా బిందువాసిని "మీరందరూ ఏలాగయినాకానీ వయస్సుకు పెద్దవాళ్లు కదా! మీ అభిప్రాయంకూడా నేను వినాలి. ఇందులో ఇంత తప్పు నాదేమైనా ఉందా చెప్పు" అని అన్నది.

కదంబ తలతిప్పి "ఇందులో మీతప్పేమిటి?" అని అనేసరికి బిందు "అలాగయితే నీ వొకసారి ఆయింటికి పోయి చక్కగా రెండుమాటలు అని రారాదూ? నీ కేం భయం?" అని అన్నది.

కదంబకు సాహసం వచ్చింది.—"భయ మేమిటి గాని, మరి వాదం పెట్టుకుని ఏం లాభం దొరసాని గారూ? కావలసిందేమో అయేపోయె." అని అన్నది.

"అలా కాదే కదంబా! నీకు తెలియదుగాని—అయితే నిజం చెప్పెయ్యటం మంచిది. అలా కాకపోతే తప్పంతా నాదే అయినట్లూ, తన దేమీ లేనట్లూ అనుక్కుపోతుంది. 'నిన్ను గం చేస్తాను, తరి

చేస్తాను' అని అర్థం వచ్చేమాటలు ఆమె ఏమన్నదూ అనలేదూ? ఇల్లా అంటే నే నెప్పుడయినా కోపగించుకున్నానా? నాకు తెలియకుండా రూపాయ లెందు కివ్వాలి? పోనీ నా కెందుకు చెప్పకపోవాలీ?"

"ఔను. మంచిది. ఇవ్వాళ చీకటడిపోయింది గాని రేపుపొద్దున పోతాను."

బిందువాసిని అసంతుష్టితో "అప్పుడే చీకటేమిటే కదంబా? నీవు పెద్దమాటలు అంటున్నావ్. శీతాకాలంకాబట్టి కాస్త పొద్దూకినట్టు కనబడ్డది. పోనీ ఎవడినయినా తోడుతీసుకుని పోరాదూ? ఒరే భైరవా! ఇదిగో! ఉశక్కని పిలూ! కదంబతో వెళ్లాలి" అని అన్నది.

"అయ్యగారు ఉశక్క గాడిచేత లాంతర్లు తుడిపిస్తున్నారండీ" అని భైరవు డన్నాడు. బిందువాసిని కోరచూపు చూచి "పొగరుబోతు జవాబు చెబుతావేం?" అని అన్నది. భైరవు డామెచూపుల కొకరు అక్కడినుంచి పారిపోయాడు. బిందు కదంబను పంపేసి రెండుమూడుసార్లు ఆగడీకాగడీ తిరిగి తుదకు వంటింట్లోకి వెళ్లింది. వంటలక్క ఒకమూల వంట చేస్తున్నది. బిందు ఆమెదగ్గర కూచుని "ఇదిగో కాత్యాయనీ! నేను నిన్నే సాక్షిగా కోరుకుంటా. నిజం చెప్పు. మా యిద్దరిలో ఎవరి దెక్కువ తప్పు?" అని అన్నది.

కాత్యాయని కేమీ తెలియలేదు. "ఏమిటమ్మా అదీ" అని అన్నది.

బిందు "ఆనాటి ముచ్చట. నే నేమన్నా? అనంతాని కివడును ఏమయినా డబ్బిచ్చావా అని అన్నా. పిల్లలకు డబ్బిస్తా రనేమాట ఎవరికి తెలియదు? 'అనంతం ఏడిచాడు; ఏడిస్తే ఇచ్చాను' అని చెప్పేస్తే సరిపోయేది. అలాగయితే ఇంత కథ పెరక్కపోను, ఈ ఒట్లూ సొట్లూ లేకుండా పోను. మన మేం గిన్నెలం గనుకనా కొట్టుకుంటే కంయ్ మనేందుకు? మనుష్యుల మాయిరి. అంత ఒట్టు పెట్టుకోడానికి ఏమవసర మొచ్చింది? వంశానికంతా అత డొక్కడే అంకురం. అతడిమీద ఒట్టా? ఇదిగోనమ్మా కాత్యాయనీ! ఇహ నేను బతికుండంగా అవిడె మొహం చూడను. పరమ శత్రువునయినా పోయి చూస్తాకాని ఇహ అటుకేసి మొహం పెట్టను" అని అన్నది.

కాత్యాయని స్వతహాగా అట్టే మాటాడేస్వభావం కలది కాదు. ఇప్పు డేమి చెప్పాలో తెలియక మౌనం వహించింది. బిందుకళ్లు రెండూ నీళ్లతో నిండెయ్. గబగబ తుడుచుకుని దుఃఖస్వరంతో మళ్లా "కోపం పెచ్చరిల్లినప్పుడు ఎవరయినా వొట్టెట్టుకుంటారుకాని అదే పట్టు కూర్చుంటారా? ఇంటికి వచ్చి కూడా పురిపెడునీళ్లు పుచ్చుకోలేదే! ఆఖరికి కుర్రాణ్ణయినా పంపింది కాదే! ఇది పెద్దలు చేసే పనేనా? నిజానికి నిజమే చెప్పాలి. నే నావిడకన్న చిన్నదాన్నే. నాకు ఆమెకన్న బుద్ధి తక్కువే. అయితే నేనే అవిడెకూతురు నై యుంటాననుకోండి. అప్పుడేం చేసేదో? నేనుకూడా ఇహ అలాగే అవిడె పేరయినా నాలుకమీదికి రానీయను, మీరు చూస్తూఉండండి" అని అన్నది.

ఇల్లా అన్నా వంటలక్క మాటాడక కూరుకుంది. బిందు "అవిడెకే మహా ఒట్టేసుకోడం తెలుసా? మరి నాకు తెలియదనుకుందేమో! నేను లే పాయింటికి వెళ్లి 'నీ వోగిస్నెడు విషం పంపకపోతే నీవు పెట్టుకొన్న ఒట్టేన'ని ఒట్టుపెట్టి వొస్తే ఏమవుతుంది? నే నీరెవాళ్లూ చూస్తూచూస్తూ ఉన్నా గాని రేపు పోయి ఈ ఒట్టయినా పెట్టొస్తా, లేకపోతే మాటాడకుండా విషం మింగి ఊరుకుని, అక్కయ్య పంపిందని నలుగురితో యాగీచేస్తా. నలుగురూ ఆవెన్ని ఛీఛీ అంటారో లేదో అప్పుడు చూస్తా. దాంతో అవిడె లొంగిరాకపోతే చూసుకోండి." అని అన్నది.

కాత్యాయని భయపడి మెత్తగా ఇలా అన్నది: "ఎబ్బె, ఇవేం మాటలండీ! తలపనయినా తలపరాదు. పోట్లాటలు చిరకాలం ఉండవ్. వారుకూడా మిమ్మల్ని వదిలిపెట్టి ఉండలేరు: అబ్బాయి అంతకంటె ఉండలేడు. ఈ నాలుగురోజులనుంచీ ఎల్లా ఉంటున్నాడో కాని మాకందరికీ చాలా ఆశ్చర్యంగా వుంది" అని అన్నది.

"అల్లా చెప్పండి కాత్యాయనమ్మగారూ, అల్లా చెప్పండి! నిజంగా అవిడే అతణ్ణి కొట్టీ కోపీ భయపెట్టీ బంధించేసింది. అతడు నాదగ్గర గాని ఇంకోదగ్గర పడుకోక్కలేడు. ఈలా అయిదు పగళ్లు, నాలుగురాత్రులు వెళ్లెయ్. ఇహ అవిడెగారి మొహం చూడవలసిన

పని ఉందా? పరమ శత్రువు మొహమయినా చూడగలనుగాని ఇహ ఆవిడగారి మొహం ఈజన్మలో చూడదలచుకోలేదని చెప్పనే చెప్పాను" అని తొందరగా బిందు అన్నది.

కాత్యాయని తన మణికట్టుమీద ఒక నల్ల మచ్చ చూపి "ఇదిగో చూడమ్మా! ఇక్కడ ఇంకా నలుపు పోలేదు. ఆరాత్రి మీకు మూర్ఛ వచ్చింది, ఈ సంగతు లన్నీ మీకు తెలియవు. అబ్బాయి ఎక్కణ్ణుంచో పరుగెత్తుకొనివచ్చి మీమీద పడి ఆనాడేడ్చిన యేడ్పా! మీకు మూర్ఛలాంగా ఆయన ఎప్పుడూ చూడలేదుకాదూ, 'మా అమ్మ పోయింది, మా అమ్మ పోయింది' అని ఒకటే యేడుపు. మీ మొహం మీద నీళ్లు కొట్టనివ్వలేదు. విసరనివ్వలేదు. నే నీవలికి లాగాను. ఆవేశంగా నన్నిక్కడ కరిచిపెట్టాడు. పెద్దమ్మగారు లాగారు. ఆవిడబట్ట అందుకుని పీలికలు పీలికలు చేసి పారేశాడు. మిమ్మల్ని వదిలేసి ఆయన్ను సర్దుబాటు చేయవలసివొచ్చిం దందరికీ. చిట్టచివరకి నలుగురయిదుగురు కలిసి ఆయన్ను అవతలికి లాక్కెళ్లారు" అని అన్నది.

బిందువాసిని ఆమాటలు మింగుతున్న చందంగా రెప్ప వాల్చకుండా కాత్యాయనిమొహం చూస్తూ కొంతసేపటికి నిట్టూర్చి మెల్లగా లేచి గదిలోకి వెళ్లి పడుకుంది.

నాలుగు రోజులు గడిచినయ్. బిందు తలిదండ్రులూ, బంధువులూ ఇహ రేపు వెళతా రనగా బిందుకు మూర్ఛ వచ్చి కొంతసేపటికి తేరుకుంది. ఆమె మెదలకుండా పక్కమీద పడుకుని వుండగా కదంబ విసనకర్రతో విసురుతూంది. అక్కడ మరెవరూ లేరు. అది చూచి బిందు కదంబను దగ్గరకు రమ్మని సైగచేసి "అక్కయ్య వచ్చిందా"? అని మెల్లగా అడిగింది.

"లేదుండీ అమ్మగారూ! మే మింతమంది ఇక్కడుండంగా ఆమెగారిని కష్ట పెట్టటం ఎందుకూ?" అని కదంబ అన్నది.

బిందు కొంచెంసే వూరుకుని "మీలో వున్న లోటే ఇది. అన్ని పనులలోను మీ తెలివితేటలు ఉపయోగిస్తారు. ఈలాగే చేస్తూ నన్నెప్పుడో చంపేసేస్తారనుకుంటా. గృహప్రవేశం నాడుకూడా మీ రింటినిండా ఇంతమంది జనమున్నారు. ఆ జేనెడుమనిషీ ఇంట్లో అడుగు పెట్టినంతవరకూ మీ రేమి చేయగలిగారు! ఓ, మీ రక్కడ, ఆవిడెక్కడ? మీ రందరూ కలిసినా ఆవిడచిటికెనవేలికి పోలరు" అని అన్నది.

బిందుతల్లి గదిలోకి వచ్చి "అమ్మాయీ, అల్లుడుగారి సెలవయింది. కొన్నిరోజులపాటు మాతో ఉండొద్దుగాని పద" అని అన్నది.

బిందు తల్లి మొహంకేసి చూస్తూ "నేను వెళ్లడమూ, వెళ్లకపోవడమూ వారి యిష్టానిష్టాలని పట్టుకునే ఉందా యేమిటి? వారు వెళ్లమనంగానే వెళ్లానా యేమిటి? నాశత్రువు ఆజ్ఞ లేనిదే నే నెట్లా కదలడం?" అని అన్నది.

"నీతోడుకోడలి మాటా? ఇంకా ఆమెఆజ్ఞ ఎందుకు నీకు? మీరు విడిపోయి ఎప్పుడు వచ్చేశారో అప్పుడే ఆవిడతో పని తీరిపోయింది. ఇప్పుడు మీవారి ఆజ్ఞ అయితే చాలు" అని తల్లి అన్నది.

బిందువాసిని తల ఆడించి "కాదమ్మా అల్లాక్కాదు. ఆమె బతికున్నంతవరకూ ఎక్కడయినా ఉండనీ, ఆమే సమస్తమూ. ఎన్ని చెప్పినా, ఆవిడ ఆజ్ఞ లేనిదే నే నీయిల్లాదిలేది లేదు—అలాగయితే బావగారు నొచ్చుకుంటారు" అని అన్నది.

అంతలో వేణమ్మ అక్కడికి వచ్చి సంగతంతా విని "మంచిది. నేను చెపుతున్నా కాని నీవు వెళ్లు" అని అన్నది.

బిందు ఆమెకు ప్రత్యుత్తరమయినా పలుకకపోగా ఆమెతల్లి "సరేకాని, మనిషి నెవరినయినా పంపి ఆమె ఆజ్ఞ తీసుకోరాదా బిందూ?" అని అన్నది.

బిందు ఆశ్చర్యపడి "మనిషిని పంపా? అది మరీ బాగుండదమ్మా! నా కావిడమనస్సు తెలుసు. పైకి వెళ్లమంటుందికాని లోపల్లోపల కోపం పెంచుక్కూచుంటుంది. లేకపోతే బావగారికి నాలుగు కల్పించి చెప్పయినా చెప్తుంది. వద్దమ్మా వద్దు. మీరు వెళ్లండి. నాకు రావడం పడదు" అని అన్నది.

బిందుతల్లి మరి పట్టు పట్టలేదు. ఎవరి వూళ్లకు వారు వెళ్లిపోయారు. ఇప్పు డెవరూ లేని యీ పెద్దమేడంతా

తనను మింగ జూస్తున్నట్లుంది. కిందవరస ఒకగదిలో నేణమ్మ ఉంటుంది. పైఅంతస్తులో తనగది. మిగతా మేడంతా బొంయిబొంయిమంటూ ఖాళీగా ఉంది. బిందు మనస్సు ఎక్కడో పెట్టుకుని అటూ ఇటూ తిరుగుతూ తిరుగుతూ మూడో అంతస్తుమీదికి వెళ్లి ఒక గదితలుపు తెరచింది. ఎప్పుడో భవిష్యత్కాలంలో ఈకొడుకూ కోడలూ ఉంటారని ఉద్దేశించి ఆమె స్వయంగా ఈఅంతస్తు కట్టించింది. ఇక్కడికి వచ్చేసరికి ఆమెకు కన్నీరు ఆగలేదు. ఆమె యిక అక్కడ ఉండలేక కిందికి దిగివస్తుండంగా మాధవుడు మెట్లెక్కి పయికి వస్తున్నాడు. అప్పుడామె "ఇట్లా అయితే ఎల్లా జరుగుతుంది?" అని అన్నది. మాధవుడు తెలియక "ఎవరికి?" అని అన్నాడు.

బిందు మరి జవాబు చెప్పలేకపోయి హఠాత్తుగా నిట్టూర్చి "ఎవరికీ లేదులెండి. మరేం లేదు లెండి" అని అన్నది.

మరునాడు ప్రొద్దున మాధవుడు ఆఫీసుగదిలో కూచుని పనిచేసుకుంటుండంగా అకస్మాత్తుగా బిందువాసిని అక్కడికొచ్చేరావడంతోటట్టే "వారు నవుకరీ చేస్తున్నారటనా?" అని అడిగింది.

మాధవుడు తల యెత్తకుండానే 'ఊఁ' అని అన్నాడు.

"ఊఁ యేమిటి? ఇది వారు నవుకరీ చేసే వయసేనా?"

మాధవుడు వెనుకటట్లేనే కాకితమ్మీద కళ్లుంచి "వయస్సునుబట్టి మనుష్యు లుద్యోగాలు చేస్తారా యేమిటి? తిండికి లేకపోతే చేస్తారుగాని" అని అన్నాడు.

"వారికి తిండి కెందుకు లేకపోవాలి? నేనయితే పరాయిదాన్ని. మేమూ మేమూ పోటాడుకుంటే పోటాడుకున్నాం. మీరూ మీరూ అన్నాదమ్ములు కారా?"

"సవతిబిడ్డలం—జ్ఞాతులం."

బిందు స్తంభించిపోయి "మీరు బ్రతికుండంగా వారిచేత పనిచేయిస్తారా?" అని అన్నది.

మాధవు డొక్కసారి తల యెత్తి భార్యను చూచి తనకు సహజమైన శాంతకంఠంతో "ఏంచేత చేయనియ్యను? సంసారంలో ఎవరి అదృష్టం వారిది. ఎంత పెట్టిపుటితే అంత అనుభవించాలి. దానికి నేనే ప్రబల దృష్టాంతం. తలిదండ్రు లెప్పుడు పోయినారో నేనెరగను. మేము చాలా దరిద్రుల మని వదినెగారు చెప్పగా విన్నానుకాని నేనుమటుకు దుఃఖమంటే యేమిటో కష్టమంటే యేమిటో యెరగను. తెల్లని కట్టుబట్టలూ, చదువులకు జీతమూ, పుస్తకాలకు డబ్బూ, చేతిఖర్చూ ఇదంతా ఎక్కణ్ణుంచి వచ్చేదో నాకిప్పటికీ ఏమీ తెలియదు. అటుపైని నేను వక్కీలయాను. డబ్బుకూడా తక్కువ సంపాయించి యెరుగను. ఈనడుంగా నీ వెక్కడినుంచో ఏలాగో ఇంత డబ్బు వెంటబెట్టుకుని ఈయింట్లో కొచ్చావు. ఈ పెద్దమేడగూడా వెలిసింది. అయితే మాఅన్నగారి సంగతి: చాలాకాలంనుంచీ విసువనేమాట లేకుండా ఎముకలు విరిగేట్టు పనిచేశారు. మాసికలువేసిన బట్టలు కట్టుకుంటున్నారు. శీతాకాలపు రాత్రిళ్లుకూడా ఆయనవంటిమీద చొక్కా యెన్నడూ చూడలేదు. ఒక్కపూటంటే ఒక్కపూట రెండు మెతుకులు తిని, కేవలం మనకోసం—ఈసంగతులన్నీ నాకు గుర్తులేదు, గుర్తుండవలసిన పనికూడా లేదుకాని—సరే, దాని కేం? ఈనడుమ కొన్నాళ్లమాత్రం సుఖంగా కాలక్షేపం చేశారు. అందుకోసం భగవంతుడు వడ్డీతో కూడా కట్టపుచ్చుకుంటున్నాడు" అని వెంటనే ముఖం తిప్పేసుకుని అవసరమయిన ఒక కాకితం వెతకటం మొదలుపెట్టాడు.

బిందునోటివెంట మాట రాలేదు. స్తంభంలాగా నిలబడిపోయింది. ఇన్నాళ్లనుంచీ జరుగుతూవస్తూవున్న ఈకథాకలాపాన్నిగురించి మగని మనస్సులో తిరస్కారం ఎంతగా అణగివుందో ఆసంగతి బిందువాసిని ప్రతిరక్తబిందువూ ఇప్పుడు తెలుసుకోవడం మొదలుపెట్టింది. ఆమె తల వంచుకుని నిలువబడ్డది.

మాధవుడు కాకితం వెతుకుతూ వెతుకుతూ తనలో తానే అనుకున్నట్లు ఇల్లా అనుకున్నాడు: "ఉద్యోగ మనగా ఉద్యోగమూ, భలే ఉద్యోగం. కృష్ణాపురంతాలూకా, ఇక్కడికి రానూ పోనూ సుమారు అయిదు కోసులు. తెల్లారుకట్ట నాలుగుగంట

లకు లేచి పగలల్లా అన్నం లేకుండా ఉండి రాత్రికి తిరిగివచ్చి రెండు మెతుకులు తినటం. జీతమా? పన్నెండు రూపాయలు."

బిందుకు కంపరమెత్తిపోయింది. "పగలల్లా అన్నం లేదా! జీతం మొత్తమ్మీద పన్నెండా?" అని అన్నది.

"ఆఁ, పన్నెండు. ఆయన పెద్దవాడయాడు. నల్లమందు వేసుకుంటాడు. తాగటానికి పాలచుక్కయినా లేదు. ఇన్నాళ్లకు ఆయనమీద దేముడికి దయ వచ్చిఉంటుంది; ఇహ కొద్దిరోజులలోనే ఆయన కష్టాలు గట్టెక్కిస్తా డనుకుంటా" అని మాధవు డన్నాడు.

బిందువాసినికన్నులనుండి నీరు బొటబొటమని జారింది. ఇన్నాళ్లనుండీ ఎన్నడూ చేయని పని ఒకటి ఇప్పుడు చేసింది. ఆమె వంగి మగని పాదాలు రెండూ పట్టుకుని ఏడుస్తూ రోదిస్తూ "మిమ్మన్ని బతిమాలుకుంటున్నాను. ఏదో ఒకదారి చూడండి. వారు ఆరోగ్యంగా లేరు. ఇల్లాగయితే రెన్నాళ్లయినా బతకరు" అని అన్నది.

మాధవుడు తన కన్నీళ్లు వెల్లాగో తుడుచుకుని "నే నేమి దారి చూడను! వదినెగారు మన బియ్యం ఒక్క గింజయినా ముట్టరు. ఇహ ఆయన కష్టపడక పోతే వాళ్ల సంసారం ఎల్లా వెళ్లమారుతుంది?" అని అన్నాడు.

"ఆసంగతంతా నా కేమీ తెలియదు. ఇదిగో వినండి: మీకంటే వేరేదైవం నాకు లేదు. బావగారంటే అంతకంటే ఎక్కువ. ఛీఛీ! తలచడానికిగూడా వీలులేని—" అని స్వరం కుంటుపడిపోగా బిందు మాటాడలేకపోయింది.

"మంచిదేకాని ఆఖరుకు నీవు వదినెగారి దగ్గిరకైనా వెళ్లు! ఆవిడకోపం పోయేట్టు చూడు! ఆమెను ప్రసన్నురాలిని చేసుకో! ప్రొద్దూకులూ నాకాళ్లట్టుకుని కూచున్నా నీ కేమీ దారి దొరకదు" అని మాధవు డన్నాడు.

బిందు వెంటనే కాళ్లొదిలేసి లేచి నిలబడి, "కాళ్లట్టుకునే అలవాటు నాకు లేదు. ఆవిడా రాత్రి నీరయినా ఇక్కడెందుకు తాగలేదో, ఇంకా మీ రీ సంగతంతా ఎరిగుండీనిన్నీ శత్రువులాగ నాకు చెప్పకుండా ఎందుకున్నారో ఆసంగతంతా నా కిప్పుడు తెలిసొచ్చింది. నాతప్పు ఎక్కువ చెయ్యడానికా మీ రప్పుడు చెప్పకుండా ఊరుకుంట?" అని అన్నది.

మాధవుడు కాకితమ్మీద మనస్సుపెట్టి "నే నా విద్య మా అన్నగారి దగ్గర నేర్చుకున్నాను. ఆలా ఊరకుండే ఒకనాడు దాటిపోయ్యేట్టుగా ఈశ్వరుడు నన్ను కరుణించాలి" అని అన్నాడు.

బిందు మరి మాటాడలేదు. తన గదిలోకి వెళ్లి తలుపేసుకుని పడుకుంది.

మాధవుడు లేచివెళ్లడానికి సిద్ధంగా ఉండగా బిందువాసిని మళ్లా అక్కడికి వచ్చింది. ఆమెకళ్లు ఎర్రబారినయ్. మాధవుడికి దయ కలిగింది.— "ఇదిగో ఒక్కసారి అక్కడికి వెళ్లిరా. ఆమెసంగతి నీకు తెలుసుగదా! ఒకసారివెళ్లి ఊరికే నిల్చో. చాలు. దాంతో అన్నీ పనులూ అవుతయ్."

బిందు అత్యంత కరుణస్వరంతో ఇల్లా అంది: "ఇదిగో మీరు వెళ్లండి; మీరు వెళ్లకపోతే వుత్రాడి మీ కొట్టు!"

మాధవుడామె ఉద్దేశం గ్రహించి కొంచెం వేడిరొక్కి "నీవు వేయి పోట్లు పెట్టుకున్నా నేను పోయి అన్నగారితో చెప్పలేను. ఆయన స్వయంగా నన్నడిగితేనే తప్ప, నా మెడ కోసి పారేసినాసరే, ముందస్తిగా వెళ్లి చెప్పే సాహసం నాకులేదు" అని అన్నాడు. మాధవు డీల్లా అన్నా బిందువాసిని అక్కడ నుంచి కదలలేదు.

"నీవు వెళ్లలేవా?" అని మాధవు డడిగాడు. బిందు జవాబు చెప్పక లేచి తల వంచుకుని మెల మెల్లగా వెళిపోయింది.

[సశేషము]

# కుంతి

— శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి —



కృపయో, కోపమొ, సర్వవేత్తయగు మౌనీంద్రుండు నాకిప్పుడే
యుపదేశించెను మంత్రమొం డది నిజంబో కాదొ యం చూఱకే
జపముం జేసితి నిన్ దలంచి యిది యిచ్ఛావృత్తిచేఁ గాదు నా
యపచారమ్మును సైపుమయ్య గనుమయ్యా నాదుకన్యాత్వమున్.

సంతతికోసమై చిరవిచారముచే కృశియించునామెకీ
మంతరమున్ జపించుకొనుమా యన న్యాయము గాని లోకసి
ద్ధాంత మెఱుంగలేని పసిదానికి మూఢ్యశధూర్తబాల కే
మంత మునింగిపోయెనని యా మునిచంద్రుఁ డొసంగె మంత్రమున్.

ఇది యన్యాయము భాస్కరా! మొదట నాదేతప్పు కావచ్చు నీ
పదిరెండేఁడుల కన్నె నింత క్షమియింపంజాలవా - ఇంక నా
బ్రదుకున్ ఘోరకళంకదూషిత మొనర్పంజాతువా జ్ఞానసం
పదకున్ మూలమవైన నీకెవరు చెప్పన్నేర్తురయ్యా ప్రభూ!

"పొరఁబాటో, మతియేమొ, నీవిట జపమ్మున్ జేసినా వింక త
ద్వరమంత్రార్థము నిష్ఫలమ్ముగ నశింపంజాల దో బాల! మ
త్పరిభుక్తంబయి నిష్కలంకమగుఁ గాత న్నీదుకన్యాత్వ మీ
వర మేనిచ్చితి నందియుంబు భయమున్ వర్జింపు కన్యామణీ!"

ఏమిమహాప్రభూ! ఎచటి కేగితి వీ నిముసంబులోనె నీ
ధామ మొకండు నన్ పులకితంబొనరించె నిదేమిచిత్ర మ
య్యో! మతిలేనిదానికి శిశూదయ మొక్కటియా పరాత్పరా!
ఈమహిమానుభూతి కిట నేడుతునో, మఱి సంతసింతునో!

ఓయి! యభాగ్యసంభవశిశూ! మరణింపుము వేగ లేనిచో
నాయపచారపున్ ఫల మనంతము నీ కనుభోజ్యమయ్యెడిన్
నాయన! శైశవమ్మునయిన న్విడనాడని నాకుఁ బుట్టి దీ
ర్ఘాయువు నెట్లు పొందుదువురా ధరణిన్ దురదృష్టవంతుఁడా!

కూన! దివాకరుండు జనకుండట నీ కిది కారణమ్ముగా
జ్ఞానము విక్రమం బితరసాధ్యముగాని యశమ్ముఁ గొందువే
గాని ధరాస్థలిన్ బ్రదుకఁగల్గు దినంబులలోనఁ దుచ్ఛకా
సీనపదంబు నివ్వడుచునే తలక్రిందుతపంబుఁ జేసినన్?

నామర్యాద నశించిపోవుట యటుండన్ కర్మసంపత్సరీ
ణామంబై జనియించి నవ్వుకొను ఈ నానెత్తుకుంగడ్డ తా
నేమైపోవునొ-దీనిఁ జంపుకొని నేనేచత్తునా కర్మసా
క్షీ! మాటాడ విదేమి నీకు నొక పూచీ లేదా యీబిడ్డపై?

“దోసం బంట దటంచు నే నుడువలేదో నీదుమర్యాదకున్
నాసంతానపు బాధ్యతల్ తెలిసికోనా నేను-నీకేల నా
యాసం బీపసికూనఁ బెట్టె నిడి గంగాంభః ప్రవాహమ్మునం
దేసంకోచములేక వీడు మితఁ డెంతే నున్నతిం బొందెడిన్.”

స్వామి! కృతార్థురాలను,విచారములేదిఁక నాకు-నిప్పుడే
ప్రేమను చంపుకొంటి నిదె వీడిటి నీకరుణాఫలంబు ను
ద్దామతరాంబుమధ్యమున, దాని సుఖంబగుచోటఁ జేర్పు మ
య్యా! మహితప్రభావ! గొనుమయ్య మదీయనమశ్శతంబులన్.

తనయులకోసమంచు పరదాపడి యేపెఱవారిబిడ్డనో
గొని కడు ముద్దుగాఁ బెనుచుకొందురు కొందఱు; కన్నబిడ్డ న
ర్కుని యవతారమున్ కవచకుండలమండితు నిట్లు గంగలో
మునిచిన తల్లి నేనొకతెఁ బుట్టితి నేఁటికి భారతావనిన్.

ఈయన్యాయ ముహూర్తముల్ గడచిపోయెన్-ముందు నాజీవితా
ధ్యాయం బెట్లు ముగించుకొందు-నిట సూర్యస్పృష్టమౌమేను న
న్యాయత్తంబొనరింతునో-మరణ పర్యంతంబు శ్రీ భాస్కరా
ర్చాయోగమ్మున తృప్తినందుదునో-నిర్ధారింతు ముందెవ్వడో.

---

# కుంతి

— శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి —



కృపయో, కోపమొ, సర్వవేత్తయగు మౌనీంద్రుండు నాకిప్పుడే
యుపదేశించెను మంత్రమొం డది నిజంబో కాదో యం చూఱకే
జపముం జేసితి నిన్ దలంచి యిది యిచ్ఛావృత్తిచేఁ గాదు నా
యపచారమ్మును సైపుమయ్య గనుమయ్యా నాదుకన్యాత్వమున్.

సంతతికోసమై చిరవిచారముచే కృశియించునామె కీ
మంతరమున్ జపించుకొనుమా యన న్యాయము గాని లోకసి
ద్ధాంత మెఱుంగలేని పసిదానికి మాదృశధూర్తబాల కే
మంత మునింగిపోయెనని యా మునిచంద్రుఁ డొసంగె మంత్రమున్.

ఇది యన్యాయము భాస్కరా! మొదట నాదే తప్పు కావచ్చు నీ
వదిరెండేఁడుల కన్నె నింత క్షమియింపంజాలవా - ఇంక నా
బ్రదుకున్ ఘోరకళంకదూషిత మొనర్పంజూతువా జ్ఞానసం
పదకున్ మూలమ వైన నీ కెవరు చెప్పన్నేర్తురయ్యా ప్రభూ!

"పొరఁబాటో, మఱియేమొ, నీవిట జపమ్మున్ జేసినా వింక త
ద్వరమంత్రార్థము నిష్ఫలమ్ముగ నశింపంజాల దో బాల! మ
త్పరిభుక్తంబయి నిష్కలంకమగుఁ గాత న్నీదుకన్యాత్వ మీ
వర మేనిచ్చితి నందియుంబు భయమున్ వర్జింపు కన్యామణీ!"

ఏమిమహాప్రభూ! ఎచటి కేఁగితి వీ నిముసంబులోన నీ
ధామ మొకండు నన్ పులకితంబొనరించె నిదేమిచిత్ర మ
య్యో మతిలేనిదానికి శిశూదయ మొక్కటియా పరాత్పరా!
ఈమహిమానుభూతి కిట నేడుతునో, మఱి సంతసింతునో!

ఓయి! యభాగ్యసంభవశిశూ! మరణింపుము వేగ లేనిచో
నాయపచారపున్ ఫల మనంతము నీ కనుభోజ్యమయ్యెడిన్
నాయన! శైశవమ్మునయిన న్వ్రీడనాడని నాకుఁ బుట్టి దీ
ర్ఘాయువు నెట్లు పొందుదువురా ధరణిన్ దురదృష్టవంతుఁడా!

కూన! దివాకరుండు జనకుండట నీ కిది కారణమ్ముగా
జ్ఞానము విక్రమం బితరసాధ్యముగాని యశమ్ముఁ గొందు వే
గాని ధరాస్థలిన్ బ్రదుకఁగల్గు దినంబులలోనఁ దుచ్ఛకా
నీనపదంబు నిన్విడుచు నే తలక్రిందుతపంబుఁ జేసినన్?

నామర్యాద నశించిపోవుట యటుండన్ కర్మసంపత్సరీ
ణామంబై జనియించి నవ్వుకొను ఈ నానెత్తుకుంగడ్డ తా
నేమైపోవునొ-దీనిఁ జంపుకొని నేనేచత్తునా కర్మసా
క్షీ! మాటాడ విదేమి నీకు నొక పూచీ లేదొ యీబిడ్డపై?

"దోసం బంట దటంచు నే నుడువలేదో నీదుమర్యాదకున్
నాసంతానపు బాధ్యతల్ తెలిసికోనా నేను-నీకేల నా
యాసం బీపసికూనఁ బెట్టి నిడి గంగాంభః ప్రవాహమ్మునం
దేసంకోచము లేక వీడు మితఁ డంతే నున్నతిం బొందెడిన్."

స్వామి! కృతార్థురాలను,విచారము లేదిఁక నాకు-నిప్పుడే
ప్రేమను చంపుకొంటి నిదె వీడితి నీకరుణాఫలంబు ను
ద్దామతరాంబుమధ్యమున, దాని సుఖంబగుచోటఁ జేర్పు మ
య్యా! మహితప్రభావ! గొనుమయ్య మదీయనమశ్శతంబులన్.

తనయులకోసమంచు నరదాపడి యేపెఱవారిబిడ్డనో
గొని కడు ముద్దుగాఁ బెనుచుకొందురు కొందఱు; కన్నబిడ్డ న
ర్కుని యవతారమున్ కవచకుండలమండితు నిట్లు గంగలో
మునిచిన తల్లి నేనొకతెఁ బుట్టితి నేఁటికి భారతావనిన్.

ఈయన్యాయ ముహూర్తముల్ గడచిపోయెన్-ముందు నాజీవితా
ధ్యాయం బెట్లు ముగించుకొందు-నిట సూర్యస్పృష్టమా మేను స
న్యాయత్తంబొనరింతునో-మరణ పర్యంతంబు శ్రీ భాస్కరా
స్వాదయోగమ్మున తృప్తినందుదునొ-నిర్ధారింతు ముందెప్పుడో.

---

# రాణా ప్రతాపసింహచరిత్ర

●

= శ్రీ విశ్వనాథ సత్యనారాయణ =

మన దేశములో నాంధ్రగ్రంథములు చదువువారే లేరు. ఉన్న కొద్దిమంది పూర్వప్రబంధములు చదువుదురు. ఆధునికులలో దమరికి నచ్చిన యేయొక్క కవినో చదివి వాడే శిష్టాదిగురు వని కూర్చుందురు. మఱియు వేయి పోకిళ్లు. సరిగా గ్రంథమును చదువుట, కవిశక్తి నిర్ణయించి, యాగ్రంథమున కీయవలసిన స్థానము నిర్ణయించి యా స్థానము చెడిపోకుండ చూచుకొనుట యేదో కాలము చేయునని వదలిపెట్టుదురు. లేదా విమర్శ యని పేరుపెట్టి యందందు గల రెండు మూడు స్ఖాలిత్యములు, రెండుమూడు శబ్దదోషములు తీసి పెదవి విరిచి చప్పరింతురు. ఈజబ్బు మన దేశమున పెద్దలమొదలు పిన్నలవఱకు వ్యాపించినది. పైగా నున్నమాట యన్నచో నులుకెక్కువ. పూర్వగ్రంథములే పరమోత్తమము లని, ప్రసిద్ధకవులే కవు లని చాలమంది యనుకొనుచుందురు. ప్రసిద్ధి బహువిధముల రావచ్చును. కావ్యగతప్రశస్తిచేత వచ్చిన ప్రసిద్ధి నిలువద్రొక్కుకొనును. తక్కినది వచ్చినమార్గమును బట్టి పోవును.

కావ్యవస్తువు పాశ్చాత్యము, పరమతసంబంధియైనకొలది పరువెక్కువగా గనుపించుచున్నది. గ్రంథమున ప్రశస్తి తెచ్చుకొనుటలోగూడ బలుత్రోవలు గలవు. నిరాడంబరముగా గ్రంథము వ్రాసి జాతీయమైన వస్తువును గ్రహించి రసవత్తరముగా వ్రాసిన గ్రంథములు కొన్ని యాదరింపబడుట లేదు. అందులో 'రాణాప్రతాపసింహచరిత్ర' తలమానికమువంటి గ్రంథము. ఈగ్రంథరచయిత దుర్భాక రాజశేఖరశతావధానిగారు. ఇది కొంచెము తక్కువగా రెండువేల గ్రంథము.

మన దేశమున భారతభాగవతములు విమర్శ్యములగుచున్నవి. భాషచేత కాదు; భావములచేత. జాతీయ సంప్రదాయములయందు, సిద్ధాంతములయందు పలుమంది పెడత్రోవలు త్రొక్కుచున్నారు. దీనితోపాటు దేశభక్తికూడ వెనుకబడుచున్నది. క్రొత్త క్రొత్త యని యారాటపడుచుండుటలో ప్రాతలోని మహాగుణము లంతర్హితములగుచున్నవి. మనస్సుతోడివి పాశ్చాత్యదేశము లని, హృదయముతోడివి ప్రాచ్యదేశము లని చాలమంది పెద్దలు వ్రాసిరి. ఈహృదయమును వదలిపెట్టినచో మనకే కాదు ప్రపంచకమునకే ముక్తి లేదు. ఆహృదయ మీ 'రాణాప్రతాపసింహచరిత్ర'యందు మహాభారతమునం దెంత యున్నదో యంత యున్నది.

'భారతము' దేశభక్తిని పెంపొందించు నని రష్యను దేశస్థులు తమ భాషలోనికి అనుభాషించుకొనుచున్నారట. ఆభారతము మనము కాదనుచున్నాము. భారతమున కాశక్తి యున్నచో 'రాణాప్రతాపసింహచరిత్ర'కును ఆశక్తి కలదు. భారతదేశము భారతదేశ మందుముగాని భిన్నభాషలు గల భిన్నప్రాంతీయులము సమైక్యభావ మెంత యున్నదో చెప్పలేము. ఇది చెప్పలేకపోవుటకు గారణము ఆ సమైక్యభావమునకు హేతుభూతమైన భారతీయధర్మము వివాద్యమగుట.

రాణాప్రతాపుడు పేరునకు రాజపుత్రుడు. ఆంధ్రుడు కాడు. ధర్మరా జాంధ్రుడా? కృష్ణు డాంధ్రుడా? రాము డాంధ్రుడా?, శంకరు డాంధ్రుడా? వారందఱు భారతీయులు. అందుచేత ఆసేతుశీతనగము వారి కథలు పాడిరి. అట్లే ప్రతాపుడును.

ఇంగ్లండులో గవితాయుగము పోయినదని, గద్యయుగము వచ్చినదని చెప్పుదురు. "యథా రాజా తథా ప్రజా—"మనకుగూడ నట్లే కాబోలు. పద్య

కవితకు చదువరులు తక్కువయిరి. గ్రహించగల శక్తియు చాలవఱకు లోపించినది.

భారతము పూర్వకాలముకథనే చెప్పును. అందులో నున్న ధర్మముమాత్రమే మన జాతిది. ఆ విషయము ద్వాపరయుగమునాటిది. మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాపసింహచరిత్ర మన ధర్మమునేగాక, మన పరిస్థితులనుగూడ చెప్పును. అక్బరుచక్రవర్తితో పాతికయేండ్లు హోరాహోరి పోరాడి స్వదేశము వదలి కొండలలో, గుట్టలలో నివసించి తిండిలేక గడ్డిరొట్టెలు తిని దైవవశమున మఱల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురుషుడు రాణా ప్రతాపుడు. ఆయనకన్న ధర్మరాజాదు లేమియు గొప్పవారు కారు. వస్తురమ్యతకుగాని, కథాచమత్కారమునకుగాని, యిందలి భిన్నపాత్రల భిన్నతా విశిష్టతకుగాని భారతమున కీగ్రంథము తీసిపోదు.

వస్తు విటువంటిది. కవి యెటువంటివాడు? వ్యాసునకు, తిక్కన్నకు నెంత వీరరసావేశ మున్నదో యంత వీరరసావేశము గలవాడు. వెనుకటికి బ్ర॥శ్రీ॥ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని ఎవరో ప్రశ్నించిరట! భాగవతము పోతన్నగారు వ్రాయనిచో మఱి వ్రాయుటకు సమర్థు లెవరని. కాసుల పురుషోత్తమకవి యని వారే సమాధానము చెప్పిరట! న న్నెవరైన భారతములోని యుద్ధపంచకము తిక్కన్నగారు వ్రాయకయుండుచో మఱియెవరు వ్రాయగల్గుదురని ప్రశ్నించినచో నేను "రాజశేఖర శతావధానిగా"రని సమాధానము చెప్పెద. ఈగ్రంథములో చివరి నాల్గాశ్వాసములు యుద్ధమే తక్క వేరే లేదు. యుద్ధవర్ణన రొచ్చుట చూచినను తిక్కన్నగారి రచనతో దులదూగుచున్నది.

ఈగ్రంథము అస్వతంత్రజాతి కొక స్మృతి గ్రంథమువంటిది. రాణాప్రతాపుని భద్రాకరణప్రతిజ్ఞ చూడుడు. భద్రాకరణ మనగా శిరోముండనము చేయించుకొనకుండనుండుట. ఈభద్రశబ్దము ఈయర్థమున ప్రస్త్యంతమగును. ఇది కొంచెము గడుసుప్రయోగము. ఇది కవిగారి మాటయే—ఈఘట్టము ద్వితీయాశ్వాసములో నున్నది. ఈఘట్టము చదివినచో పారతంత్ర్యజాతికి ఇది స్మృతిగ్రంథమన్నమాట కర్థము తెలియును.

ఈకథకు, మన నేటిస్థితికి నెంత సంబంధ మున్నదో మన నేటిస్థితి తలంచుకొని గుండెరందురువానికి తెలియును. రాణాప్రతాపునకు, మహాత్మునకు గల సామ్యము భారతజాతికి గల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు; ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపుపోరు. ప్రతాపసింహుడు అక్బరును జయించవలెనని యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువలేనని యాయనకు తెలియును. కాని పట్టి ధర్మముకోసము యుద్ధము చేసెను. భారతజాతీయధర్మము పరులకు లొంగదు, చచ్చిపోవు నని రుజువుచేయుటకే యుద్ధము చేసెను. "కాన విజయంబె ముఖ్యంబు గాదు మనకు-ధర్మనిర్వహణంబు కర్తవ్య మిపుడు"—ఇది ప్రతాపుని యూహ. ఈఘట్టము చదువవలయును. నేటి సత్యాగ్రహమునకు, ఆనాటి ప్రతాపుని యుద్ధధర్మమునకు భేదమే లేదు.

ప్రతాపీయులు అన్నము తినలేదు. నీరు త్రావలేదు. నిదురపోలేదు. ఇది బలవంతముచేత గాదు. వ్రతముచేత.

ఈకథకు, మనకథకు వేయి పోలికలు. అన్నిటికన్న గొప్ప పోలికలు రెండు కలవు: మానసింహునకు ప్రతాపుని మీద కల కోప మొకటి; పృథ్వీసింహునకు ప్రతాపసింహునిమీద కల యభిమాన మొకటి. మానసింహ పృథ్వీసింహు లిద్దఱును అక్బరుచక్రవర్తి కొలువరులు. మానసింహుడు ప్రతాపునియందు మాత్సర్యము పెంచుకొన్నవాడు. పృథ్వీసింహుడు "అయ్యో! నే నెట్లును లొంగిపోయితిని, నా జాతి స్వాతంత్ర్యచిహ్నము ప్రతాపునియం దున్నది. ఆ చిహ్నముగూడ నంతరించిపోవునేమో" యని దిగులుపడినవాడు. ఇంతకంటె గొప్ప పోలికా! అబ్దూరహిమాన్. ఈయన అక్బరుచక్రవర్తి సర్వసేనాని. వీరరసారాధకుడు. ప్రతాపునకు పృథ్వీసింహుడు వ్రాసిన యుత్తరము కవిరైన ఈ ముసల్మాన్ సేనాని వ్రాసిపెట్టినది. ఆయన యెంత వీరుడో, అంత కవి! రవిధ్వజము గజధ్వజముగా, కృపాణము నందకముగా, కవచము పట్టుబట్టగా హల్దీఘాటు యుద్ధమున తనకు "ప్రతాపరాజ నారాయణుండు దర్శన మొసంగె"నట. అత డక్బరుతో నను చున్నాడు. ఆ ప్రతాపుడు—

"అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రా
జ్యం బేలఁగాలేఁడో! మ
చ్చికమై భూప్రజఁబుత్రులన్ బలెఁ గృపా
శ్రీఁ జూడఁగాలేఁడో! పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి చిరం
బై నిల్పఁగాలేఁడో రెం
డుకు వాతండు స్వతంత్రుఁడై నిలువఁగా
డో! యావతీఁగో రెదన్."

ఈ మహానుభావుడు చెప్పిన యీ యర్థములో బూర్వ భారత దేశమునందు గల భిన్న రాజ్యముల ధర్మమిమిడియున్నది. షట్చక్రవర్తులు, షోడశ మహారాజులు చక్రవర్తులు గాని, రాజులు గాని యనుట రాజ్యమును విస్తరింపజేసి యేలిన దేశవిస్తీర్ణతబట్టి కాలేదు. వారు పాలించిన ధర్మముయొక్క యౌత్కృష్ట్యమునుబట్టి యయినారు. నలమహారాజు ఒక్క నిషధదేశమునకే రాజు. కాని షట్చక్రవర్తులలో నొకడు. ఆ చక్రవర్తిత్వము వేదవేదాంగపరమార్థ నిర్ణయము. యజ్ఞములు సేయుట. తన రాజ్యములో నున్న కుక్కపిల్లకూడ డొక్క లక్షణిగానిపోకుండజేయుట. ధర్మముతో బాలించు రాజును మఱియొకరా కెందుకు గెలువవలయును? ధర్మలోభముచేత గాదు. ధనలోభముచేత! ధర్మ మెక్కడిది? చచ్చి శతసహస్రాబ్దము లయినది. ఈ రహీమానుడు మఱియు ననియెను: "ఆ ప్రతాపునకు తాము సమకాలికు లగుటయే గొప్ప తనమట. ఇట్టి రహీమానులు నేటి పాశ్చాత్యులలో నెంతమంది లేరు? ఆపాశ్చాత్యులలో నక్బరు చక్రవర్తులే లేరు! అక్బరు చక్రవర్తి ప్రతాపుని గురించి యిట్లనెను: "ఆ మహానాయకవతంస మా ప్రతాపుడెన్నిగతుల యోజించిన నన్నుబోలు కోటి సార్వభౌములు చేరి కొలువఁదగిన క్షాత్రనిధి యనుమాట వజ్రాల మూట". "నాదు జీవిత శేష మంతయు ప్రతాపుసేవఁ గడపినఁగాని దుష్కీర్తి పోదు." "బ్రతికినన్నాళ్లు బ్రతుకము" మేవాడు దేశము 'పాండవబీడు' చేసినాడట. "మన బ్రతుకులు పోరులని తెల్లవారిన వకటా!" ఇది యక్బరుయొక్క సౌశీల్యము. ఒక వ్యక్తి రాజై నప్పుడు అతని శీలముమీద అతని విరోధిరాజ్యముల యొక్క యదృష్టానదృష్టములు ఆధారపడియుండ వచ్చును. ఆరాజు వ్యక్తి కాక దేశమే రైనపుడు చెప్పవలసిన దే మున్నది? ఒక డేటికి లాగిన నొకడు కోటికి లాగును.

"పాండవబీడు", "కులపెద్దలు", "పిల్లేరుగంతు" మొదలైన యనేకములైన వాడుకలో నున్న శబ్దములు, మిశ్రసమాసములు ఈకవి యథేచ్ఛముగా వాడును. కవితామర్మము తెలియనివాడు వీనిని కాదనవలయును. ఈగ్రంథమునందలి శబ్దవిచారము కింకవీంద్రఘటా పంచాననులు పూర్వమే విస్తరించి చేసిరి. దానిని నేను వదలెదను.

ఈకవి యఖండమైన క్రొత్తపలుకుబడులు గల వాడు. "ఇతడు బాడబానలము బారద్రించు మహాబలుండు", "పిడుగులు ప్రేల్చ నరుకు మహాశౌర్యుడు", "మొదలజో నెత్తురు పంచుకొం చనుజాడై పుట్టెంది", "ఒకకాడన జనియించు రెండుపువుల ట్లొప్పారె", "దురదృష్టం బది యెల్ల నాపయిని గంతులెత్తెబ్బె", "అక్బరువిజయరథము కాడిమోసిరి స్వాతంత్ర్యఘనత మరచి", "పుడిసెం డూపిరి మేన నుండువఱకుం బోరాడి", "మాటలను గట్టి యాయువు బుజ్జిగత్తి శాశ్వతబ్రహ్మకల్ప మీజగతి నుందు మెరా"— ఈ మొదలైన వనేకములు. ఇంక సందర్భానుసారముగ లోకోక్తులు మొదలైనవి కుప్పతెప్పలుగా నుండి, గ్రంథము ఆంధ్రసరస్వతీదేవికి క్రొత్త భూషణముగా నున్నది.

ఈకవి రాజపుత్రయోధుల శౌర్యాదుల నెంత వర్ణించునో ముసల్మానుల శౌర్యాదుల నంతే వర్ణించును. హుమయూనుని వర్ణించుటయు, బేబరు పడ్డ కష్టములు వ్రాయుటయు నొక ముసల్మాన్ కవి యెంత యభిమానముతో వ్రాయునో యీయనయు నట్లే వ్రాసెను. అక్బరుచక్రవర్తిని వర్ణించుచు ప్రథమాశ్వాసములో ౧౫౭ మొదలు ౧౬౦ వఱకు వ్రాసెను. ౧౫౭-వ పద్యము: "ఆజానుదీర్ఘ బాహార్గళయుగళు డుద్యత్పద్మపత్రనేత్రములవాడు" మొదలైన పద్యము అక్బరు చక్రవర్తివర్ణన. అక్బరు రాజపుత్రరాజ్యములను నొక దానివెంట నొకదానిని గెలుచుచు వచ్చిన వార్త ౧౬౭ మొదలు ౧౭౦ వఱకు అయిదు కందపద్యములు మిక్కిలి

రమ్యముగా వ్రాయబడినవి. ఈరచన భారతమును తలపించుచున్నది. ఎదురులేని అక్బరువిజయధాటిని సూచించుచున్నది. ఈయక్బరు చిత్తూరుమీద కసిచేత- సంవత్సరము లవకు వశముకాలేదని కసిచేత ఇతర మహమ్మదీయభూపతులవలెనే ప్రవర్తించెను. ఇచ్చటి కవిదుఃఖము, అక్బరుని నిందించుట, నిందించుటలో నక్బరునందలి యభిమానము చిత్రముగా నున్నది. ప్రథమాశ్వాసము ౨౦౩-వ పద్యము మొదలు రాణా ప్రతాపుని కథ మొదలు. ఉదయసింహునకు ౨౫ మంది కొడుకులు. రెండవవాడు సూక్తుడు. మూడవ వాడు సాగరుడు. పెద్దవాడు ప్రతాపసింహుడు. ప్రతాపుని శీల మిటువంటిది: "అతిసాహసికుడు. యుద్ధంబన్న విందని తలచుచుండు. నోరులతో పలుకడు. పరులను గెలువడు. నవ్వడు నొవ్వ డీనాడుగాని. అను కొన్న పనిని చేసినదాక విడువడు." జగమల్లుడు మతి యొకడు. ఇతడు శౌర్యహీనుడు. అతనికే రాజ్య మీయవలయు నని రాజు తన పరచారులతో చెప్పి పోయెను. ఈరీతిగా పెద్దకొడుకైన ప్రతాపునకు రాజ్యము దూరమైనట్లు కనిపించెను.

"కమలాప్తాన్వయమా! భవత్కృతమహో
ఘం బేమొ! రాముండు పూ
ర్వము కొన్నేడులు మానియుండవలసెన్
పట్టాభిషేకంబు; చం
దమహీనాథుండు లేకయే చనియె; నీ
నాఁ డీప్రతాపుండు ప
ర్వము గోల్పోయెను; దుర్బలుల్ జనకుతా
రా! యెంతకున్ గర్తలో"

అని బంధుజనులు విషాదమొందిరి. సలుంబ్రా కృష్ణుడు అచ్చటి తీర్పరి. రాజుతో సరేనసెను. కాని చివరకు ప్రతాపునే రాణాచేసెను. జగమల్లు డభ్యంతరపెట్టెను. ఈకవి చాలచోట్ల నన్నయ్యగారిని పోలినట్లు వ్రాయును. రాజసూయమున సహదేవు డన్న మాటలకు, ఇచ్చటి సలుంబ్రాకృష్ణుని మాటలకు పోలిక చూడుడు.

"ఇచ్చొప్పె నీప్రతాపున్ మహా
రాణాగా నొనరింతు మాడదను ధీ
ర గ్రామణుల్ కల్గినన్
బాణిం బైకొగనెత్తి డిప్పుడె నెదు
ర్పన్వత్తు నత్యుద్ధతిన్"

జగమల్లుని త్రోసిరాజని కృష్ణుడు ప్రతాపసింహునే సింహాసన మెక్కించెను. "పరిఫుల్లరుచిరసరసిజసరం సరలు నెరపినట్లు సభాభవనం బుర్వరజనుల నెమ్మొగములు పరమామోదమున నపుడు భాసిలుచుండెన్." ఇది మరల నన్నయ్యగారి రచన. ఈపట్టాభిషేకోత్సవ మంతయు ప్రబంధసరణి నడచెను. సాగరసింహు డని యింకొక కొడుకు. అతడు ప్రతాపసింహుని నాక్షేపించెను. పెద్ద కలహము పెంచెను. ఇద్దఱకు యుద్ధము కావలసినంత స్థితి వచ్చెను. చివరకు సాగరసింహుని దేశమునుండి వెడలనడువవలసివచ్చెను.

రెండవ కొడుకైన సూక్తుడు సలుంబ్రాకృష్ణుని వద్ద పెంపబడెను. రాణా అతనిని తనవద్దకు పంపు మనెను. శ్రీకృష్ణుడు పంపెను. సలుంబ్రాకృష్ణుడు శివాజీకి తానాజీ యెటువంటివాడో ప్రతాపసింహున కిత డటువంటివాడు. అతని భావములు: "స్వామి స్నేహముప్రోల తుచ్ఛములు సప్తద్వీపసామ్రాజ్యముల్."

వసంతకాలము వచ్చెను. ఎల్లరాజులు ప్రతాపునకు కానుకలు పంపిరి. మఱల నన్నయ్యగారివలె వ్రాయుచున్నాడు:

"తలపైనన్ మగటాఁడురాయి వెలుఁగొం
దన్, ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, దొడ్డమనతే
జీ లెక్క యోధాళి చెం
తల జేరఁ, బ్రతాపసింహుఁ గొలువన్
నానామహీమండలేం
ద్రులు వేంచేసి రుగాదికానుకలు కొం
తుల్ దొంతరల్ తెచ్చుచున్."

అప్పు డందఱు వేటకు బోయిరి. ఈవేటకు బోవునపుడు రాజపురోహితుడైన , సారభట్టుగూడ వెళ్లెను. ఈపురోహితులుగూడ వీరులే. రాజులకు ప్రాణములు ధారవోసినవారు. ఐహికాముష్మికములకు చేయూతలైనవారు. పాతికయేండ్లు ప్రతాపుడు

నానాకష్టములు పడినతరువాత తన సంపద యంతయు ప్రతాపుని కిచ్చి రాజ్యమును మరల గెలిపించుటకు హేతుభూతుడైన భామాసాహి పురోహితుడే. బ్రాహ్మణుడు. పూర్వకాలమున బ్రాహ్మణులును, పురోహితులును రాజవంశముల కట్లు సాయపడిరి. యూరపులోని క్లర్జీ (Clergy) వంటిది కాదు ఇచ్చటి బ్రాహ్మణ్యము—అపోలిక దెచ్చుకొని ప్రతారించుటకు, ప్రతారించుకొనుటకు.

ఈహారభట్టును వేటకు వెళ్లెను. అచ్చట వేట యైనతరువాత కూర్చుండి మాటలాడుకొనుచుండగా నొక వరాహము వారి నడిమికి వచ్చెను. దానిని అన్నదమ్ములిద్దఱు-సూక్తుడును, ప్రతాపుడును- తమ బాణములతో గొట్టిరి. నేను చంపితి నన నేను చంపితి నని తగవులాడిరి. సూక్తుడు ప్రభువుతో, నన్నగారితో వివాదము పెంచెను. సలుంబ్రాకృష్ణునిగూడ లెక్క సేయలేదు. అది ముదిరిముదిరి పెద్ద కయ్యమయ్యెను. హారభట్టు సూక్తునకు నీతి నుపదేశించెను. ఆపురోహితునితో సూక్త డిట్లు పొగరుబోతుతనము ప్రకటించెను:

"తనదా శక్తికి వీరు కార్యములకున్
దారొక్కన్నచో ముప్ప వ
చ్చును మాయిర్వురిలోన నొక్కడు రణ
క్షోణిన్ మృతిన్ గన్న మీ
రును రావచ్చును, జేన్వవచ్చు, మఱి పౌ
రోహిత్యమున్ జేయవ
చ్చును, లబ్ధిన్ గొనవచ్చు, నిప్డు చనవ
చ్చున్ దాటి దూరంబుగన్."

ఇది సూక్తుని మాటలు. పౌరోహిత్యము_లబ్ధి-ఆసంస్థను చూచిన చూపు! తల పెడతిరిగిన బుద్ధి. అంతే హారభట్టు వారి యుద్ధ మాపలేక వారి నడుమ తాను కత్తిపెట్టి పొడుచుకొని చచ్చెను. "నాటి కష్టదశ తీర్పన్ బూని యాత్మార్పణం బొనర్చెన్ హారభట్టు." అంత యుద్ధము సమసిపోయెను. "గురురుధిరమ్ము దాటగను కూడదు"అని ప్రతాపుడు యుద్ధమును మానివేసెను. సూక్తుడు దేశమును వదలిపోయెను. ఎచ్చటికి బోయెను? "తా నరిగెను ఢిల్లిత్రోవకు, కులాంతకు లందఱు పోవు తావుకున్."

ఇచ్చటినుండి ప్రతాపుని శౌర్యాగ్ని రాజి, మండి యత్యుగ్రమై పాతికయేండ్లు తగులబెట్టిన ఘట్టము. ఆ శౌర్యము, ఆ యుద్ధములు, ఆ ప్రతిజ్ఞలు అవి యన్నియు వ్రాసినచో పట్టరానంత గ్రంథమగును. ఈ కవిసార్వభౌముడు ఈ ఘట్టము చిత్రచిత్రములుగా వ్రాసెను. మొదటనే చెప్పితిని గదా యీ గ్రంథము యుద్ధపంచకముగలె నున్నదని. ప్రతాపుడు దేశమంతయు బీడుపెట్టించి తన్ను సేవించు నందరిని వెంటదీసికొని కుంబల్మేయర్ దుర్గములో గూర్చుండును. సలుంబ్రాకృష్ణుడు, భానుసింహుడు, మనస్సింహుడు, శ్యామసింహుడు, తేజసింహుడు- రామచంద్రదేవుడు, భిల్లనాయకుడైన భీమచాందుడు వీరందఱును తమకతమ రాజభక్తులను దెల్పిరి. వారి రాజభక్తి తెలుపుటలను చదివియే చూడవలయును. ఈ వైరాగి యైన ప్రతాపునకు, ఆ మహారాజైన అక్బరునకు విరోధము. (భోగసన్యాసమున) "ప్రతాపుడు", (రాజ్యతృష్ణ చేత) "అక్బరు". తన చేతిలో చిక్కిన మొగలు సైన్యమును ప్రతాపు డెన్నిసార్లో వదలి పెట్టెను. ప్రతాపుని యీకట్టుదిట్టములు చూచి అక్బరు భయపడెను. ప్రతాపుని గెలువలేనని కాదు. ప్రతాపునిమీదికి పోయినచో దన కండగా నున్న రాజపుత్ర సేనానులకు కోపము వచ్చునని. అతడు దీర్ఘదర్శి. అప్పటికప్పుడు భేదముపన్నుట కాకపోయినను భేదము పుట్టుటకు ఒక పన్నాగము పన్నెను. తనకు బావమఱది యైన మానసింహునితో జాలిగా యిట్లు చెప్పెను: " తెగిన హారమున ముత్తియములు పోలె భారత రాజ్య మది పెక్కుప్రక్కలగుచు, చినదిన్న పాయలై చెడె." ఈ ముక్కల ముక్కలను తాను పెద్ద హారముగా గ్రుచ్చినాడట. ఈ ('కుబ్జా')వతారము తీసివేసి తా నాజానుబాహుని చేసెను. (ఆ కుబ్జులలో తన్ను నెవ్వరు కొలువలేదు కాని యీ యాజానుబాహుడు తన మోచేతినీళ్లు త్రాగువాడు) తాను "ప్రాభాత మృదుగంధవహునట్లు భారతమేదినీతల మాక్రమించెను." అహో యెంత మెత్తగా నాక్రమించినాడు! అని భేదమునకు బీజము నాటినాడు :

"నను గడుఁ జేర్మిమైఁ గనుచు
నాప్రభుతన్ మదిమెచ్చి కన్య ని
చ్చిన మిమువంటివారి వెలి
చేసి ప్రతాపనృపుండు పంక్తిభో
జనమునకైన నించుకయుఁ
నైపక తేలిక చేసిచూచె; మీ
ఘనతకు హాని వచ్చినను
గల్గవె నాకు విషాద వేదనల్."

ప్రతాపు డీ కులము చెడినవారితో భోజనము చేయడు. కులము చెడుట తప్పని ప్రతాపుని యుద్దేశ్యము. ఒక జాతియొక్క జాతీయతలో వర్ణభేద మంతర్భూతమని వారి యుద్దేశ్యము. ప్రత్యేకముగా భారతజాతిలో మానసింహాదులకు తాము చేసిన పనియే మంచిది యని. ఇది తప్పకుండ భేదమునకు బీజము. ఇది యెంత భేదబీజమో అక్బరుకంటె బాగుగా దెలిసినవారు తరువాత భారతదేశమున నెంతలు చేయుచున్నారో చూడుడు.తరువాత అక్బ రిట్లనుచున్నాడు:

"మఱి నాయొద్దను జేరు భూమిపతులన్
మర్యాదగా జూడనో
ధరణీభాగము లియ్యనో పిలిచి బాం
ధవ్యంబుచేకూర్పనో—
నృపులం వన్ సేవించి చేదేమి చేసిరి."—

ఇట్లనినాడు. మఱియు అతడు నీతో పంక్తిభోజనము నేయడు. అది మీ ఘనతకు హాని. "మీ ఘనతకు హానివచ్చినను గల్గవె నాకు విషాదవేదనల్?" ఇంత రాజనీతి యక్బరు ప్రకటించెను. ఇట్టి రచన సామాన్యకవి చేయునది కాదు. ఇది తిక్కనాదులు చేయదగ్గది. అక్బ రే బీజమును నాటెనో ఆ బీజము క్రమముగా ననుకూలించి వృక్షమయ్యెను. ఈ మాన సింహుడు ప్రతాపునియొద్దకు బోయి అక్బరును గుఱించి యెంతయో పొగిడెను. మానసింహుని వంశము నకు ప్రతాపుని వంశీయులు గురువులు. ప్రతాపుడు మానసింహుని పొగడిక విని అక్బరురాజనీతిని మాన సింహునికి విరిచి చెప్పెను. అక్బరుయొక్క మతములు వేరైనను బంధుత్వములు కల్పించుట నీతిలో భాగ మనెను.

"నిగూఢ మాతని మనోవ్యాపారలీలాగతుల్"—
"అల్లుడై బావరై మామలైన తన్ను
వెలితి కననీక శ్రీ మహావిష్ణువట్లు
భారతీయులు కొలంతురన్ భావమెరిగి
అక్బరిటు చేసె—"

అని చెప్పెను. అంత చల్లగా పాలించు నక్బరు రాజ్యములో ఘూర్జర దేశమున క్షామము. అక్బ రొక వంక దిగ్విజయము చేయుచున్నాడు. ధనేశ్వరమ్మన సన్యాసులలో సన్యాసులకు పోట్లాట పెట్టి తా నొక పక్షము చేరి వారందఱిని నాశనముచేసినాడు. ఇందు ప్రతాపునియొక్క ధర్మ మనసేమో, నిజమైన రా జెట్లుండవలయునో, ఆ ప్రతాపు డెట్లు నిజమైన రాజో ఈ ఘట్టమంతయు చదివినచో దెలియును. ప్రతాపుడు ప్రకృతి బిడ్డ. భోగవిముఖుడైన రాజు. భోగాభిముఖుడైన రాజువలన లోకములో గొంత భాగము తిండి లేకుండ బోవును.

"ఆ కాపట్యము లా దరస్మితము లా
యౌదార్య మా వియ్య మా
మోకాల్మ్రొక్కుడు లాచమావిధవ మా
ముప్పొద్దు సేవించుటల్
నాకెత్తున్ తలనొప్పి పట్టణముల
న్నన్ మీకు నెట్లుండునో—"
ఇది ప్రతాపుని మూర్తి అనిన మానసింహుడు—
"ఏరిటు పారజొచ్చె నెదు
రీత నెవండు సమర్థుడౌ వృథా
పౌరుషమున్నదంచు బడ
బాజ్యలనంబును బారద్రిమింగదే"

అన ప్రతాపుడు ఒక చిన్నకథ (Parable) చెప్పెను. ప్రతాపుడు గాంధివంటివాడు. ఏసుక్రీస్తు వంటివాడు. మహర్షులవంటివాడు. చివర కిట్లనెను: నా రాజ్య మరణ్యము. మేము సన్యాసులము. మీ యక్బరు నకు మమ్ము గెలువవలెనని పట్టుదల యేమి? "అప్రతిహతముగా నక్బ రొక్కడె యేల క్షితిని దేవుడు సృష్టి చేయలేదు." ప్రజ లతనిచే జంపబడుటకు బుట్టలేదు. రాజకన్యక లతని భోగపరత కుద్దేశింపబడలేదు. అతని రాజ్యతృష్ణమునందు సర్వజగత్తు "పారతంత్ర్యమున

ముసుగువెల్ల పాడిగాదనుచు నక్బ రెంత యెరిగిన జగమున కంత మేలు."

చివరకు భోజనవేళ మానసింహునకు గోపము వచ్చెను. నిష్ఠురోక్తు లాడెను. మిమ్ము శాసనము చేసెద నని చెప్పి లేచిపోయెను. అతడు పోయినతరువాత అందఱును ప్రాయశ్చిత్తము చేయించుకొనిరి. పుణ్యాహము చేయించిరి. పంచగవ్యము పుచ్చుకొనిరి. అది యొక విచిత్రమైన జగత్తు. ఆ జగత్తుయొక్క రమ్యతను తెలిసికొనుటకు పరభావములు రక్తములో జీర్ణించరాదు.

ఇట్లు వ్రాసిన నూరకే పెరిగిపోవును. యుద్ధము జరిగినది. ప్రతాపునియొక్క శౌర్యము తోడి సరదారుల శౌర్యములు పట్టరాకుండెను. శత్రుసైన్యములలో శక్తుడును, సాగరుడును నుండిరి. ఈ శక్త సాగరులు ప్రతాపుని తమ్ములు.

ప్రతాపుడు పౌరుషమునకు, ధర్మమునకు రెండవ యర్జునుడు. కురుబలము చూచి యర్జునుడు పొందిన విషాదయోగమువంటిది ప్రతాపుడును పొందెను. మొగలు సైన్యము సగానికిసగము రాజపుత్రులు. అందు కనియే ప్రతాపునకు "ఇది యవనసేనతో జేయు కదనమో, స్వజనముతో జేయు కదనమో శంక కలిగె. ఈశంక ఆనాటినుండి యీనాటివఱకు అట్లే యున్నది. యుద్ధములో మానసింహుడును, సలీమును పంచమంగళ మను యేనుగుమీద నెక్కి ప్రతాపున కెదురుబడిరి. ప్రతాపుని గుఱ్ఱము చైతకము. ఈ చైతకము చెవులు రిక్కించి ముందు కాళ్లు ఎత్తి పంచమంగళముయొక్క దంతముమీద రెండుకాళ్లు పెట్టి భయంకర హేష చేసెను. ప్రతాపుని యీ కైపోటునకు మానసింహసలీములు చనిపోవలసినది. కాని వారి యేనుగు గుఱ్ఱముయొక్క విజృంభణమునకు తాళుకొనలేక వెనుదిరిగి పారిపోయెను. "కనులున్న భాగ్య మీతని యమానుష శౌర్యరేఖ గంటి మటంచు రెండు పక్షముల భటు లని మాని నిలచిరి"; "అబ్దూరహిమాను నిలువెల్ల విస్మయుడైనాడు" ఈ చూపు నే ప్రతాపరాజనారాయణుడని వర్ణించినది.

ఈ యుద్ధములో ప్రతాపుని సైన్యములు చెదిరి పోయినవి. కాని ప్రతాపున కొక్కటే లాభము· ప్రతాపుని తమ్ముడు శక్తుడు ప్రతాపుడు అవతార పురుషు డని గ్రహించెను. మరల నన్నగారివైపే చేరెను.

చివరకు తన బిడ్డ 'మోలుగడ్డి'తో చేసిన రొట్టె తినుచుండగా నడవి పిల్లి వచ్చి యతనిని గీరి రొట్టె నెత్తుకొనిపోయెను. అది చూచిన ప్రతాపుని గుండె చెదరిపోయెను. ప్రతాపుడు చక్రవర్తి నారు నెలలు గడువడిగెను. ఉత్తరమిచ్చి భిల్లుని పంపించెను. ఆయుత్తరము జూచి యక్బరు పొందిన సంతోషమునకు మితి లేదు. అక్బరుసభలో పృథ్వీసింహుడు ఆయుత్తరమును ప్రతాపుడు వ్రాయనేలేదనెను. వారును వీరును వివాదపడిరి. "ఎదిరివాదమ్మునకుఁ దగు నెన్ని వసతు లున్నయు నోపంగి సత్యమ్ము నరయు టుచితము" అని యక్బ రనెను. ఇందులో వసతులలో నున్న సొగసు చూడుడు. ఆయుత్తరము తెచ్చిన భిల్లునితో పృథ్వీసింహుడును, అతని భార్యయు నిట్లనిరి:

"చెప్పుము చిత్తమిచ్చి యిదె
శ్రీనృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ము
ఖాంబురుహంబునఁ జంద్రబింబమున్
దొప్పెడి వెన్నెల ట్లలరు
నుత్తమహా దరహాసరేఖ తా
నెప్పటియట్ల పాయక ర
హించుచు నుండెనె భిల్లశేఖరా!"

ఈపద్యము భాగవతపద్యమువలె నున్నది. కృష్ణుడు సుఖముగా నుండెనా యని ధర్మరాజు అర్జును నడిగిన ఘట్టములోని పద్యమువలె నున్నది. "శ్రీనృపలోక జగద్గురుండు మా యప్ప ప్రతాపదేవుడు"—ఇందు రస ధ్వని వేయిమూర్తుల రూపుగట్టుచున్నది. హృదయము నుండి వచ్చిన భావ యనగా నిది. వట్టి యక్షరములుగా, మాటలుగా గనిపించునుగాని ప్రతాపుడుగా మూర్తికట్టిన పృథ్వీసింహుని స్వాతంత్ర్యాభిలాష యంతయు, ధర్మవీర రసమంతయు ఆమాటలలో నున్నది. ఇట్టి రచన మహాకవులే చేయగలరు.

అబ్దూరహిమాన్ వ్రాసిన యుత్తరము అతడు పృథ్వీసింహునితో చేసిన సంభాషణ. ఆయుత్తరమును

చదివితీరవలయును. ఉత్తరము వ్రాసినది అబ్దూరహిమాన్. అందులో కొన్ని భాగములు— "భరతఖండమ్ము నుద్ధరింపంగ జన్మించు ధూర్జటివి నీవు.", "భారతమహాఖండంబు దాస్యాంధకారనిమగ్నం బైయుండ", "ప్రతాపభాను డుదయంబైయుండె", "తనదు సేల్బడినంత హైందవమహత్త్వ మక్బరంతయు కొను దొడ్డ అడివి కాదు", "స్త్రీల పురుషుల రాజ్యంబు దేశమెల్ల, వినుచు నీయక్బరనుచు నీగొప్ప గెలువగాదు." ప్రతాపు డిట్టివాడు. ఇంక అక్బరు ఇట్టివాడు: "ఈవు విశ్వప్రపంచమం దీశ్వరుని యనంతలీలాగరులు కొనియాడె దెపుడు-నిలువగట్టుచు రాజ్యంబు గొనుచు నక్బరు." ప్రతాపుడు మరల యుద్ధమును ప్రారంభించెను. కొండలలో దాగి పొంచుచు, పైబడుచు, చీల్చుచు, కలచుచు విటతాటనము చేయుచు, గుటిలో దాటుచు నిట్టి యుద్ధము చేసెను (Guerilla warfare).

అయినను గెలువలేకపోయెను. ప్రతాపుని దారిద్ర్యమున కంతు లేకపోయెను. అక్బరు సర్వసంపదను కైవసమును చేసికొనగా "దరిద్రత్వంబు దిక్కేది—మహారాణా ప్రతాపావనీశ్వరులే సంసారము నాశ్రయించి నది." "అతిథిమంబుగ జెల్లురేగి నిబిడంబై మూగి యీ సర్వభారతదేశంబును ముంచివైచిన మహోగ్రంబైన దాస్యాంధకారతతిక్ దేవుని దృష్టిగూడ నణుమాత్రంబుక్ జొరక్ బోని దుస్థ్సితి సంధించెడు పాపికాల మణుచెంచెను."

చివరకు ప్రతాపుడు దేశమే వదలిపెట్టి పోదలచెను. భామాషాహి వచ్చెను. ధనమిచ్చెను. ప్రతాపుడు మరల సైన్యములు సమకూర్చెను. మరల తన రాజ్యమంతయు గెలుచుకొనెను.

అంతయు నైనదిగాని, ఓయి ప్రతాపా! శ్రీ నృపలోక సద్గురూ! మాయప్పా!

"అక్బరు విశ్వంభరాధీశమౌళిది
ధనసేవ నీయది దైవసేవ,
యాతని దెల్లప్పు దాత్మవైభవము నీ
యది నిరంతరము నాత్మావబోధ,
మతని నుండిన దెల్ల నైహికబలము ని
న్నాశ్రయించిన దెల్ల నాత్మబలము,
నతని దండము కన్న లలరించు భోగంబు
నీది జగము మెచ్చు నిండు త్యాగము
అతడు జగము గెలిచె; నాత్మ గెల్చితి వీవు
ఆత డితరజనుల నాశ్రయించు
నీవు స్వాశ్రయుడవు నీకు నాతని కెన
లేదు జనము క్రిందుమీదులైన."

ఇంక నొకమాట. ఈ రసప్రవాహములో ప్రవాహమువెంటనే పోయి విమర్శించితిని. వేరొకగతి లేదు. కాని ప్రవాహము నడుమను తీరమువెంట నంగుళ మంగుళము కల తామరపూలు, కలువపూలు, నీటిబెస్తరులు మొదలైన శోభలు పాఠకులే చూచుకొనుచు చదువుకొనవలయును. ఇది పరమోత్తమ గ్రంథములలో నొకటి.



# మండ తామ్రశాసనము: కొన్ని విశేషాలు

= శ్రీ వెంద్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి =

శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య గారు రాజరాజనరేంద్రుని మండతామ్రశాసనమును భారతి వృషభాను సం. శ్రావణమాస (1943 ఆగష్టు) సంచికలోఁ బ్రకటించియున్నారు. అది నాకత్యంతానందముఁ గలిగించుటచే నందుఁ గల కొన్ని యంశములఁ గూర్చి నాకు తోఁచిన విశేషములను వ్రాయుచున్నాను.

(1) గుద్దవాడివిషయ మేది? (2) మండగ్రామము మండపేట యగునా? (3) మండపేటకు సమీపమున సప్తగోదావరి యున్నదా? (4) సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజ అననేమి? అనువానిని గూర్చి నాయభిప్రాయముల నీ చిన్నవ్యాసములో తెలుపుచున్నాను.

(1) గుద్దవాడివిషయము నేఁటి ప్రాగ్గోదావరీ మండలములోని రామచంద్రపురము, కాకినాడతాలూకాల భాగమునకే చెందుచున్నది. కాని కృష్ణామండలములోని 'గుడివాడ' ప్రాంతమునఁ గల 'గుద్రాహార' విషయమునకుఁ జెల్లదు. నాకుఁ దెలిసినంతలో విష్ణుకుండినమాధవవర్మయొక్క 'పులిబూంరు' (పొలమూరు) శాసనము (క్రీ. శ. ౬౦౦ ప్రాంతము) మొదలు ముల్లవిష్ణువర్ధనునియొక్క 'ఎఱుబుపల్లి' (ఏరుపల్లి) శాసనమువఱకుఁ (క్రీ. శ. ౧౨౦౧) గల నడిమి యాఱువందల సం.లలోను పైని చెప్పఁబడిన ప్రదేశము 'గుద్దవాడి'విషయ మనియే పేర్కొనఁబడెను. జయసింహవల్లభుని (కుబ్జవిష్ణువర్ధనుని పుత్రుఁడు) పొలమూరు తామ్రశాసనము, రెండవ విజయాదిత్యుని కూరాడ తామ్రశాసనము, 'సౌతిండియన్ ఇన్‌స్క్రిప్షన్స్' ౪-వ వాల్యూమునందుఁ గల దాక్షారామశాసనములలోఁ జెక్కింటను పై ప్రదేశము 'గుద్దవాడి విషయము'గానే చెప్పఁబడెను. గుద్దవాడివిషయమున కుత్తరమునఁ గల పిఠాపుర ప్రాంతము 'కిమ్మూరు' సీమ యని రాజనరేంద్రుని నాఁడే యుండిన పావులూరి మల్లన తన గణితమున వ్రాసియున్నాఁడు. గుద్దవాడి విషయమునకుఁ బశ్చిమదిక్కునందలి పడమటి గోదావరీమండలమునఁ గల నరసాపురము, తణుకు మొదలగు ప్రాంతములకు 'అత్తిలి విషయము' అని చాళుక్య భీముని (౮౦౬ క్రీ. శ.) అత్తిలితామ్రశాసనమునఁ జెప్పఁబడెను. మఱియుఁ బ్రసిద్ధికెక్కిన 'నందంపూడి' శాసనమున అమలాపురముతాలూకాలోని యాగ్రామము రెండేఱుల నడిమివిషయముగాఁ బేర్కొనఁబడెను. ఆ శాసనము రాజనరేంద్రునిదే కదా. ఆలోచింపఁగా నాఁడు విషయములని చెప్పఁబడిన భూభాగములు నేఁడు రెండేసి మూఁడేసి తాలూకాల ప్రదేశములకు సమప్రదేశములుగాఁ గాన్పించుచున్నవి. కాని 'గుద్దవాడి' విషయ మొక గ్రామమునకు సంబంధించిన పేరుకలది కాదు. నేఁటి గోదావరి మండలమునకువలె నదికి సంబంధించినదే! ఆనది యేది? గోదావరియే. గుద్దవాడి శబ్దములోని గకారమునఁ గల ఉకారము, ఓకారము నొక్క స్థానముననే (ఓష్ఠమున) జనించుచును గాన 'గో' 'గు'గా వికృతిలో మారినది. 'డి' 'రి' గా మారుట కలదు. 'రడయోరభేదః' అని పెద్దలందురు. అందువల్ల 'ముకుర, నకుర' శబ్దములు 'ముకుడ, నకుడ' శబ్దములుగాఁ బాఠాంతరమునఁ జెప్పఁబడును. తద్భవమున వర్ణాగమ, వర్ణలోప, వర్ణవ్యత్యాసములచే గోదావరి 'గుద్దవాడి' యైనది. అయితే, ఇప్పటి గోదావరి సెంట్రల్ డెల్టా, వెస్టరన్ డెల్టాల నెందులకు 'గుద్దవాడి' విషయ మనలేదు? గోదావరియొక్క సప్తశాఖలలో తుల్య, ఆత్రేయి, భారద్వాజి, గౌతమి, వృద్ధ గౌతమి అను నైదుశాఖలును గుద్దవాడి విషయమునఁ బ్రవహించుచుండుటచేతనే నాఁ డట్టి పేరును వాడియుందురు. కావున సర్వవిధముల 'గుద్దవాడి' అను నది నేఁటి గోదావరినదియొక్క 'ఈస్టరన్ డెల్టా'కే చెందియున్నది.

(2) 'మండ' గ్రామము 'మండపేట' యనునది యగునా? శాసనములో దక్షిణపు పొలిమేర 'వల్లూరు' అనియు, ఉత్తరమున 'సప్తగోదావరి' యనియుఁ జెప్పఁబడెను. సప్తగోదావరి యనునది నేఁటి 'సంగమేశ్వర పుణ్యక్షేత్రమే'. ఇది మండపేటకు పశ్చిమోత్తర భాగమునం దొక మైలుదూరమునఁ గలదు. ఇది నాఁటి మండ గ్రామమున కుత్తరమున నుండియుండును. కారణ మేమనఁగా గ్రామములు ప్రాచీనకాలమం దుండురీతి నుండక యాయాకాలముల ననుసరించి నానాదిక్కులకు వ్యాపించుచుండును గదా!

(3) ఈ సంగమేశ్వరము గోదావరి యొక్క సప్తశాఖలలోను ముఖ్యమైనదని భీమేశ్వర పురాణాదికము చెప్పుచున్న 'తుల్యభాగ' శాఖయే. ఇంతమాత్రమే కాదు. ఇంచుమించుగ ఈ సంగమేశ్వరముకడనే బయలువెడలిన మురుగుకాలువ యొకటి (లేకి మురుగు కాలువ) 'కాదులూరు' గ్రామసమీపమున 'ఆత్రేయి' యను పేరితో ప్రవహించి సముద్రమును జేరుచున్నది. సంగమేశ్వరమునకు పశ్చిమమున మూఁడు మైళ్లదూరమున గౌతమీనది కలదు. అనఁగా నాఁడు సప్త గోదావరి యనఁబడిన సంగమేశ్వరమునకు మూఁడు గోదావరీ శాఖలు ప్రత్యక్షముగా సంబంధించియే యున్నవి. ప్రసిద్ధికెక్కిన ద్రాక్షారామములోని సప్తగోదావరికి నేవైపు చూచినను అయిదు మైళ్లలోపుగా నెచటను గోదావరిశాఖయే లేదు. ఐన నది సప్త గోదావరి యనఁబడుచున్నది. సంగమేశ్వర మట్లు కాక మూఁడు గోదావరీ శాఖలకు చేరి యుండుటచే నిదియే శాసనమందుఁ జేర్కొనఁబడిన సప్తగోదావరి యనఁదగును. మఱియు నీసంగమేశ్వరమును తుల్యానదీశాఖగానే యిప్పటికి డెబ్బదిసం. లకుఁ బూర్వమున స్వర్గస్థులైనట్టియు, ౧౯-వ శతాబ్దారంభమునఁ గల పేష్వా 3-వ బాజీరావు (పూనా), మార్తాండవర్మ మహారాజా (తిరువాన్కూరు), కృష్ణరాజా (మైసూరు) మొదలగువారికడ కేఁగి తమ విద్యాప్రభావముచే వేనవేలు సంపాదించినటువంటియు, ఆంధ్రదేశపు పండితులచేతనేకాక కాశీ, నవద్వీపము మొదలగు స్థలములలోఁ గల మహాపండితులచేతను ప్రశంసింపఁబడి నట్టియు మండపేటనివాసులైన మహాపండితుఁడగు బ్ర. శ్రీ ఎడవిల్లి శ్రీరామశాస్త్రిగారు ఈసంగమేశ్వరమును తుల్యభాగముగానే చెప్పుచు పెక్కు పద్యములను రచించియున్నారు. తుల్యభాగకు 'షడ్భి స్తుల్యా తుల్యా' (ఆరు గోదావరిశాఖలతో సమానమైనది తుల్యభాగ) అను నానుడికూడ కలదు. ఈతుల్యభాగను గూర్చి సంస్కృతభాషయందు గౌతమీమాహాత్మ్యము, భీమేశ్వరపురాణము అను స్కాందపురాణ భాగములలోను, ఆంధ్రమున శ్రీనాథమహాకవి భీమఖండమునను, వెణుదుంబరి వేంకటాద్రి కవి తన కిరాతార్జునీయకావ్యమునను, నందూరి విశ్వపతికవి యాంధ్రీకృత గౌతమీ మాహాత్మ్యమునను మిగుల వర్ణించియున్నారు. ఇంతమాత్రమే కాదు. క్రీ. శ. ౧౫౫౫—౧౬౦౭ వఱకు పెద్దాపుర సంస్థానమును పాలించిన చతుర్భుజ తిమ్మజగపతి మహారాజుగారిచేఁ బోషింపఁబడు ఏనుగు పెదలక్ష్మణకవి (భర్తృహరిసుభాషితములు వ్రాసిన లక్ష్మణకవితాత) 'తుల్యామాహాత్మ్యము' అను నాలాశ్వాసముల గ్రంథమును రచించియున్నాఁడు. ఇంచుమించుగ నిరువది మైళ్లలోపు గల యీతుల్యానదీతీరమందు సంగమేశ్వరము, వీరభద్రక్షేత్రమగు 'పైన' గ్రామము, నరసింహక్షేత్రమగు పుట్టకొండగ్రామము, క్షణముక్తీశ్వరక్షేత్రము, 'చొల్లంగి' అను పుణ్యతీర్థములు గలవు. ఈ చొల్లంగియందే కాకినాడలోఁ బ్రసిద్ధినొందిన 'మల్లాదిసత్తిలింగం నాయకర్ ఛారిటీసు వారు' లక్షరూప్యములు వ్యయపఱచి దేవాలయాదులను నిర్మించియున్నారు. కాన తుల్యభాగను సప్తగోదావరి యనుటలో నాశ్చర్యము లేదు. పుణ్యకాలములలో వేనవేలు జను లిప్పుడును నీతుల్యభాగలో స్నానమాచరించుచుందురు.

(4) రాజనరేంద్రునివలన దానమునొందిన అంకయ్య 'సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజు' అను బిరుదము కలవాఁడు. దీనికి వేఱువిధమగు నర్థమును శ్రీ డా. వేంకటరమణయ్యగారు రూహించియున్నారు. నాయభిప్రాయమేమనఁగా, సమస్తభువనములకు నాశ్రయమైన, లేక ఆధారమైన వేదములకు మహారాజు. అనఁగా వేదములకుఁ బ్రభువు. వేదము

లన్నియు వచ్చు ననుట. భువనములు వేదములవల్ల నిర్మింపఁబడెనని విద్యారణ్య మహాభాష్యమున నిట్లు కలదు:

" యస్య నిశ్వసితం వేదాః
యో వేదేభ్యోఽఖిలం జగత్
నిర్మమే తమహం వందే
విద్యాతీర్థ మహేశ్వరం."

తా. ఏపరమేశ్వరుని నిట్టూర్పులు వేదములో, ఏదేవుఁడు వేదములవల్లనే సమస్తజగత్తును నిర్మించెనో ఆ పరమేశ్వరునికి నమస్కరించుచున్నాను.

కాన సమస్త భువనములకు నాశ్రయమైనవి వేదములు. అట్టి వేదములకు మహారాజైనవాఁడని యర్థము. ఈ బిరుదము కవిరాజు, కవిబ్రహ్మ, పండితరాజు, కవిసార్వభౌముఁడు, పండితసార్వభౌముఁడు మొదలగు బిరుదములవంటిది.

నన్నయ చెప్పిన భారతపద్యములోని " సమస్తభువనాశ్రయ ధర్మధురంధరా! " అను వాక్య మేక సమాసముగాని వ్యస్తము కాదు. అపుడు సమస్తభువనములకు నాధారమగు ధర్మమును వహించినవాఁడని యర్థ మగును.

కల్యాణిచాళుక్యులు క్రీ. శ. ౬, ౭ శతాబ్దములలో ప్రాగాంధ్రముఁ బాలించిన 'విష్ణుకుండిన మాధవ వర్మ' యు, నాకాలముననే 'మధురాపురి' నేలుచున్న 'సుందరపాండ్యుఁడు'ను వహించిన 'జనాశ్రయ' అను బిరుదమునకు ప్రతిగా 'సమస్తభువనాశ్రయ' బిరుదమును వహించినట్లు కాన్పించును. కాని రాజనరేంద్రుని నన్నయ యుద్బోధించిన 'సమస్తభువనాశ్రయ' యనునది 'ధర్మ'శబ్దమునకు విశేషణమే కాని బిరుదు కాదని నా తలంపు.

విజ్ఞప్తి

నేను గుద్దవాడి శబ్దముఁ గూర్చి నాకృత మగు 'రామోపాఖ్యానము—తద్విమర్శనము' అను గ్రంథమున విమర్శించి యా ప్రదేశ మెట్లు శ్రీనాథుని కాలమున 'భీమఖండ' మైనదో సూచించితిని. నేను 'గుద్దవాడి' అను విషయములో జన్మించుటచేతను, 'తుల్యా' నదీతీరమున మత్పితృ పితామహులు నివసించువా రగుటచేతను, మాతృ మాతామహులు మండపేటలో జన్మించినవారగుటచేతను నాకా ప్రదేశాలు సుపరిచితములు. కాన గొప్ప పరిశోధకు లగు శ్రీ డా. వేంకటరమణయ్యగారి వ్యాసములోని కొన్ని యంశముల నిట్లు విమర్శింపఁగల్గితిని.

---



దగ్గు
ఉబ్బసము
ఆయాసముమరియు
సకలమైనశ్వాసకోశవ్యాధుల
మీాదను




అమోఘముగా
పనిచేయును

# కాశ్మీర్

అన్నిచోట్లదొరకును

క్షీరసముద్రం ఫార్మసీ, రాజమండ్రి.

టి. సి. యస్. గోల్డెన్ మెటల్

## సినిలోలకులు




జత 1 కి రు. 3/-

12 జతలవరకు వి. పి. చార్జి 10 అ.

టి. సి. నాగలింగప్ప అండ్ కంపెనీ,

280, వాల్ టాక్సురోడ్డు, పార్కు టౌన్, మద్రాస్.

ఏజంట్లు:—

శ్రీ కె. యస్. తిమ్మప్ప శెట్టిగారు,

గోపువారి బిల్డింగ్సు, బెజవాడ.

స్త్రీలకు కుసుమవ్యాధి, ఋతుసంబంధమైనజబ్బులు, వంధ్యత్వము, గర్భస్రావము, గర్భాశయసంబంధమయిన వ్యాధులు

## సుందరి సంజీవని

(ఏనుగ మార్కు)

వాడినచో అమోఘముగా కుదుర్చబడును.

వెల:—సీసా 1-కి రూ. 1-2-0.

## మకరధ్వజవటీ

(బంగారు మిళితమైనది)

ఇంద్రియస్ఖలనము, స్వప్నస్ఖలనము, పుంస్త్వహీనత, నరములబలహీనతకు శ్రేష్టమైనదిగా నిరూపింపబడినది.

వెల:—30 మాత్రల సీసా 1-కి రూ. 4

# UNJAH PHARMACY,

# ఉంఝా ఫార్మసీ

గాంధీరోడ్, అహమ్మదాబాదు, బొంబాయి 2, పూనా సిటీ, ఉంఝా.

ఏజంట్లు:— వెంకటేశ అండ్ కో., ట్రంకురోడ్, నెల్లూరు.

షరా:— అన్నిచోట్ల ఏజంట్లు కావలెను. కోరువారికి ధరలజాబితా ఉచితము.

# గీతా సప్తశతి : దేవీ సప్తశతి

= శ్రీ పూర్ణానంద =

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ.



సర్వకామాన్ సమాశ్రిత్య
మామేకాం సతతం స్మర.

మహాభారతాంతర్గతమైన శ్రీమద్భగవద్గీతలకూ, మార్కండేయ పురాణాంతర్గతమైన దేవీ మాహాత్మ్యానికీ లోకంలో ఉన్న ప్రసిద్ధి అనల్పం. ఆధ్యాత్మిక సాధకులకు ఈ గ్రంథాలు రెండూ కూడా ప్రాణపదాలు. ఈ పుస్తకాల్లోని ఛందోమాధుర్యం సాధక హృదయాలను భూమవస్తువునై పుకు ఆకర్షించుకు పోతుంది. ఈ రెండూకూడా ౭౦౦ ల శ్లోకాలతో పరిసమాప్తి చెయ్యబడ్డాయి. ప్రతి శ్లోకమూ మంత్రంగా పరిగణింపబడుతోంది. వేలకువేలుగా జనులు ఈ గ్రంథాలను కొన్ని వందల ఏండ్లనుండీ ప్రత్యహమూ పారాయణ చేస్తూ, భక్తిపులకిత చిత్తులవుతున్నారు. గీత కున్నన్ని సంస్కృత వ్యాఖ్యలు దేవీ మాహాత్మ్యానికి కూడా ఉన్నాయి.

గీతలు ఉపదేశించేది— ఈ విశ్వంలో ఉన్న అనశ్వరవస్తువుల నన్నిటినీ ఈశ్వర వస్తువుద్వారా ఆవృతం చెయ్యి; విషయవాంఛల కన్నిటికీ బ్రహ్మముతో సంయోగం కల్పించి భోగించు; అరూపంవల్ల రూపాన్ని అధిగత మొనర్చుకో; అశబ్దంవల్ల శబ్దాన్ని అతిక్రమించు; అగంధంద్వారా గంధాన్ని అంగీకరించు; అరసం ద్వారా రసాన్ని నిక్షించు; అస్పర్శవల్ల స్పర్శను ముగ్ధం చెయ్యి:

దేవీమాహాత్మ్యం ప్రబోధించేది — బహురూపధారిణి అయిన ఈ వసుంధరాదేవి గర్భంలో ఉన్న ప్రతి వస్తువులోనూ ఈశ్వరరూపాన్ని చిత్రించి వికసింపచెయ్యి; బ్రహ్మవస్తువునే విషయవాంఛలతో కలిపి భోగించు; రూపంద్వారా అరూపాన్ని గ్రహించు; శబ్దంవల్ల అశబ్దాన్ని ప్రబోధించు; గంధం ద్వారా అగంధాన్ని పుష్పిత మొనర్చుకో; రసం ద్వారా అరసాన్ని హృదయంగమ మొనర్చుకో; స్పర్శ ద్వారా అస్పర్శను అంతరాత్మగా పరిగణింపజేసుకో.

గీతల్లో ఎట్టి 'మతవాదమూ' లేదు. ఈ తథ్యానికి దేవీమాహాత్మ్యము 'ప్రతివాదం' కాదు. స్వప్రతిష్ఠితమూ, స్వతస్సిద్ధమూ అయిన ఒకే సత్యాన్ని లక్షించే ఈ రెండు గ్రంథాలూ ఉద్గీతమయ్యాయి. వస్తువు ఒకటే. కాని, అన్వేషణవిధానం వేరు. ఒకే పదాన్ని రెండు రాగాలతో పాడినట్లు. వినడానికి రెండూ వేరు వేరు పాట లనిపిస్తాయి.

గీత 'విశ్వస్య పరం నిధానం' (౧౧-౩౮) అని ఏవస్తువును నిర్దేశించిందో, ఆవస్తువునే స్మరిస్తూ దేవీ మాహాత్మ్యము 'ఆధారభూతా జగత స్త్వమేకా' (౧౧-౪) అని వచిస్తోంది. గీత చెప్పటూంట, ఈవస్తువు జగత్తుకు ఆశ్రయమే కాకుండా 'సర్వభూతానాం బీజం' (౭-౧౦) అని. ఈవస్తువే దేవీమాహాత్మ్యభావంలో 'విశ్వస్య బీజం' (౧౧-౫). గీతలో 'అనంతవీర్యామితవిక్రమ స్త్వం' (౧౧-౪౦) అనే వర్ణనయొక్కా, దేవీమాహాత్మ్యములో 'అలంఘ్యవీర్యే' (౧౧-౪), 'అనంతవీర్యా' (౧౧-౫) అనే వర్ణనలయొక్కా తాత్పర్యం ఒక్కటే. ఈ తేజస్సే, ఈశక్తే ఈ రెండు గ్రంథాలకూ సంగమస్థానం.

పంచేంద్రియాలతో అనుభవింపబడుతూ, భావింపబడుతూ, గ్రహింపబడుతూ, త్యజింపబడుతూఉండే విషయాలకు అతీతంగా ఏదోఒక విచిత్రమైన వస్తువు ఒకటి ఉంది అనీన్నీ, దాన్ని మనము చూడకపోయినా, అర్థంచేసుకోకపోయినా అది 'వాస్తవమాత్రమైన శక్తి అనీన్నీ మనకు అప్పుడప్పుడు స్వాప్నిక ఛ్ఛాయాసమంగా తోస్తూఉంటుంది. ఆదేమిటో సరిగ్గా

తెలియకపోయినా 'లేదు' అని రూఢిగా చెప్పటానికి నోరాడదు. అది ఇంద్రియాతీతమైన పదార్థం అయినప్పటికీ ఇంద్రియగోచరాలు అయే వస్తువు లన్నిటికీ ప్రాణం ధారపోస్తోంది; వాటినన్నిటినీ ఆవరించుకొని ఉంది. కాబట్టే, మనుష్యునికి ఆతత్త్వవస్తువు అంటే ప్రీతి. తెలీకుండానే మనస్సు అవైపుకు పరిగెత్తుకోపోతుంది.

ఈ అతీంద్రియశక్తియొక్క స్వరూపరహస్యాన్ని బట్టబయలుచేద్దామనే ఉద్దేశ్యంతోటే, జిజ్ఞాసువులైన సాధకులూ, తత్త్వాన్వేషులైన ఆచార్యగణమూ తమ గవేషణఫలాన్ని వెలువరించారు. గ్రహణసామర్థ్యాన్నిబట్టీ, భూమికాప్రభేదాన్ని అనుసరించీ, దృష్టిప్రసార తారతమ్యంచేతా ఒకే వస్తువు బహువిధంగా తట్టింది. ద్వైతం, విశిష్టాద్వైతం, అద్వైతం, అనిర్వచనీయవాదం, అజాతవాదం, అవతారవాదం, పరిణామవాదం మొదలైన అసంఖ్య వాదాలు పుట్టుకోవచ్చాయి. అత్యంతనిశితమైన యుక్తితర్కాలను ఆశ్రయించుకొని ఈ వాదాలు సృష్టమైనా, ఆమహాశక్తి స్వరూపరహస్యం అట్లాగే ఉండిపోయింది. అది మరింతగా రహస్యగర్భంలో దాక్కొంది. అయితే కలిగిన లాభంమటుకు ఇది: దుర్జ్ఞేయమైన ఈశక్తియొక్క అస్తిత్వము మనుష్యహృదయంలో మరింత దృఢంగా పాతుకోపోయింది.

ఈశక్తి జడశక్తి కాదు. అంటే దీన్ని ప్రకాశింపజేయటానికిగాని, కార్యాభిముఖీనం చెయ్యటానికిగాని ఇతరంతో ప్రయోజనం లేదు; బాహ్యవస్తువులతో అగత్యం అంతకంటే లేదు. ఇది చిచ్ఛక్తి. ఇది స్వయంప్రకాశమై, స్వేచ్ఛాక్రమంగా కార్యాలను నిర్వహించుకోగలదు. ఈశక్తి సంపూర్ణంగా స్వస్థమై, కార్యకారి కానప్పుడు అవ్యక్త మనిన్నీ, నిర్గుణ మనిన్నీ సంజ్ఞ. కొంచెం చలించి, కార్యోన్ముఖమైనప్పుడు వ్యక్తం అనిన్నీ, సగుణ మనిన్నీ పేరు సంపాదించుకొంటుంది. సమాధిఅవస్థలో శక్తి కారణం మాత్రమే; జాగ్రదవస్థలో శక్తి కారణమూ, కార్యమూ కూడాను. మనుష్యుడి వ్యావహారికబుద్ధి ననుసరించి, ద్వైతదృష్టి నవలంబించి శక్తియొక్క అవ్యక్తస్థితిలో చిద్రూపతే ముఖ్యంగా వర్ణింపబడుతోంది; వ్యక్తస్థితిలో దాని సామర్థ్యభావమే ప్రధానంగా వివరింపబడుతోంది. వాస్తవానికి ముఖ్యగౌణా లనే ప్రశ్నే లేదు. శక్తి శక్తే. సముద్రం తరంగరూపేణ పరిణమించినా సముద్రమే, నిలకడగా ఉన్నా సముద్రమే.

అప్రమేయమైన ఈ అనంత చిచ్ఛక్తినే మనము ఈశ్వరుడనో ఈశ్వరి అనో, లేక భగవంతుడనో లేక భగవతి అనో అంటూంట. ఇదే గీతలోని పురుషోత్తమ తత్వము; దేవీ మాహాత్మ్యములోని మహామాయ.

కాని పురుషోత్తము డనే నామాన్నీ, మహామాయ అనే పేరునూ ఒకేతడవ ఉచ్చరించినా సంస్కారాన్ని బట్టి ఒకరు పురుషుడు, మరొకరు స్త్రీఅని భావిస్తాము. కాని, ఇది కుదరని విషయం. 'అనంతం' అనే విశేషణం కొద్దిగా పర్యాలోచింపదగివున్నది. 'అనంతం' అయినది ఏదో ఒక్కటే ఉంటుందికాని రెండు ఉండవు. ద్వితీయంకనక ఉంటే మొదటిదాని అనంతత్వం బాధితమౌతుంది; అది సనేమిరా అనంతం కాదు. కనక, అనంతం అనిపించుకోతగింది అద్వితీయము, అనగా ఏకాత్మకమే అవుతుంది. గీతలో చాలాచోట్ల పరమపురుషుడి ఏకత్వం ప్రగీతమైంది. దేవీమాహాత్మ్యములో దీని ప్రతిధ్వని 'ఏకైవాహం జగత్యత్ర కా మమాపరా' (౧౦-౫) అని వినపడుతోంది. ఈజగత్తులో ఉన్నది ఒక్కటే నేనే; ద్వితీయమైన అన్యవస్తువు లేదు. దేవీమాహాత్మ్యములో ప్రయోగింపబడిన 'అపారా, అసంగా, అవ్యక్తా, చితిరూపేణ సంస్థితా' మొదలైన విశేషణాలను చక్కగా మననంచేసుకోవాలి. గీతలోని పరమదేవత, దేవీమాహాత్మ్యములోని పరదేవత అభిన్నులు. పేర్లు రెండూ వేరైనా ఆ 'ఏకమేవాద్వితీయం అనంత మపారం' ఈ రెండు గ్రంథాలకూ ఆత్మ.

గీతలోని పరమపురుషుడు అర్జునుడికి చెప్పింది: 'పితామహస్య జగతో మాతా ధాతా పితామహః' (౯-౧౭) అని. దేవీమాహాత్మ్యములోని పరదేవత (లేక పరమపురుషుడే అందాం. ఏమంటే, పురుషశబ్దం పువర్థపరం కాదు; విశ్వములోని అభావాన్ని తొలగించేది, లేక దేహవాసి, లేక పరిపాలకర్త అని.) ను

ఉద్దేశించి 'బ్రహ్మేశ్వం దేవీ జననీ పరా' అన్నాడు. ఇంకోచోట 'యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా' (౫-౭౧,౭౩) అని ఉన్నది. 'అనంతవీర్యా' అనే విశేషణంలో పితృత్వం సూచితమై, 'విశ్వస్య బీజం' అనేచోట స్రష్టృత్వం అయింది. ఈ పరమ దేవత బీజమూ, ఆధానమూ రెండూకూడా తానే. 'జగతో మాతా పితా' అనే విషయాన్నే ఈ రెండు గ్రంథాలూ చెప్తున్నాయి. మహావస్తువులను వ్యవహారంలో ఇష్టం వచ్చినట్టు వాడతాము. సింధునదాన్ని సింధునది అనిన్నీ అంటాం, దేశమాతను పితృభూమి అనికూడా వ్యవహరిస్తాం. రెండు పేర్లు; వస్తువు ఒకటే. ధాత-ధాత్రి; స్రష్ట-స్రష్ట్రి; జనయిత-జనయిత్రి —వీటిలో భేదం ఏమీ లేదు.

వాస్తవంగానే లేదా? లేకేం, కొంచెం ఉంది. ఈ భేదం వస్తువిషయం కాకపోయినా మనస్సు భావించే రీతినిబట్టీ, వ్యవహారాన్ని అనుసరించీ కొంచెంగా ఉంది. స్రష్ట ననుసరించి కాకపోయినా, సృష్టి ననుసరించి; రసవిషయంలో కాకపోయినా రసబోధ ననుసరించి. శాసనదీప్తమైన పితృప్రేమా, ప్రేమసిక్తమైన మాతృశాసనమూ సంతానం యొక్క హృదయంలో పితృమాతృసంబంధమైన ఒక ప్రభేదాన్ని కల్పిస్తున్నాయి. పితృప్రేమయొక్క పరిమాణం స్వల్పం అనిన్నీ, అది తీవ్రకఠోరం అనిన్నీ, తల్లియొక్క వాత్సల్య ప్రేమ పరిమాణరహిత మనిన్నీ, మధురకోమలం అనిన్నీ అనిపిస్తుంది. ఈ అనుభూతితారతమ్యంవల్లే బిడ్డలకు తండ్రిలోకంటె తల్లిలోనే మాధుర్యం ఎక్కువగా తోస్తుంది. కాని, తల్లియొక్క మాధుర్యంకంటె తండ్రియొక్క కాఠిన్యమే ఎక్కువగా రుచించే సంతానం లేకపోలేదు.

గీత త్యాగగానం. ఆలాపింపబడ్డ రాగంపేరు పౌరుషం. గీతాప్రతిపాద్యమైన దేవత తన సృష్టిని తానే ఖండవిఖండితం చేసి, సదసత్తులు, నిత్యానిత్యాలు, క్షరాక్షరాలు, జడచేతనాలు, దేహము - దేహీ ఇత్యాదిరూపంగా విభజించింది. రూపరసాదులద్వారా ఉపలబ్ధమయ్యే విషయవస్తువులూ, వాటిమీద ఉండే అభిలాషా దుఃఖానికి కారణం అని నిర్దేశించింది.

భగవంతుడు చెప్పింది: ఈవస్తుసముదాయమంతా క్షణభంగురం; మృత్యువుయొక్క క్రీడాపుత్తలికలు. ఈనిముషంలో ఉన్నవి మరునిముషంలో లేవు. నీ ఇంద్రియాలకు వీటివల్ల కొంచెం సుఖం లభించొచ్చు. కాని ఈవస్తువులు వినాశమైనప్పుడు, ఈవస్తువియోగం తటస్థమైనప్పుడు నీకు దుఃఖం కలక్కమానదు. ఇంద్రియగ్రాహ్యములూ,మర్త్యములూ అయిన ఈవిషయాలన్నిటినీ పరిత్యజించు. వీటిమీదఉండే మోహాన్ని విడిచి నీ అంతరాత్మయొక్క తోడుగుడు చీల్చిపారెయ్యి.

శ్రీకృష్ణుడు బోధించింది:—ఈ త్యాగంవల్ల నీ ఇంద్రియాలకు అందని రూపం, నీ చెవులకు వినబడని శబ్దం, నీకు అనాఘ్రాతంగా ఉండిపోయిన గంధం, నీరుచికి అందని రసం, నీ.అనుభవానికి అతీతంగా ఉండిపోయిన స్పర్శ—రూపరసాల మూర్తి, శబ్దస్పర్శలకు ఆధారమైంది, ఆడంబరపూర్ణమైన భాషలో 'అస్పర్శం అరూపం' అని చెప్పబడే వస్తువు నీకు దొరక్కపోదు.

చాలా కష్టమైన విషయం. కాని సత్యం.

మహామాయ అంటోంది:—అత్యంత ధీరపురుషుడైనవాడికే ఇది సాధ్యం. తక్కినవాళ్లకు ఇది అసంభవం. ఇంకోదారి ఉంది, వర్జింపకపోయినా ఫరవాలేదు.

అభయ అంటోంది:—భయపడతావేం? రూపభాసితమూ, రసహాసితమూ అయిన ఈ జగత్తు, గంధమోదితమూ, శబ్దకూజితమూ అయిన ఈలోకం, ఈవస్తుసమూహం నావల్లే సృష్టింపబడ్డాయి. నా ఆనందవృత్తే ఈ సృష్టిధార. సృష్టిని రక్షించటమే నాలీలావిలాసం. నా సృష్టిప్రవాహం ఆగిపోకుండా ఉండటానికే నిన్నీ సంసార శృంఖలాలతో బంధింపజేయ గోరుతూఉంట. 'సంసారబంధ హేతుశ్చ' (౧-౫౭). నిన్ను బలవంతంగానే మోహింపజేస్తున్నాను. నీవు ఇష్టపడకపోయినా 'బలా దాకృష్య మోహాయ' (౧-౫౫) ప్రవర్తింపజేస్తున్నాను. నీ కిది తప్పదు.

పురుషోత్తముడు అంటూంట: 'దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా' (౭-౧౪),

'నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్' (౧౪-౫), 'ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి' (౧౮-౫౯), 'అనిచ్ఛన్నపి బలాదివ నియోజితః' (౩-౩౬) అనే అర్జునవాక్యంలో 'నీ కిది తప్పదు' అనే మాటే ధ్వనిస్తోంది.

జగజ్జనని బోధిస్తోంది: ఈ వస్తుసంగ్రహం, ఈ నిర్మాణకౌశలం అంతాకూడా నీ కామనాసిద్ధికోసమే. నీవు నాబిడ్డవు. నీవు కాకపోతే మరి అనుభవించేది ఎవరు? అయితే, ప్రతివస్తువులోనూ నేను ఉన్నా ననే మాట మరిచిపోకు. నీ ఆహారవిహారాల్లో, నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో, నీ భాగ్యభోగాల్లో నా అమృతత్వాన్నే అవలోకించు. ఏవస్తువును భోగించినా నన్నే స్మరించు. లేకపోతే ఈ భోగం నీకాళం పడుతుంది.

సర్వమంగళ లాలిస్తోంది: ఆపదలు వస్తే నన్ను స్మరించుకో. నన్ను శరణు అను. దుర్గతి తొలగిపోతుంది. ఈ స్మరణా, ఈ శరణూ దుఃఖాన్ని పోగొట్టి ఆనందాన్ని కలుగజేస్తాయి అనేమాట మరిచిపోకు.

గీతలో చెప్పినదాన్నే ఇది కొంచెం మార్చి చెప్పటంకాక మరేమీ కాదే! ఒకటి బొమ్మలు లేని బాలశిక్ష; మరొకటి బొమ్మలతో ఉన్న బాలశిక్ష. చిత్రవిచిత్రాలయిన బొమ్మలూ, పాటలూ ఉన్న పుస్తకాన్ని కుఱ్ఱాడు కులాసాగా చదువుకుపోతాడు. చదవడంలో ఉండే కష్టం తెలియకుండానే చదువు అయిపోతుంది. బొమ్మల్లేని పుస్తకం కుఱ్ఱాడికి కొంచెం గడ్డుగా ఉంటుంది. మోటువైద్యుడు చేసే నాటువైద్యం, ఆరితేరిన డాక్టరు ఇచ్చే చేదుమందును కప్పిన పంచదార బిళ్ళా, అనుపానభేదం ఉన్నా, ఇచ్చే ఫలితం ఒక్కటే. గీత బొమ్మల్లేని బాలశిక్ష, చేదుమందు; దేవీమాహాత్మ్యము బొమ్మలున్న పుస్తకం, చేదుమందును దాచుకున్న పంచదారకుప్పె. గీతలోని తత్త్వబోధ దర్శనశాస్త్రంయొక్క కటుమటలతో నిండిఉంది. దేవీమాహాత్మ్యములోని భగవతీలీల చక్కటి కథలతో రసపూరమై నిండి తొణికిసలాడుతోంది. గీత మనలను బుద్ధిని ఆధారంగా చేసుకొనే జ్ఞానపథానికి మళ్లిస్తోంది; దేవీమాహాత్మ్యము భావాన్ని లేపి భక్తిమార్గానికి మనసుతిప్పుతోంది. అయితే గీతలో భక్తివిషయమూ, దేవీమాహాత్మ్యములో జ్ఞానవిషయమూ లేకపోలేదు.

జగజ్జననిని సర్వకార్యాల్లో సతతమూ స్మరించుకోటం అంటే మనస్సును గొప్పగా ఉండేటట్లూ, సంకుచితబుద్ధి వదలిపోయేటట్లూ చేసుకోటం అన్నమాట. మన స్మరణవస్తువుతో మన మనస్సుకో సంబంధమాత్రం చేకూరుతుంది. మనం అమ్మకు తగిన బిడ్డలంగా వ్యవహరించాల్సి వస్తుంది. అమ్మ గౌరవానికి తగినట్టుగానే మన వ్యవహారమూ ఉండాలి. రాచపుట్టుకలో ఆభిజాత్యచ్ఛాయలే దీపిల్లాలి కాని, దైన్యానికీ, హీనత్వానికీ చోటు ఉండకూడదు. ఆజగదంబను నిరంతరం స్మరిస్తూ ఉండటంవల్ల, నేను జగద్ధాత్రిబిడ్డను అనే గర్వం భక్తిశ్రద్ధలుగా రూపు పొందుతుంది. విశ్వేశ్వరిసంతానానికి ఎట్టిలోటూ ఉండకూడదు అనే విషయం సర్వేశ్వరి బిడ్డకు తెలుసు. చిన్నచూపు అప్రతిష్ఠాదాయకం. బృహత్తరవస్తువులనే ఆకాంక్షించాలి. కనక క్షుద్రవస్తువులు, పార్థివాలైన రూపరసగంధాలు వాటంతట అవే రాలిపోతాయి. మాతృనిష్ఠలో అనికేతుడైన బిడ్డ గీతలోని అనికేతుడవుతాడు. అతడు కోరేది మరేమీ ఉండదు, ఒక్క అమ్మతప్ప.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' (౧౮-౬౬) అనే గీతోపదేశాన్ని దేవీమాహాత్మ్యానికి సరిపోయే భాషలో మార్చి చెప్పాలి అంటే 'సర్వకామాన్ సమాశ్రిత్య మామేకాం సతతం స్మర' అని చెప్పాల్సి వస్తుంది.

హఠాత్తుగా వింటే ఇవి పరస్పరవిరుద్ధాలైన సిద్ధాంతాలేమో అని అనిపిస్తాయి. ఒకటి త్యాగాన్నీ, మరొకటి భోగాన్నీ ఉపదేశిస్తున్నాయిగా మరి? కాని ఇవి చెప్పే ముఖ్యోపదేశం శరణమూ, స్మరణమున్నూ. త్యాగభోగాలు అవాంతర ప్రసక్తిగానే ఉండిపోతాయి. ఏమంటే, శరణస్మరణాల్లో ఏకాంతికత్వం కుదిరినప్పుడు త్యాగభోగాలను ప్రత్యేకించి చూపే సీమారేఖ మాయమైపోతుంది. త్యాగభోగాలు ఏకమైపోతాయి. కనక, ఈ రెండు సిద్ధాంతాలకూ ఎట్టి భేదమూ లేదు, ప్రకృతిగతంగా.

ప్రకృతిలో భేదం లేకపోయినా ఆకృతిలో ఉండే భేదాన్ని మనము మరచిపోలేకుండా ఉన్నాము. ఏమంటే, గీత నిశ్శ్రేయసానికి సంబంధించిన గ్రంథం; దేవీమాహాత్మ్యము అభ్యుదయానికి సంబంధించిన శాస్త్రం. అయితేనేం, గీతలో అభ్యుదయవిషయప్రస్తావనా ఉంది, దేవీమాహాత్మ్యములో నిశ్శ్రేయసప్రసంగమూ ఉంది.

గీతలో చిత్రింపబడిన అభ్యుదయం సామాన్యంగా మన దృష్టికి కనిపించదు; దృష్టిని తప్పించుకోపోతుంది. అసలు అందులో చిత్రితమైన త్యాగధర్మాన్ని చూసే చిత్తం తల్లడిల్లిపోతుంది. అది దేనిమీద చిత్రింపబడిందో అది మనం చూడము. కథ ఏమిటి? యుద్ధం ఆరంభింపబడబోతోంది. అర్జునుడికి హఠాత్తుగా అహింసా వ్యాధి అంకురించింది. వాసుదేవుడు వైద్యుడై ఆ రోగాన్ని పోగొట్టి హింసా ధర్మాన్ని అవలంబింపజేశాడు. ఔషధం త్యాగమంత్రం. కాని, అర్జునుడు త్యాగంచేసి అన్నిటినీ విసర్జించి వెళ్లిపోలేదు. హృషీకేశుడు ముఖ్యంగా అర్జునుడి చెవి కెక్కించింది 'హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్' (౨-౩౭) అనే. చివరకు అర్జునుడు దాన్నే ఒప్పుకొన్నాడు. 'కరిష్యే వచనం తవ' (౧౮-౭౩) అన్నాడు. అంటే, గీత త్యాగమంత్రమైనా భోగానికి కూడా స్థానం ఇస్తోంది అన్నమాట. ఈ భోగము యొక్క స్వరూపాన్ని గురించి అభిప్రాయభేదం ఉండొచ్చు. అది వేఱే సంగతి. ఇట్లా భోగానికి స్థానాన్ని కల్పించటానికి కారణం ఏమంటే, ఉన్నవాడే త్యాగం చెయ్యగలడు. లేనివాడి విషయంలో త్యాగం అనే ప్రశ్నే రాదు. ఏదైనా ఒక వస్తువును త్యజించేముందు దాన్ని ఆర్జించిఉండాలి. గీతలోని వర్జన ఆర్జనమునుండి తప్పించుకోటానికి వేసే ఎత్తు కాదు. భోగాన్ని నియంత్రిత మొనర్చి విధి విహితమైన పథాన్ని అవలంబించమనే కఠోరశాసనమే అది.

దేవీమాహాత్మ్యములోని 'భోగం' కూడా ఇట్లాంటిదే. భోగాన్ని నియమితసీమల్లో ఉంచి, విధ్యుక్తం చెయ్యటంకోసమే మాతృభక్తిని ప్రబోధించి ఆస్తిక్యబుద్ధిని వికసింపచెయ్యటం. దేవీమాహాత్మ్యము 'భుంజీథా, మాగృధః కస్యస్విద్ ధనమ్'*—భోగించు, ఇతరులకు చెందినదాన్ని ఆశింపకు అని చెప్తున్నట్టుగా తోస్తుంది. గీతఅభిప్రాయం 'త్యక్తేన భుంజీథా, మాగృధః కస్యస్విద్ ధనమ్'*—మమత్వాన్నీ, ఆసక్తినీ త్యజించి భోగించు అని అనిపిస్తుంది. ఇట్లా చెయ్యమనటానికి కారణం ఏమిటీ అని పృచ్ఛిస్తే రెండు గ్రంథాలూ ఐక్యకంఠంతో 'ఈశావాస్య మిదం సర్వం యత్ కించ జగత్యాం జగత్'* అని ప్రత్యుత్తరిస్తున్నట్లు కనపడుతుంది. ఈజగత్తులో ఉన్నదంతా భగవంతునిద్వారా పరివ్యాప్తమైఉంది. అంటే ఆ ఒక్క ఈశ్వర వస్తువే అన్నిట్లోనూ ఉంది, అన్నింటికీ ఆయనే అధిపతి, అన్నీ ఆయనవే కనక నీవు మమత్వాన్నీ, ఆసక్తినీ త్యజించి కర్మాచరణంలోకి దిగు. ఇదే భారతీయుల 'అభ్యుదయం;' ఆర్యసంస్కృతి.

దేవీమాహాత్మ్యములో నిశ్శ్రేయస ప్రసంగం చూచాయగా గోచరిస్తుంది. 'త్వం వై ప్రసన్నా భువి ముక్తిహేతుః' (౧౧-౫), 'సర్వభూతా యదా దేవీ స్వర్గముక్తి ప్రదాయినీ' (౧౧-౭), 'ఆరాధితా సైవ నృణాం భోగస్వర్గాపవర్గదా' (౧౩-౫) మొదలైనవాట్లో. గీతలో ఈ విషయమే వివరింపబడింది.

ఈ రెండు గ్రంథాల విషయంలోనూ ఆయా సంప్రదాయస్థులు చూపే అనుదారత హాస్యకరం. దేవీమాహాత్మ్యములోని 'త్వం వైష్ణవీ శక్తి రనంత వీర్యా' (౧౧-౫) 'ప్రసీద వైష్ణవీరూపే నారాయణి నమోఽస్తు తే' (౧౧-౧౬) అనే వాక్యాల్లోకూడా వైష్ణవులకు విష్ణుమూర్తి ప్రత్యక్షం కావటం లేదు. గీతలోని 'కాలోఽస్మి లోకక్షయకృత్' (౧౧-౩౨) అనే ప్రకటనలోకూడా శాక్తులకు కాళికాదేవి కనపడ్డం లేదు.

అరూప, అగంధ, అస్పర్శాదిశబ్దాలతో ఈ రెండు గ్రంథాలూకూడా ఆ పరదేవతనే లక్షిస్తున్నాయి. దీని భావం రూపగంధాదులు ఆ పరదేవతలో లేవని కాదు. ఆదేవత సర్వరస సర్వగంధయుతం అవటంవల్ల నిర్విశేషరూపంగా చెప్పబడింది. మనకు తెలిసిఉన్న రూపాలనూ, తెలియని రూపాలనూ

*ఈశోపనిషత్తు, ౧.

ధరించికూడా ఆ దేవత రూపాతీతమై ఉంది. దానికి రూపం లేకపోతే విశ్వానికి రూపే ఏర్పడేది కాదు. ఆయన జగత్స్రష్ట, జగత్కారణం. కారణగుణాలు కార్యానికి ఉపసంక్రమిస్తాయి; కార్యరూపంలో ప్రకాశిస్తాయి. 'నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః' (౨-౧౬) అని గీతలో చెప్పబడ్డ సత్యాన్ని కాదనటం ఎట్లా? పరమరూపయుతమైనదాన్ని రూపరహితం అనటానికి వీల్లేదు. అయితే, ఆరూపం ఎట్లాంటి రూపం అనే విషయం సిద్ధసాధకులకూ,

"పితా త్వం మాతా త్వం
దయిత-తనయ స్త్వం ప్రియసుహృత్
త్వమే వత్వం మిత్రం
గురురసి గతిశ్చాసి జగతామ్,
త్వదీయ స్త్వద్భృత్య
స్తవ పరిజన స్త్వద్గతి రహం,
ప్రపన్న శ్చైవం స
త్వహమపి తవై వాస్మిహి భరః"

— స్తోత్రరత్నము, ౬౦



# శ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావు

●

= శ్రీ రావాక కౌస్తుభము =

"తాలూకా ట్రెజరీ తణిఖీచేయుటకు డిప్యూటీ కలెక్టరుగారితో శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశ రావుగారు త్వరలో వచ్చెదరు. వారు శ్రీ వీరేశలింగము పంతులవారి శిష్యులలో నొకరు. వారిని మన ప్రార్థన సమాజమునం దొక యుపన్యాస మీయుమని కోరు దము."

నేనదే ప్రప్రథమముగ ప్రకాశరావుగారి పేరు వింటిని. అది ౧౯౧౩-వ సంవత్సరము నవంబరు నెల. పై పలకు అప్పటి భీమవరము తాలూకా తహస్సీలుదారు కీర్తిశేషులగు శ్రీ పెద్దిభొట్ల వెంకటప్పయ్య పంతులు వారిది. వారివలననే నేను ప్రకాశరావుగారి గుణగణము లనువింటిని. అనుకొనినట్టు డిప్యూటీ కలెక్టరుగారు గాని, ప్రకాశరావుగారు గాని ఆ నవంబరు నెలలో రాలేదు. అప్పటినుండియు వారి దర్శనము చేయు నభిలాషతో నున్న నేను దైవకృపచేత ౧౯౧౪-వ సంవత్సరమున కాకినాడ (సూర్యారావుపేట) గవర్నమెంటు బాలికా పాఠశాలలో ఉపాధ్యాయుడనుగా నియమింపబడి ప్రకాశరావుగారి దర్శనలాభము ప్రార్థనసమాజములో నొందగలిగితిని. అప్పుడు కాకినాడ ప్రార్థనసమాజము నకు ప్రత్యేక మందిరము లేదు. కాలేజీలో ప్రతి ఆదివార ముదయము ప్రార్థన జరుపుచుండిరి. కొన్ని సమయములలో ప్రకాశరావుగారి ఇంటియొద్దనే జరుపు కొనుచుండెడివారము. ఆనాడు వారికి నాయందు గలిగిన సోదరప్రేమ స్థాయీభావము నొందినది.

ప్రకాశరావుగారి మేధాశక్తి ఉద్యోగస్థులకును, విద్యార్థులకును, పత్రికాపాఠకులకును, జిల్లా రయితుల కును తెలియును. వీరి జీవితచరిత్రమాత్రము వారికి తెలియదు. కారణము? స్వార్థరహితసేవ, గుప్త దానము, దైవచింతన అనునవే వీరి జీవితాశయములు. వీరునూడ వీరి గురువుగారగు వీరేశలింగము పంతులు గారి వలెనే 'కర్మయోగి' యని పిలువబడదగినవారు.

వీరు తమతో కలిసి పనిచేయువారికి ఉత్సాహము, ఆవేశము, స్వాతంత్ర్యనిరతి పురిగొల్పుచుండిరి. ఎట్టి ప్రతిఘటన నైనను ధైర్యముతో నెదుర్కొని ఆత్మగౌరవము నిలుపుకొనగల ప్రజ్ఞాశాలి. తన వాదమును నిదర్శనములతో బలపరచుకొనగల నిపుణుడు.

ఆత్మగౌరవము, అధికారి మన్నన కడవరకు నిలుపుకొనగలిగినందులకు ఒకటి రెండు నిదర్శనముల నిచట దెల్పెదను. కాకినాడ "సీ కస్టమ్సు" (Sea Customs) ఆఫీసులో ఈయన ౧౫ రూపాయల జీతమున గుమాస్తాగా నుండగా, మాసన్ అను నొక రైల్వే కంట్రాక్టరుని భార్య కాలాతీతమైన వెనుక కచ్చేరికి వచ్చి, తనకు స్టీమరులో వచ్చిన సామానుల నీయవలసిన దని కోరెను. దరఖాస్తుకు స్టాంపులు అంటించవలెననియు, కాలాతీత మైన దనియు గుమాస్తాలు చెప్పిరి. దానిపై ఆ దొరసానికి కోపమువచ్చి, ఆమెపై తనకు ఇబ్బందికలిగించిరని ఇద్దరు క్లర్కులనుదుర్భాషలాడెను. ఆమెకు సరుకు తీయబడలేదు. ఆ సాయంకాలమున సీ కస్టమ్సు సూపరింటెండెంటుగారు, మిగతా క్లర్కులను ఐరోపా దొరసానితో కలహము పెట్టుకొనినను నెగ్గలేమనియు, ఆ కలహము వారి భవిష్య దభివృద్ధికి భంగకరముగుననియు బెదిరించిరి. ప్రకాశ రావుగారు పై విషయమంతయు జిల్లా కలెక్టరుగారికి సక్రమ మార్గమున నెరిగించిరి. తరువాత చెన్నపురి హైకోర్టు జడ్జిగారైన జస్టిస్ మూర్ దొరగారు నిందింపబడిన క్లర్కులు సివిల్ క్రిమినల్ కోర్టులలో న్యాయము బొందుటకు తమకు ఆక్షేపణ లేదని ఉత్తరువు నిచ్చిరి. ఇద్దరు క్లర్కులలో నొక రొత్తిగిలిరి. పిమ్మట ఆ దొరసాని కీర్తిశేషులగు రావు బహదూరు బాదం వెంకటరత్నంగారు మొదలగు వర్తకప్రముఖుల యెదుట ప్రకాశరావుగారిని క్షమా ర్పణ కోరుకొనెను.

౧౯౨౭-వ సంవత్సరము నాటికి ప్రకాశరావు పంతులుగారు హెడ్డు అకౌంటెంటుగ నుండిరి. ఆ సంవత్సరము అఖిల భారత క్షామనిధి శాఖను గోదా

వరిజిల్లాలో కూడ స్థాపించుటకు కలెక్టరుగా రొక పెద్ద సభ జరిపిరి. ఆ సభకు జిల్లాలోని పెద్దపెద్ద ఉద్యోగులు చాలమంది వచ్చిరి. ఆనాటి వక్తలలో ప్రకాశరావుగా రొకరు. కార్యనిర్వాహక వర్గమును నియమించునపుడు కలెక్టరు అగ్రాసనాధిపతిగను, కాకినాడ బ్యాంకి ఏజెంటు సెక్రటరీగను, ప్రకాశరావుగారు కోశాధికారిగను నియమింపబడిరి. జిల్లా ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు, సబ్‌జడ్జి, డిస్ట్రిక్టు మునసబు, డిస్ట్రిక్టు బోర్డు మెంబర్లు, మునిసిపలు కౌన్సిలర్లు మొదలగు ప్రముఖులు పెక్కండ్రుండగా హెడ్డు అకౌంటెంటును కోశాధికారిగా నియమించుటేల యని సభ్యులు గుసగుసలాడుకొనసాగిరి. ఆ నిధికి ఇరువదివేల రూప్యములు పోగుచేయబడెను. గోదావరిజిల్లా కమిటీవలె అన్ని జిల్లాల కమిటీలును పనిచేసినయెడల చాల తృప్తికరముగా నుండెడిదని రాజధాని కమిటీ సెక్రటరీయును, మద్రాస్ మెయిల్ పత్రికాధిపతియు నైన సర్ హెన్రీ బీహాంపుగా రాసందర్భమున ప్రశంసించిరి.

కొందరు ఒకశాఖలో చూపగల ప్రజ్ఞ వేరొక శాఖలో చూపలేరు. ప్రకాశరావు పంతులుగా రట్లు కాదు. పరిపాలన సౌకర్యముకొరకును, సిబ్బందిపని భారము తొలగించుటకును ఇప్పుడు రెండుజిల్లాలుగా విభజింపబడిన పూర్వపు గోదావరిజిల్లా కంతకును ట్రెజరీ హెడ్డు అకౌంటెంటుగానుండి వారు అధికారుల మెప్పువడసిరి. అట్లే తమ ఉపన్యాసములవలన విద్యార్థుల మెప్పును బడసి విమర్శనపూర్వక వ్యాసరచనలచే పత్రికాపాఠకుల మెప్పునకును, కర్షకజీవితమందు గల కష్టములను అధికారులకు విన్నవించి వానిని తొలగించు ప్రజ్ఞచేత రైతుల మన్ననకును పాత్రులైరి.

వాదబలముకలవారు సాధారణముగ నితరులకు విధేయులై యుండరు. "స్వప్రమాణబుద్ధి పురుషుని సత్యదూరునిగ జేయదు" అనెడి సత్యమును గ్రహించిన వారిలో ప్రకాశరావుగా రొకరనవచ్చును. ప్రతి సంఘ సంప్రదాయములోను ఏదేని యొకలోపము కనబడును. ఆలోపములు చూచునపుడు మానవునకు అణకువ, ఓపిక, సభ్యత యుండజాలవు. ఆయనకు సంఘ సంప్రదాయములోని లోపములు గోచరించినచో వానిని నిరోధింపక యుండలేరు. నలుగురితోపాటు నడువవలయుననెడి నియమము అట్టివారిని బంధింపజాలదు. ఆయన నాయకత్వము నెప్పుడు వాంఛింపలేదు. అహంకారముచేతను కాదు; నిగ్రహము, త్యాగబుద్ధి లేకయు కాదు; ఒక్క సంస్థలోనే యుండలేకపోవుటయు కాదు; సంఘలోపములను సహింపలేకపోవుటయే ఆయనస్వభావము. ఆయనది విమర్శకుని త్రోవ. గోఖలే, తిలకుల వంటి మేధావుల పంథ. వారి మేధస్సు సర్వదా కళపెళ ఉడుకుచుండును. అట్టి స్వతంత్రులు ఏ సంస్థలోనైనను తలయూపుచు నుండలేరు. లాభనష్టములు లెక్కించుకొనుచు, అడుగడుగున లెక్క చూచుకొని, అధికారుల ప్రాపకము కోల్పోకుండ నడచెడి శిఖామణుల పంథలో వారు చిక్కుకొనగలరా? తన యొరలో తాను దూరవలసినదేకాని ఇంకొకరొరలో దూరెడు తత్త్వము ప్రకాశరావుగారిది కాదు. ఇంత మేధావి యన్నమాటయే గాని ఆయన శుద్ధ అమాయకుడు, విశ్వాసపాత్రుడు. వితరణశీలుడు. మనవాడు, ఇతరుడు అనెడి భేదము నెరుగని విశాలహృదయుడు. ఆయన ఏసంస్థలో సభ్యుడుగా పనిచేసినను తన అసిధారావ్రతముచే నితరులకు, తోడిసభ్యులకు బహిర్వివేకము (Outer conscience) గా కనబడెడివారు. ఇండియన్ సోషల్ రిఫార్మర్, ఇండియన్ మెసెంజరు వారపత్రికలను ప్రకాశరావుగారు పఠనీయగ్రంథములుగా భావించి వానిలోని బోధల ననుకరించెడివారు. ఆయనజీవన విధానము నా రెండుపత్రికలును నిరూపించెనేమో!

ప్రకాశరావుగారి జీవితము సమగ్రముగా వ్రాసి ముగించుట నాబోటివానికి సాధ్యముకాదు. కాని సకాలములో వారి గుణవిశేషములను కొన్ని చేర్పగలిగిన యీ వ్యాసమునే వారికి అశీతిపూర్తికానుకగ* నేను

* ప్రకాశరావుగారి జననము 15-12-1864 నాడు. వీరి అశీతిపూర్తి ఉత్సవమును కాకినాడ పౌరులు రాగల డిసెంబరు నెలలో జరుప నిశ్చయించుకొని యున్నారు.

సమర్పించుకొనుచున్నాను. ఈశ్వరాజ్ఞయైనచో ముందు నాయాశ ఫలించుననెడి ఆశయముతో ప్రస్తుతము వారి దినచర్య పుటలలోని కొలది అంశములను మాత్రము ప్రకటింప సాహసించుచున్నాడను.

౧౮౯౮-వ సంవత్సరములో సర్ ఆర్థర్ హావిలాక్ గవర్నరు కాకినాడ వచ్చినప్పుడు మునిసిపాలిటీవారు, డిస్ట్రిక్టుబోర్డువారు,వినతిపత్రములను కాకినాడ టవున్ రైల్వేస్టేషనులో సమర్పింపదలచి,ఆస్థానమునకు, ఉద్యోగీయులలో ఏబదిరూపాయలకు పైగా జీతముగలవారిని మాత్రమే ఆహ్వానించిరి. కాని, ప్రకాశరావుగారు కలెక్టరుగారిని కలసికొని, ట్రెజరీలోని క్లర్కుల కందరికి, జీతముతో ప్రసక్తిలేకుండ వినతిపత్రము చదువునప్పుడు పందిరిలో హాజరగుటకు సెలవు తెప్పించిరి. ఆహ్వానింపబడిన ఉద్యోగులు, అనుద్యోగులును స్టేషనులో మూడవక్లాసు ప్యాసెంజరుశాలలో గవర్నరుగారి రాకకై నిరీక్షించుచుండ వారికెవ్వరికిని దర్శనమైన లేకుండ మునిసిపల్ కౌన్సిలర్లు, డిస్ట్రిక్టు బోర్డు మెంబర్లు, ట్రెజరీక్లర్కులు కలిసి గవర్నరుగారివెనుక ఆయనకొరకు ప్రత్యేకముగ ఏర్పరుపబడిన గుమ్మముగుండ బయటకు వచ్చిరి. పిమ్మట కొంతసేపటికి మూడవక్లాసు ప్యాసింజర్ల షెడ్డులోనివారికి విడుదల వచ్చెను.

౧౮౯౮-వ సంవత్సరము సెప్టెంబరు నెలలో ప్రకాశరావుగారు మునిసిపల్ కౌన్సిలరుగా ప్రత్యర్థికి రెట్టింపు ఓట్లచే ఎన్నుకొనబడిరి. జిల్లాకలెక్టరుకు రెండువోట్లు ఉండుటచే నాయన పోలింగునకువచ్చి ఈయనకు తన రెండువోట్లు నిచ్చెను. కలెక్టరుగారి సలహాదార్లు ఆయనను వోటింగునకు వెళ్లవద్దని సలహానిచ్చి, ఎలెక్షన్ అప్పీలు విచారణ చేయవలసివచ్చినచో ఆక్షేపణ యుండునని చెప్పి ఆయనను వోటింగునకు రాకుండ చేయజూచిరి. నాలుగుగంటలయ్యెను; కలెక్టరుగారు రాలేదు. అప్పుడు ప్రకాశరావుగారు కలెక్టరుఇంటికి వెళ్లి రూల్సు బోధపరుపగా కలెక్టరుగారు పోలింగునకువచ్చిరి. జిల్లాలో ఎలెక్షనులు ఆరంభమైనవెనుక, కాకినాడలోని తన తాబేదారు డిప్యూటీ కలెక్టరొకప్పుడు అభ్యర్థిగా నుండ అప్పటి కలెక్టరు పోలింగునకువచ్చి, డిప్యూటీకలెక్టరునకు వ్యతిరేకముగా వోటు నిచ్చెను.

౧౯౦౩-వ సంవత్సరము డిసెంబరు నెలలో చెన్నపురి గవర్నరుగానున్న ఆంప్థిలు ప్రభువు కాకినాడ కలెక్టరుకచ్చేరీభవనమునకు శంఖుస్థాపన చేసెను. మధ్యాహ్నము ౨ గంటలకు కాకినాడ మునిసిపాలిటీవారియొక్కయు, గోదావరి డిస్ట్రిక్టు బోర్డువారియొక్కయు వినతిపత్రములు అందుకొనెను. ఆరెండు సమయములందును శిరస్తాదారు డిపార్టుమెంటులోని ఒక్కక్లర్కు అయినను రాజాలదయ్యెను. ట్రెజరీ డిపార్టుమెంటు క్లర్కుల నందరిని మునిసిపల్ కౌన్సిలరు ప్రకాశరావుగారు కలెక్టరుగారి అనుమతిని బొంది, మండపమునకు రప్పించెను. ట్రెజరీ ముసద్దీలు కచ్చేరీలోపనిచేయుచున్న డిప్యూటీ కలెక్టరుగారితోనైన చెప్పకయే వచ్చిరి. ఆయన ఒక్కడు ఒంటరి రామలింగమువలె కచ్చేరీలో నుండిపోయెను. శిరస్తాదారు డిపార్టుమెంటులోనివా రందరును, శిరస్తాదారు సహా కచ్చేరీలో పనిచేసికొనుచుండిరి. ఆసందర్భమున నొక సీసమాలికను ట్రెజరీ అకౌంటెంట్లు ప్రకాశరావుగారికి సమర్పించిరి.

అప్పుడు ముసద్దీల హృదయములో మెదలినది ప్రకాశరావుగారి సంఘసంస్కరణము కాదు, బ్రహ్మసమాజము కాదు, వారి అధికారము కాదు; కాని తాబేదార్లకు చేసిన గౌరవమే ముఖ్యము. శుద్ధ సనాతన దీక్షాపరుడగు శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారంతటివారు ప్రకాశరావుగారిని మెచ్చుకొని పద్యము వ్రాయుట ప్రకాశరావుగారు తమతోడి ముసద్దీలను ఎంత ఉత్తేజాలుగ చేయగల సమర్థులో తెల్పుచున్నది.

## కొన్ని విశేషాంశములు

౧౯౦౩-వ సంవత్సరమున శాంక్షన్ అయిన గోదావరి, కృష్ణాజిల్లాల రీసెటిల్‌మెంటునుగురించి తరినీర్ల సువ్యయముగా తెలిసికొనుటకు శ్రీ రమేశచంద్రదత్తు కలకత్తానుండి కాకినాడవచ్చి శ్రీ గంజాం వెంకటరత్నముపంతులుగారి యతిథిగానుండెను. ఆయన కాకినాడలో నున్న నాలుగుదినములలో వెంకటరత్నము పంతులుగారిని తప్ప పట్టణములో నెవ్వరిని చూడ

లేదు. మరుచటిదినము ఉదయమున వెళ్లుననగా, తొలి నాటిరాత్రి, ఒరిస్సాకమీషనరుగానుండి ఐ. సి. యస్. ఉద్యోగము చాలించుకొనిన సర్ రమేశచంద్రదత్తును జిల్లాకలెక్టరు కమ్మింగ్ గారు తనయింటికి విందుకు పిలిచిరి. ప్రయాణదినము ఉదయమున హఠాత్తుగా శ్రీ దత్తుగారు ప్రకాశరావుగారింటికి వచ్చి ఆయనవలన జిల్లాపరిపాలనమును గూర్చిన కొన్ని సంగతులు తెలిసికొనిరి. అట్టి మహనీయునకు కాఫీయైననిచ్చుట కష్టము ప్రకాశరావుగారికి కాఫీత్రాగు అలవాటు లేనందున తాంబూలమును, 'పణికారు' రచించిన "మలబారు-అందలిప్రజలు" అను చిన్నపొత్తమును బహుమానముగా నిచ్చిరి. హిందూదేశప్రజల చరిత్రము కొద్దికొద్దిగా తా నెరిగియున్నను, మలయాళమును గూర్చి చదువలేదని చెప్పుచు దత్తుగా రాపుస్తకము నొసగినందువలన తన కొక కొరతదీర్చిరని ప్రకాశరావుగారిని ప్రశంసించిరి. కాకినాడపట్టణమున విద్యాధికులు, ఉన్నతోద్యోగులు, ధనికులు చాలమందియుండగా, హెడ్డుఅకౌంటెంటు ఇంటికిమాత్రము దత్తుగారు వెళ్లి చూచుట కలెక్టరుకు కంటకముగా నుండెను. కొలదికాలమునకే దత్తుగారు బరోడాసంస్థానమునకు దివాన్ అయిరి. ౧౯౦౪-వ సంవత్సరములో బొంబాయిలో జరిగిన దేశీయ సంఘసంస్కరణ సభకు బరోడా మహారాజావారు అగ్రాసనాధిపత్యము వహించిరి. ఆ సభకు కాకినాడనుండి శ్రీ ప్రకాశరావుగారు ప్రతినిధిగా వెళ్లియుండిరి. బరోడాకూడ వెళ్లి దత్తుగారిని చూచి వచ్చిరి. దత్తుగారు స్వంతగుఱ్ఱపుబండి కట్టించి ప్రకాశరావుగారిని బసకు పంపించి గౌరవించిరి. వారిరువురును బరోడాలోకూడ సెటిలుమెంటు విషయములే మాట్లాడిరి. అప్పుడు దత్తుగారు కర్జను ప్రభువుతో ల్యాండురివిన్యూ పాలిసీనిగూర్చి వాద ప్రతివాదములు జరుపుచున్న కాలము.

బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నము నాయుడు గారిని కాకినాడ కాలేజీకి ప్రిన్సిపాలుగా రప్పించుటకు కాలేజీ కవున్సిల్ మెంబర్లు రెండుపార్టీలుగా విడిపోయిరి. ఆనరబుల్ వి.యస్. శ్రీనివాసశాస్త్రిగారు—ప్రీవీకౌన్సిలర్—రెండవ అభ్యర్థి. కాలేజీ కౌన్సిలుసభ్యుల సంఖ్య ౨౦. మొదట నాయుడుగారికి వోట్లు ఇచ్చుటకు వాగ్దానముచేసినవారిలో ఇద్దరు ప్రముఖులు తుదకు వ్యతిరేకులైరి. జిల్లాకలెక్టరు కౌన్సిలుకు అగ్రాసనాధిపతి. ప్రిన్సిపాల్ ఎలెక్షనునాడు మీటింగుకు నాలుగువేల మంది పౌరజనులు వచ్చిరి. నాయుడుగారు నియమింపబడినచో కుటుంబవిచ్ఛేదము, సంఘహాని, మతభంగము సంభవించునని మహజర్లు మీటింగుకాలమున దాఖలు చేయబడెను. మహజర్లలో వెంకటరత్నము నాయుడుగారి రాకవలన ప్రమాదము వాటిల్లునని తెల్పుచు వ్రాలు చేసిన కొందరు ఆయనరాకవలన తమపిల్లలకు నీతివర్తనము, దైవభక్తి, కుటుంబగౌరవము హెచ్చునన్న అర్జీలలోకూడ సంతకము చేసిరి. ఇట్టి విరుద్ధవ్యాపారము రోతగానున్నదని వ్రాలుదార్లకు తెలుపగా వ్యతిరేకపు అర్జీలలో బలవంతముపైన వ్రాలుచేసితిమనియు, రెండవది ఇష్టపూర్వకముగ దాఖలుచేసినదనియు ఒప్పుకొనిరి. తుదకు కలెక్టరుగారి వోటు నాయుడుగారికి ఇచ్చుటవలన నాయుడుగారు ఆకాస్టింగువోటుచే నెగ్గిరి. ఆ ఉదయమున మీటింగు ౮ గంటలు మొదలు ౧౦ గంటలవరకు జరిగెను. ఆమీటింగులో ప్రతికక్షుల వాదములను ప్రకాశరావుగారు నిదర్శనపూర్వకముగా ఖండింపగల్గిరి. మొదట నాయుడుగారికి సుముఖులుగానుండి తుదకు చాపను ఫిరాయించిన ఒక గృహస్థుడు క్రొత్త కలెక్టరురాగానే ప్రకాశరావుగారిమీద దోషారోపణ చేసి, ఆకలెక్టరును వారిపట్ల విముఖునిగాజేసెను. "ప్రిన్సిపాల్ ఎలెక్షను సందర్భములో ప్రకాశరావుగారెక్కువ కక్షోక్యము కలిగించుకొనెనట; మీకేమైన తెలియునా" యని కలెక్టరు ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు నడుగగా, తాను తాలూకా ఖజానాల తనిఖీకి వెళ్లియుంటిననియు, తనకేమియు తెలియదనియు చెప్పి ఆయన తప్పించుకొనెను. తనతో మొఱపెట్టుకొనిన కౌన్సిలరుపై కలెక్టరుకు కొంత గౌరవభావ ముండెడిది. తర్వాత కొంతకాలము గడిచిన పిమ్మట, ప్రకాశరావుగారు దేహారోగ్యముకొరకు నెలదినములు సెలవు గైకొని ఉదకమండలము వెళ్లిరి. సెలవు ముగిసి తిరిగి ఉద్యోగమున ప్రవేశించుటకై వచ్చినప్పుడు, తన యనుమతి లేకుండ ప్రకాశరావుగారిని పనిలో ప్రవేశింపనీయవద్దని కలెక్టరు డిప్యూటీ కలెక్టరుతో చెప్పెను. ఆ యాజ్ఞ ప్రకారము ప్రకాశ

రావుగారు కలెక్టరు నెదుట హాజరైరి. తోకత్రొక్కిన త్రాచువలె లేచి, కలెక్టరుగారిట్లనిరి: "నీవు కుట్రమనుష్యుడవు. నిన్ను నాకచ్చేరిలో నుంచనీయను. నిన్ను వేఱొకజిల్లాకు బదిలీచేయుటను గూర్చి రివిన్యూబోర్డు వారికి వ్రాసెదను. అంతవరకు నీవు సెలవుపై నుండవచ్చును." అప్పుడు ప్రకాశరావుగారు రీక్రిందిచొప్పున జవాబిచ్చిరి: "అయ్యా! మీ కీజిల్లా అనుభవము సుమారైదు ఏండ్లనుండి కలదు. నేను మీ కెరుకపరచవలసిన విషయములు చాల గలవు. ఒక పావుతావు తెల్లకాగితము దయచేసినచో, నా ఉద్యోగమునకు రాజీనామా దాఖలుచేసి, నాకడుపులోని దంతయు వెడలగ్రక్కెదను. అప్పుడు నేను హెడ్డు అకౌంటెంటుగా మీతో మాట్లాడను. మీరు కలెక్టరుగా నేను చెప్పినది వినబోరు. నేను కుట్రదారుడనని నాపై ఘోరమగు నేర మారోపించితిరి. నేను చేయుచున్నట్టియు, చేసినట్టియు కుట్రలు దొరతనమువారిపైననా, లేక తోడివారలపైననా? దొరతనమువారిపై నైనచో నన్నేల ప్రాసిక్యూషనుచేసి ఖయిదుచేయరాదు? సంసారులపై నైనచో, వారు సివిల్, క్రిమినల్ చర్యలు జరిపి పరిహారము బడయుదురు. వారితో మీ కేమి ప్రసక్తి? నేను కుట్రదారుడ నంటిరి. కుట్రదారుడు స్థలాంతరమునకు పోయినను తనసైజను మార్చుకొనునా? ఆ కారణమువలన గాక, మీరు నన్ను బదిలీచేయించుటకు వేరుకారణముల నారోపించి మీసంకల్పము నెఱవేర్చుకొనుడు. ఇంతశ్రమ ఏల? నా రిజిగ్నేషను నంగీకరించి, నన్ను విడచిపెట్టుడు. మీరు నన్ను కుట్రదారుడనని వ్రాసితి రేని నన్ను ఏకలెక్టరు తీసికొనుటకు అంగీకరించును? పనిలో నాయం దెప్పుడును మీరు తప్పెంచలేదు. నాసమర్థతను గురించి మీకు మంచి యభిప్రాయము కలదు. మత సాంఘికాది విషయములలో దొరతనమువారు మీ అభిప్రాయము నడిగినప్పుడు మీరు డివిజనల్ ఆఫీసర్లు, ఇతరప్రముఖులతోపాటు నా అభిప్రాయమునుకూడ అడిగిన సమయము లున్నవి. నాపైఅధికారి ట్రెజరీ డిప్యూటీకలెక్టరును తప్పించి నన్ను మాత్ర మడిగెడువారు."

అంతట కలెక్టరుగారు "మన మిద్దరము ప్రయివేటు గృహస్థులముగా మాట్లాడుకొందము. నీవు చెప్ప దలచిన దంతయు చెప్పు"మనెను. అంతట కాకినాడ మ్యునిసిపల్ కౌన్సిల్, డిస్ట్రిక్టు బోర్డు, తాలూకా బోర్డు సభ్యుల లాలోచీ వ్యవహారములు, వారు నిజమును కప్పిపెట్టి స్వార్థపరులై కలెక్టరు నేవిధముగా మభ్యపెట్టుచున్నారో, వారి గుఱ్ఱపు బండ్లను, వారిచ్చు చందాలను బట్టి వారు గౌరవార్హులని, విశ్వాసార్హులని అధికారులు నమ్మి ఎట్లు మోసపోవుచున్నారో, జిల్లాలో సబ్ మేజిస్ట్రేటులను బెదరించి, నిర్దోషులను దోషులుగను, దోషులను నిర్దోషులుగను ఎట్లు చేయుచున్నారో సాకల్యముగ ప్రకాశరావుగారు చెప్పిరి. తుట్టతుదమాటగ ఆయన తాను రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారి శిష్యుడ ననిరి.

ఈ సంభాషణ మంతయు ముగియునప్పటికి ౧౦ గంటలు దాటెను. "సరియే, నీవు వెళ్లి నీపనిలో నేడే ప్రవేశించవచ్చును. నేను రెవిన్యూ బోర్డువారో, ఇరుగుపొరుగు జిల్లాకలెక్టరులకో వ్రాసి తెలిసికొందు" నని కలెక్టరుగారు సెలవిచ్చిరి. ఈ సందర్భపు ఫలితము వినుటకు ట్రెజరీ డిప్యూటీకలెక్టరుగారు ఆత్రముతో తమ ఇంటియొద్ద నుండిరి. జరిగినదంతయు పూసగ్రుచ్చినట్లు ఆయనకు ప్రకాశరావుగారు ఎరుకపరచిరి. అది విని ఆయన అనిన దేమనగా "కలెక్టరుగారు మిమ్ముగూర్చి బోర్డువారికిగాని, ఇరుగుపొరుగుజిల్లాల కలెక్టరులకుగాని వ్రాయరు. మీకేమియు భయములేదు. మీరు ఆయనదృష్టియందు గౌరవార్హులగుదురు" అని. నెలదినములు గడచిన వెనుక కలెక్టరు ప్రకాశరావుగారి కొఱకు కబురుపంపి చెప్పిన దేమనగా, "కాకినాడలో గల కొలదిపాటి సంఘసంస్కారాభిలాషయైనను నీమీద నాధారపడియున్నది. నిన్ను బదిలీచేసిన పక్షమున సంస్కరణ విముఖులకు బలము చేకూరును. నీకు బదిలీయైన వారు ఉప్పొంగుదురు. రాజకీయ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనక నీపనియందును, సంఘసంస్కరణమునందును, కాలేజీ కౌన్సిలు పనియందును శ్రద్ధాళువవయి యున్న నీకు చాలును" అనిరి. 'చిత్తము' అని చెప్పి ప్రకాశరావుగారు సెలవుగైకొనిరి.

### ఉత్తరహిందూస్థాన యాత్ర

౧౮౯౪-౯౫ సంవత్సరములలో ప్రకాశరావు గారు రెండుమాసములు సెలవుపైకొని కటకమునుండి ఒరిస్సా కాలువలమీదనుండి చాందుబాలీ రేవు చేరి అచ్చటనుండి స్టీమరుమీద కలకత్తా చేరి పండిత శివనాథ శాస్త్రిగారి యతిథిగా నుండిరి. శాస్త్రిగారు ఏర్పాటు చేసి, మహర్షి దేవేంద్రనాథ్ ఠాకూరిగారి దర్శనమును చేయించిరి. ఠాకూరుమహర్షి కప్పుడు చెవుడు హెచ్చుగానుండి నేత్రదృష్టి తప్పిపోయెను. మహర్షి గారి యంత్యోపదేశమును (Last Offering) శ్రీ మున్నవ బుచ్చన్న పంతులుగారి కోరికపై ప్రకాశరావుగారు తెలుగున వ్రాసిరి. ఈసంగతినే మహర్షి గారికి వారి ద్విభాషి తెలియజేసెను. మహర్షిగారు తమ కుడి హస్తము ప్రకాశరావుగారి శిరముపై నుంచి ఉపనిష ద్వాక్యములతో దీవించిరి. ఆవాక్యములు ప్రకాశరావు గారు గ్రహింపజాలరైరి. బ॥ వ॥ భేదము పాటింప కుండ పల్కుటచేత వారి దీవన గ్రాహ్యముకాలేదని ప్రకాశరావుగారు నాతో చెప్పిరి.

ఆయాత్రలో ప్రకాశరావుగారు సకుటుంబముగ కాశి, ఫైజాబాదు, అయోధ్య, లక్నో, అలిఘరు, ఢిల్లీ, ఆగ్రా, అలహాబాదు, గయలు దర్శించి మరల కలకత్తా చేరి భువనేశ్వరము మీదుగా కాకినాడ చేరిరి.

ఇరువదిరేండ్లు ప్రకాశరావుగారు మొత్తము మీద మునిసిపలు కౌన్సిలరుగ నుండిరి. ౪ ఏండ్లు దొరతనమువారిచే నియమింపబడిరి. ౧౬ ఏండ్లు ప్రజల చేత ఎన్నుకొనబడిన సభ్యులుగా నుండిరి. కౌన్సిలరు హోదాను చాలించుకొనినప్పుడు మునిసిపలు సిబ్బంది ఆయనకు వినతిపత్రము సమర్పించెను. అంతకుపూర్వము కౌన్సిలరులకు అట్టిసన్మానము కాకినాడపురమున జరిగి నట్టు నేను వినియుండలేదు. శాశ్వతములైన మేలులు కొన్ని కాకినాడ పట్టణమున కాయన చేసిరి.

దైవముచే నమ్మి పాటుపడిన శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారికి భగవంతుడు దీర్ఘాయువు నొసంగుగాత !

---

# మహాలయం

= శ్రీ దేశిరాజు కృష్ణశర్మ =

౧

కదిలి కదిలి జ
గ మొక ఉద్ధృతతరమై
ఎగసి ఎగసి తక్షక
కాకోదర కాలకూట
విషాగ్నిజ్వాలై
మూలముట్టగా మునరుచు
బుసబుస బుసబుస
పుక్కిలింతలై క్రమ్ముకరాగా
కుకుధరి కుకుధరి
కుఢీకు కుఢీకు ఢీం
ఢీకు తకిటతకిట
ఢీకుఢీకు ధిధిలం
ధికుధికు సర్వం

౨

కదిలి కదిలి జ
గమొక యుద్ధరంగమై
ధణాంధణధణధణాంధణ
ధిమింధిమి నినాదమయమై
ఖతను త్రొక్కినది తా
తృనకృత్యం
ఎగసిమండినది

మారణదేవీకరాళజిహ్వాక
కుప్పలుకుప్పలు
కూలిన మానవఅస్థులమధ్యలో
మూల్గిన మూలుగు
నికృష్టజీవిత
నిరాశహేలీ
కరాళకృత్యం

౩

కాళికగుడిలో
ఘంటల మ్రోతలు
చాముండీశ్వరి
శబ్దనృత్యమును
చండికదేవి
శక్తిలాస్యమును
దుర్గామాయీరౌద్రనర్తనము
ధ్రిగుడుధ్రిగుడుతక
ధిరుగుడుధిమితా!
దుగుదుగుతధిమిత
తోధిరితోధిరి బం
దుగుతక తధిగిణతకతోం!
మారుమ్రోగినది
లోకంబంతట!
మహాలయంబున లయోత్సవం!
అంతా వేదన! అంతా నాశం!

౪

కాలంకాలం కరగిపోసినది
మానవకర్మల మారణమార్గం
మండిన జీవిత ఆశలమధ్యలో
బూడిదరాసులె భస్మరాసులుగ
నాట్యంబాడే ఓ నటరాజా!
ఝుణకుఝుణకు ఝుణ
ఝుణఝుణ నినదం
ధణకుధణకు తక
తకిటతకిట ఝుం
తళకుధళకు తక
తధిగిణకిణరిం
ఖులఘులఘులఘుల
ఘులరవకలితం!
శరణుశరణు ఓస్వామీ!
ఓహోహో. నటరాజా!
మానవహృదయం మండేజ్వాలగ
కడుపే చేతికి చిప్పై
చచ్చే చావుకు అంతంలేదు
నీచేతుల మధ్యలో
బ్రతికిన మానవశీర్షం
డమరుకరవారవా
రవజవా మ్రోతకు
తోడుపలికినది
శరణు, శరణు ఓదేవా!
నీ మూడోకన్నిక
తెరువకు తండ్రీ!

౫

ప్రపంచమంతా పురిటిల్లయి
కాలంకాంతకు నిండునెలలుగా
ప్రసవవేదనే లోకంబంతా
జరుగుతున్నది మహాలయం!
రానున్నది దీపావళి!

---



డార్జిలింగ్ ప్రాంతమున టీవిత్తనములు నాటుట.

# ప్ర ప్ర థ మ ము న

సేద్యముచేయబడు ఇతర మొక్కలవలెనే తేయాకు దుబ్బులుకూడా, జాగ్రత్తగా ప్రత్యేకించబడిన విత్తనములనుండి పెంచబడుచున్నవి.

చక్కగా సంరక్షింపబడిన నారుమడులలో ఈ విత్తనము లొకటొకటిగా నాటబడి, వీనినుండిమొలచు మొక్కలు, లేతఆకు తొడుగుట మానుకొనుచున్న దుబ్బులస్థాన మాక్రమించును.

భారతదేశపు పర్వతప్రాంతమందలి సారవంతమైన భూమిలో అనుకూలవాతావరణమున విత్తనము మొలచి త్వరలో మొక్కలై,...... తోటలయందలి బహిరంగ ప్రాంతములలో నాటుటకు యోగ్యమగును.

మూడులగాయతు అయిదు సంవత్సరములకాలములో ఈ దుబ్బులు ఆకుగిల్లుటకు యోగ్యమై, అటుపిమ్మట త్వరలోనే మా అసంఖ్యాకములైన డిపోలకు తాజా అయిన రుచ్యమగు తేయాకు అందజేయును.

# బ్రూక్ బాండ్

"వేదా!"

"వినబడదూ పిలుస్తూంటే?"

వేదవతి వస్తూన్నా, కాత్యాయని ఆమాటలు అనేసి తన వాలాయితీ తీర్చుకుంది. కాళ్లు కడుక్కుంటూ అన్నాడు అనిలుడు భార్యతో: "యిన్ను.. చెడ్డకష్టం. . దీనికన్నా మరేపనయినా నయంస్మీ"

అవ్యక్తంగా అనిలుడనిన మాటలలోని బాధ వేదవతిని కదిలించింది. సంభాషణ మార్చినట్లు మృదువుగా అన్నది:

"ఇవ్వాళ అక్కగారికి ఏకాదశి"

వినిపించుకోనట్లు అన్నంముందుకు అడుగులు వేశాడు అనిలుడు. ఇన్నిదినాలుగా అతని కొక్కటే ఆలోచన. అదే తన అశాంతికి కారణమై యుండవచ్చు. "పిచ్చిలోకం . . వజ్రాయుధాన్ని ముల్లు తీయను వుపయోగిస్తుందే!" మనస్తత్వానికి వాతావరణం రూపం యిస్తుందంటారు; స్వగృహంలో దైవంగా చూస్తారు తన్ను. రత్నదాసుకూ తనంటే గౌరవం. మరి తనకు దేనికీబాధ! ఈ చిన్నపాటివుద్యోగానికి తను గడపిన జీవితమంతా చదువుక్రింద వృథా చెయ్యకపోతే బావుండేదనేమో!... ఒకనాడు అతను గాఢనిద్ర పోయినాడు. తిరిగి మేల్కొన్నేప్పటికి తన గడచిన దినాలు జ్ఞప్తికే రాలేదు. మంచినీ రివ్వవచ్చిన వేదవతిని గుర్తుపట్టలేక తానే నవ్వుకున్నాడు. ఏమి టీపిచ్చిభ్రమ!

పళ్లెంలో గీతలు గీస్తూ, వేదవతికి దగ్గరగా పీట లాక్కున్నాడు.

"నీవు భోంచేశావూ?"

"ఇదుగో చేస్తాను"

"యిందాకా నాకోసం కూర్చోవద్దని చెప్పలేదూ?"

"ఆఁ...వాళ్ల ఊర్మిల వచ్చి మాట్లాడుతోంటే అల్లాగే పోయింది ప్రొద్దు."

"అయినా, మార్వాడీలాగా వదలకుండా వచ్చాడేం...అధికారం చలాయిస్తున్నాడు; రాచబిడ్డలతో స్నేహం చేసి యిదీ చెడిపోతోంది మరీ—" పదు కొన్న పళంగా లేచి కూర్చుని అన్నది కాత్యాయని. తమ్ముని జవాబుకు ఓక్షణం ఎదురుచూచిన మాట నిజం. నిండుకుండలా తొణకలేదు అనిలుడు.

౨

దృక్పథాలు మారుతాయి. నీ విచక్షణే వాపాయసం !—నీలో నీకే మార్పు రావచ్చొకప్పుడు ...ఒకసారి కాకిని కాకిగా గుర్తించుకోగలవు. మరోసారి అదే కాకిని కోకిలగా భ్రమిస్తావు...

దీపాలవేళ. ప్రమిదలు తుడుస్తోంది వేదవతి. పమిటకొంగు పరచుకుకూచుని భగవద్గీతలు చదువుతోంది కాత్యాయని.

"శ్రీభగవా నువాచా...

వేదా! దీపం పెట్టడానికే దినమంతా పరిపుచ్చుతావు- అలసివస్తా దని తెలీదూ? పొయ్యి రాజెయ్యాలి. కానివ్వ త్వరగా...నైనం ఛిందంతి శస్త్రాణి..."

జీవించడానికి తింటారో, తినడానికి జీవిస్తారో అన్న అనుమానం వేదవతి కెన్నోసార్లు కలిగింది. ఆడబిడ్డ పూచీకత్తు పుచ్చుకుని ప్రపంచం నడుపుతే, వెండికొండలన్నీ తిండికొండ లవుతాయన్లే వుంది! అలసివచ్చిన భర్తను తిండితో తప్ప సంతృప్తిపరచలేరని కాత్యాయనిసిద్ధాంతం కాబోలు! సమాధాన మిద్దామనుకోకుండా అనేసింది:

"మరేమీ ఫర్వాలేదు. కాఫీ త్రాగి వెళ్లారు."

ఈ జవాబులోని వెటకారం వేదవతి భర్త యెడల వూహించింది కాదు. గోరంతలు కొండంతలుగా చేసి,కయ్యాలకు కాలుజాపడం కాత్యాయని దినచర్యలా కనిపిస్తోం దీ మధ్య వేదవతికి. ఎన్నాళ్లనీ ఈమానవ్రతం? తమ్ముణ్ణి వెనకవేసుకుని కాత్యాయనికి తనపై అధికారం చలాయించడాని కెంతో హక్కుంది నిజానికి. అయినా, మానప్రాణాలూ అర్పించుకున్న తన భర్తను చూచుకుని ఆమెకు జవా బివ్వడానికి పిసపాలైనా తనకు హక్కు వుండివుంటుందని వేదవతి అభిప్రాయం. ఒకటి మాత్రం తనకు నచ్చింది; ఆమె యెంత తాపత్రయపడినా తన భర్తకొరకే అన్నట్లు

వ్యక్తమౌతోంది దూరాలోచనకు...మరి తన జీవితానా అదేకదా, తనతో దేనికి ఏకీభవించకూడదూ?...పట్టు పట్టి నిలుస్తే, తన ప్రతి పడకకూ వెగటైన అర్థం ఖండితంగా చూపగల వన్నట్టు కొయ్యబారిన మనిషి ముందు వేదవతికి కాలుకదలడం లేదింట్లో. ఒదినా మరదళ్ళకు పట్టదని పక్కయింట్లో వెక్కిరిస్తే, లోకంనోరు మూయతగినంత మాటకు దొరక్కపోయింది కాత్యాయనికి. అదే అన్యజాతుల్లో జరిగితే, నీతిలేని నీచులని మాటివిరుస్తారు!—గుట్టుగా వుంటేనే కాపురం...

ఆరాత్రి అనిలుని ప్రవర్తన కొక కొత్తఅందం వచ్చింది. రోజుకన్నా సుఖంగా వున్నట్లు తెలుపుతున్నది వాలకం. వేదవతి కాశ్చర్యం వేసింది. ముడిచిన మల్లెదండ జడలోనికి ఒత్తి అలంకరించుకుంది. జాలుగా సాగివస్తూన్న కూనరాగాలు గొంతులోనే దిగిపోతున్నాయి ... అలా పట్టెమంచం ప్రక్కగా పడక కుర్చీలో కూచుని, తీరిగ్గా సుమతీశతకం వల్లెవేస్తూన్న అనిలుని చూడక చాలాదినాలైంది వేదవతి. ఎంతో మోజుతో చిన్నప్పుడని కంఠస్థం చేసేవాడట! పసిపాపను మరపిస్తూన్న అమాయిక హృదయం ... అంతుచిక్కని ఆలోచనలకు ఆధారం పొడకట్టితేచాలు అదే పెన్నిధిగా తలుస్తాడు. తనలో మార్పు తన కాశ్చర్యం కలిగించదేమో!

"వేదా!"

"ఊఁ"

"నిజంగా మనం సుఖిస్తున్నాంటావా"

మరచిపోయిన సత్యాన్ని జ్ఞాపకం తెచ్చుకున్నట్లు యీవిషయం కదిలించడం వేదవతికి నచ్చలేదు.

"ఎవరు కాదన్నారేం?"

"అక్కయ్య—కాదు... ఛే ఛే. ఊరికే అంటున్నాను"

"ఏం జరిగింది మళ్లీ?"

"నే నీవుద్యోగం చేస్తాను."

"ఇంతకుముందు మానేశారా?"

"కాదు. ఇక మానివెయ్యను"

"వెనక అలా అనుకున్నారా?"

"ఊఁ...నాఅంత చదువుకున్నవాడికి గుమాస్తా పని ఏమిటే? ... అని. తీరా ఆలోచిస్తే ఎంత వెర్రి వూహతో చూశావూ ... ప్రతివాడికీ కలెక్టరుద్యోగం కావాలి. కష్టం చేసి బ్రతికే కూలీ అవుతానని అనుకోడుకదా!"

"ఎప్పటినుంచీ యీవేదాంతం?"

"కాదు. విను. ఏపని చేసినా బ్రతకడానికే. యిదీ అందుకే."

కర్మాగారాల్లో రక్కసిలాగా యినపముక్కల చక్రం గిరున తిరుగుతుంది. వేలసార్లు తిరిగినా ఒకే సుడిచుట్టూ! పట్టాలు తప్పని రైలుబండీ అంతే; తప్పితేనే ప్రమాదం. అది జరగనంతవరకూ సుదూరం నడవ్వచ్చు. గమ్యస్థానం చేరగలమన్న ఆశా వుంచుకోవచ్చు...ఒడిదుడుకులు లేని జీవితాన్ని అనిలుడిప్పుడు కోరుకొంటున్నాడు. ఇంతవరకూ తనను అంటిపట్టి వున్న ఆకాశమెత్తు ఆశయాలన్నీ మిథ్యలని తేల్చివేశాడు.

"వేదా...అక్కయ్య ఏం చేస్తున్నదీ?"

"ఏం—అవసరమా?"

"పిలు చెప్తాను"

ఆరుబయట పరుపు పరుచుకొంది. ప్రక్కయింట్లో బాతాఖానీ కొడుతోంది కాత్యాయని. రోజూ యిదోఅలవా టీవొంటరికత్తెలకు; ఇంటింటి ముచ్చటూ వీరికే కావాలి!...

"వొదినగారూ..."

వేదవతిగొంతు వినబడగానే చెబుతూన్నమాటలు టక్కున ఆపింది కాత్యాయని. "నువ్వేనా... రామ్మరా ... ఆఁ ... మావేదం లెండి. మరెవరో అనుకున్నాను—" సంబాళించుకుని మళ్లీ చెప్పడం మొదలెట్టింది: "నాకూ యిష్టం కాకకాదు. స్వంత కాపురంలో నిప్పు పోసుకునేవాళ్లుంటారూ ఎవరేనా? మరీ ... కళ్లారా చూస్తూ ఎలా సహించను చెప్పండి! ఓనాడు కొత్త లాల్చీ తొడుక్కు, అర్ధరాత్రివేళ యింటికి వచ్చారు. డబ్బున్నది, దానికేం! రాళ్లవుంగరం తొడిగించింది...పిచ్చితెలివి, తీసిఅన్నా రాకూడదూ! అంతేకాదు! దగ్గరకు పోదునుగదా,

కమ్మటి గంధంవాసన వేసింది. చెబితే నాగోడు నమ్మరుగానండి, ఎన్నోసార్లు రాత్రిళ్లు గంధం తీసి పెట్టేదాన్ని ... నాకళ్లనీళ్లు తుడవనైనా రానుకో లేదు—"

"ఒదినా, మీ తమ్ముడు రమ్మంటున్నారు" —మధ్యలో అన్నది వేదవతి. పాడిందే పాటగా, రోజూ యింట చూచినా తన భర్త వెళ్లిపోయినందుకు తన ప్రారబ్ధం వెళ్లబుచ్చుకునే ముచ్చట వేదవతికి నచ్చ లేదు. తను వెళ్లగొట్టింది అతనే పక్షిలాగా యెగిరిపోకూడదా? అంతా అనవసర ప్రసంగం...

"చేసిన పాపం చెబితే తీరుతుందమ్మా—పద వస్తున్నా"

వేదవతివెనకాతలే కాత్యాయని వచ్చింది.

"నాయనా! పిలిచావూ?"

"ఆఁ...పూర్తయిందా నీపని?"

"పనీ బండలూ! ... ఆవిడ పూరికే పిలుస్తే వెళ్లాను"

వెల్లువలాగా వస్తూన్న నవ్వును ఆపుకోవడానికి దోమతెరచాటుకు పోయింది వేదవతి. కోపంతో అన్నది కాత్యాయని: "నవ్వండి. నాజీవితమే నవ్వుల పాలయింది"

"సరేకాని—ధనపాల్ వుత్తరం వ్రాశాడు"

సంభాషణ మార్చిన అనిలునికి ఆడవాళ్లిద్దరూ దగ్గరగా జరిగారు.

"రోజూ కొత్త సంబంధం పెకలిస్తున్నది! ఈధనపాల్ ఎవరూ...రావడం దేనికి?"

"నేనూ అల్లాగే అనుకున్నాను. జ్ఞప్తికి వచ్చేప్పటికి తాతలు దిగివచ్చారు. మనలాగే వాడూ ఒక నిర్భాగ్యుడు. పదేళ్లవాడు నాకూ వాడికీ విడని స్నేహం. అప్పటికి నాకంటే ఎనిమిదేళ్లు పెద్దవాడు. స్కూల్లో బాదరాయణసంబంధంలాగే కలిశాం మేమిద్దరమూను...అక్కయ్యా ... నిజానికి చేతులుకలిపింది నేనే అయినా నన్ను మించిన స్నేహితులు వాళ్లిద్దరూ! బావ వుంటే వాణ్ణి నెత్తిన పెట్టుకునే వాడు!"

"అయితే యిక్కడికి దేనికి?" — విసురుగా కాత్యాయని అన్నది.

"అసలు రావడం ఎల్లాగో నాకూ తెలియదు. వచ్చినవాళ్లు బ్రతికివచ్చే కాలం యింకా రాలేదనుకుంటా—"

"అంటే!—"

"విను పూర్తిగా. మధ్యలోనే చదువుకు వుద్వాసం చెప్పాడు. మొదటినుంచీ విచ్చలవిడిగా తిరగడం అలవాటుచేసుకున్నాడసలు. దూరపు బంధువులెవరో తిండి పెడుతూవుండేవాళ్లుకాబోలు! అంతా అయిదారేళ్లవాడు, పాపం! ఎక్కడో చెరువులో యీతలు కొడుతూంటే అమాంతంగా మునిగిపోయినాడని ఎవరో చెబితే విన్నాను...గిట్టని వెధవ లెవరో అలా పుట్టించి వుండవచ్చు...సన్యాసిలాగా తిండికి జరగక వూరూరూ తిరుగుతున్నాననీ, రెండురోజులు మన యింట్లోనూ వుండిపోతాననీ వ్రాశాడు పాపం!"

"పోనీ...రానివ్వండి"—వేదవతి జాలిగా అన్న మాటలు వినీవినకుండా బయటికి దూకేసి ప్రక్కమీద వాలింది కాత్యాయని. పడకగది తలుపువేయను వచ్చి తొంగిచూచింది వేదవతి...

"వచ్చే నాలుగురోజుల్లో తనకు వండిపడేస్తున్నది చాలక తద్దినాలుగూడా తెచ్చి పెడుతుందట..అబ్బబ్బ!"

ఆడబిడ్డ గొణగడం చూచి నొచ్చుకుంది ప్రాణం. లోపలికి వచ్చి దిండు సర్దుతూ అంది: "నేను కొన్నాళ్లు పుట్టింటో వుండివస్తాను లెండి...నాన్నగారికి చెప్పండి"...

"వారున్నారు తల్లీ!"

మూడునాలుగురోజులు పోయాక ఓ మధ్యపారు వయస్సు సన్యాసి అనిలుడు యింట్లో లేనప్పుడు వచ్చి అడిగాడు. కాత్యాయని తీక్ష్ణంగా చూచిందతన్ని. ఎక్కడా చూచినట్లు జ్ఞాపకం లేదుగదా! మళ్లీ చూచింది. కాదు. ఈ గడ్డమూ అదీ ఎప్పుడూ చూడ లేదు. అతన్ని గురించి విన్నట్లు జ్ఞాపకం.

"మీ పేరు?"

"ధనపాల్"

ఇంతలో వేదవతి వచ్చి సత్కరించిం దతన్ని. అనిలుడు వచ్చేదాకా తను తెచ్చిన పుస్తక మేదో తిరగవేస్తూ కాలం వెళ్లబుచ్చాడు. రాగానే అనిలునికి ఆశ్చర్యం వేసింది. తాను పూర్వం గొట్టికాయలాడిన ధనపాల్ యితడేనా! ఎంత మార్పు! బండ్లు ఓడలూ, ఓడలు బండ్లూ అవుతాయి నిజమే...

"గుర్తే పట్టలేకపోయాను మిమ్మల్ని"

"ఇంకా 'మీరు' అంటున్నావా! అంత దూరంగా వుంచకు స్నేహితుణ్ణి"

"చనిపోయా వని విని చాలా విచారించా నోయ్"

"నీకూ తెలిసిందేమిటి! కుర్రకుంకలు; నన్ను గేలిచేయడాని కలా పుట్టించారు. పట్టించుకోకపోతే సరి..."

ధనపాల్ వచ్చింది కొన్నిదినాలు వూరికే వుండిపోవడానికి. పూజాపురస్కారాలూ, వేదాంత పఠనం నిత్యకృత్యాలు కాకపోయినా వేళకు ఆహారం తోచనప్పుడు చుక్కల్ని లెక్కపెట్టడం ఇతను చేసింది. మిగతా వ్యక్తుంతూ అతని కివన్నీ సమకూర్చడం వినా మరేమీ పట్టలేదు; ఓ బడుగు సన్యాసివిషయం ఎవరికి కావాలి!

...............

మొదటి మూడురోజులూ జరిపిన మర్యాద యిప్పుడు లేదు....అతని కీమూకీభావం అర్థమైందో లేదో...

3

దీపాలు పెడుతూన్నప్పుడు రత్నదాసుగారి యింటినుంచి అప్పటికి లెక్కించని డబ్బు పట్టించుకు తిరిగి రావడం అనిలుని దినచర్యలో చివరిభాగం. మరు నాటి వుదయం అనిలుని వెనువెంటనే తిరిగివెళ్లుతుం దాడబ్బు. తరువాత యెన్నిచేతులు మారినా కొత్త నాణెములను కలుపుకుని ఎప్పటిచోటికి చేరాలిసిందే. అది రత్నదాసులాఘనమైనా కావచ్చు; సిరివలపైనా కావచ్చు! కలమ్మా వున్నమ్మకే పెడుతుంది; లేనమ్మా వున్నమ్మకే పెడుతుంది...అది కాలపు ధర్మమేమో!

రాత్రి కొత్తస్నేహితునితో సల్లాపాలాడడం తోనే సరిపోయింది. డబ్బు లెక్కపెట్టనూ తీరిక దొరకలేదు. పనిమాత్రం కాళ్లు చాచుకుని కూర్చుంది —వాసంగ లేమిటన్నట్లు. కొత్తగా వచ్చిన వజ్రాలు తెచ్చివుంచాడు. వాటి విలువలు తేల్చాలి. దాసుగారి పనిమనిషి సాయంకాలం తెస్తానన్న గదితాళం యింత దాకా రాలేదు. ఇప్పుడు తెచ్చినా యేమరుద్దేట్లు? యీబుద్రతక్కువ మనుష్యులతో పని పాడవుతోంది మరీను......

బడలికగా నిద్రపోయినాడు ఆనాటికి.

కలలు మిథ్యలంటారు. అంతరాత్మలోతులు అందని అల్పులకు అది నిజంగా తోచవచ్చు. ముందు చూ పున్న ఇంగితజ్ఞునికి తన బ్రతుకన్నా కలలే సత్యంగా కనిపిస్తాయి...

ప్రొద్దు పొడిచినా మెలకువ రాలే దనిలునికి. దుడుకుగా కాత్యాయని నిద్రలేపి వెళ్లింది. వేదవతిని పిలిచి "యివ్వాళ పీడకలే వచ్చిం"దన్నాడు. అలా జ్ఞాపకమున్న ప్రతికలా ఒకరికొకరు చెప్పుకోవడం కద్దు. అందుకు, తేలికగా నవ్వి అన్నాడు ధనపాల్: "కలలు నిజమైతే నే నీపాటికి రత్నదాసులా వజ్రాల వర్తకం చేయకపోయానా? యీ కాషాయాంబరా లేమిటీ?" అని.

"పిచ్చిముచ్చట్లు కట్టేసి పని చూచుకో"—వడ మటింట్లో పాత్రలు సర్దుతూ కాత్యాయని చెప్పింది.

కాలకృత్యాలు కానిచ్చి వెళ్లబోతూ అడిగాడు అనిలుడు:

"పనిమనిషి తాళం తెచ్చిందా?"

"అయ్యో-దొంగముండ రాలే దింకా - అక్కడకు పోయి తీసుకో...అఫీసుతాళం పనిమనిషి కివ్వ డమేం?"—కాత్యాయని జవాబుచెప్పింది.

బీర్వాలో సంచీలు తీస్తూ వేదవతివైపు తిరిగి అన్నాడు అనిలుడు: "హుం! రాత్రి మరిచేపోయాను... వీటిని లోపల వుంచను"

వెళ్లగానే ఊర్మిల ఎదురువచ్చిం దివ్వాళ.

"ఆలస్యంగా వచ్చారేం? అక్కయ్య వదల లేదా!"

"నీకూ, మీ అక్కయ్యకూ మరి పనిలేదు..."

"తమరంతా ప్రపంచసృష్టికర్తలాయిరి!"

"మాయింటికి ఒక చుట్టం వచ్చాడు. అతనితో మాట్లాడడంతో నాపని వెనుకబడిపోతోంది..."

"మరోమాట — ఏమి టాసన్యాసిరాయడి ప్రవర్తన! నా కట్టే బాగా లేదు. కనబడ్డ ఆడపురుగు నల్లా మాడడంతప్ప గతిలేదూ...కాత్యాయనీ, నేనూ మొన్న కబుర్లు చెప్పుకొంటున్నాం. గదిలో కూచ్చుని ఒకేచూపు మాపైపు!...మధ్యమధ్య—మరీ దొంగ నటనకు అంతుండద్దూ...తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు తల గిర్రున ఆడించుకోవడం...నా కెందు కను కున్నానుగాని ముఖాముఖి అడిగేసివుందును—"

"అది కాదు—విను. నోటికి కరువైనా మాట వరుస కలాంటివాడు కాడతను. చూచినంతమాత్రాన మీ వజ్రాల మూటంతా ఏంపోయిందేం. అయినా..."

"బావుంది మీ మగాళ్ల ముచ్చట!"

"పని ముగిసిన తర్వాత యింకా బావుంటుంది ...ఊర్మిలా! అవక రా పో"—నవ్వుతూ కచేరీగది లోకి వచ్చి ఊర్మిలను పంపించివేశాడు రత్నదాసు.

"బాబూ...రిచ్‌హాక్ పడవమా చేమిటీ?"

"రసీదు వచ్చింది—కానీ...".

"అవును. విన్నాను. కట్టిన డబ్బు మునిగి పోయిందట. మరీ కలిసిరావడం లే దీమధ్య."

ఓపదినిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది. ఆనిశ్శబ్దాన్ని చీలుస్తూ అనిలు డన్నాడు:

"నాలుగోబిల్లువజ్రాలు అందుకొన్నాం"

"విలువ చూచావా?"

"చూస్తాను"—జాగ్రత్తగా బిగించిన రెండు సంచీలనూ తోలుపెట్టిలోంచి బయటికి తీశాడు. నిద్ర చాలక కాబోలు, ఎడమకన్ను అదురుతోంది!

"రాత్రి పనిమనిషి తాళం వేశేదు. లెక్క తేలకపోయిం దందుకే"

"యిప్పుడు తేలదుటోయ్!"

పదిలంగా కరెన్సీ లెక్కపెట్టివుంచాడు. ఉంగరాలవ్రేళ్లు చలాకీగా కదిలిస్తూ అందుకున్నాడు రత్నదాసు.

"సెభాష్...ఆరున్నొక్క వెయ్యికదూ..."

'ఊఁ—వజ్రాల సంచీ మూతివిప్పుతూ జవాబు చెప్పా డనిలుడు ... "ఒకటి...రెండు ... మూడు, తొమ్మిది—అరె!!!"

గుండె పగిలిం దతనికి. కనుబొమలు ముడిపడి నాయి. నుదురు వికృతంగా విశాలమైంది. గ్రుడ్లు మసకలుకమ్మినాయి. డబ్బు లెక్కిస్తూన్న రత్నదాసు అదిరిపడ్డాడు...

"ఏమిటీ?"

"తొ...మ్మి...దే...వున్నాయి"

"ఆ!! మిగిలిన రెండూ..."

"అవును...పో...యినా...యి"

పనిమనిషితో మాట్లాడుతూ గదిముందుగా వెళ్తూన్న ఊర్మిల చెవులో ఖంగుమన్నా యీమాట లు..."ఇది మంచికి కాదు బాలూ ... నీమీద నాకు అనుమానం వుండికాదు—నిజం చెప్పు"

ఏమి టీ సంభావణలు!!! శిలాప్రతిమలా నిశ్చేష్టుడైన అనిలుని చూచిచూచీ కరగిపోతూన్నది ఊర్మిల.

"నాన్నా...ఏం జరిగింది?"

"ఆదే—పనిమనిషిని పిలు. పో"

"తూకురుకు చెడ్డ జ్వరంట పాపం...నిన్న తాళం యివ్వనందుకు బతిమాలుకుని యిప్పుడు యిచ్చి వెళ్లిపోయింది"

ఆశగా అనిలు డంటా మనుకున్నాడు—"పని మనిషిని కనుక్కొంటేకి" కానీ — తన అజాగ్రత్త కారణంగా పోయిన వజ్రాలకు ఒక బీదమనిషిని బోనుకెక్కించడం ఎంత భీరుత్వం! మరి తాళం నిన్న తెచ్చింది కాదేం... ఆ తీసిన వెనకలతో దీనికి మరి కా... అయివుండదు. తన స్వంతమనుష్యులకు జబ్బుగా వుంటే తను వచ్చేవాడేనా పనికి! గోరంత తలనొప్పికి ఒక పక్షం సెలవు పుచ్చుకుతీరాలి! అయినా గదితాళ మది. వజ్రాల పెట్టికి మరోతాళం వుందిగా—అన్నట్టు అదీ వేయలేదు నిన్న ... ఛీ..తల్లిలేని ఊర్మిలకు తన

చనుబాలు పంచియిచ్చి, ఆయింటికి తన శ్రమ ధార పోస్తున్న అది అలాంటి పని చేస్తుందా! ఏమో, కలియుగం!

అనుమానమూ, ఆకాశమూ అంతూ పంతూ లేకుండా అంతటా వ్యాపించగలవు.

రత్నదాసు పెద్దమనిషి. ముందాలోచన లేకుండా తూలనాడడం అతని పద్ధతి కాదు. లోటు కనిపిస్తే పోనిచ్చే ఘటమూ కాదు. ఇన్నాళ్లుగా, నమ్మకద్రోహి కాదని తన సర్వస్వమూ అనిలునిచేత చక్రం తిప్పుతున్నాడు. వేలసంఖ్యను మించి విలువైన వజ్రాలు రెండూ ఒక్కసారిగా కనుపించనప్పుడు నిప్పులేకుండా మండిం దతని హృదయం.

"అడిగి తీసుకోలేకపోయారా వారెవరో ... థూ"

వంకరగా తన్నెత్తిపొడుస్తున్న రత్నదాసు మాటలు పిడుగులైనాయి అనిలునికి. కన్నీరు బొటబొట రాలిపోతోంది. తనను కత్తితో పొడిచినా తనకు బాధ లేదు. తన హృదయాన్ని గోరుతో తాకినా కన్నీరై కరగిపోతాడు...ముఖం ప్రక్కకు తిప్పి జవాబు ఆలోచిస్తున్నాడు.

"చెప్పు...నీవై యుండవులే-నీవై యుండవులే - నీవు లేనప్పుడు మీవాళ్లెవరేనా—"

ఊర్మిల పనిమనిషిని పిలుచుకొచ్చింది.

"నీవేనా? చెప్పేతీరాలి"

హడలిపోతోంది పనిమనిషి.

"బాబూ...నన్ను నమ్మరూ!"

ఉగ్రుడై అన్నాడు రత్నదాసు: "అందరినీ నమ్మే రోజులుకదూ యివి...హుం"

చివుక్కుమన్న దనిలుని మనస్సు. నిజమే... తనంతవా డీపనిలో స్థిరపడడం పొరపాటే. సముద్రపు కెరటాలలా పొంగివస్తున్నాయి పూర్వం మరుగుపడిన ఆలోచనలన్నీ.

"అనుభవించాలి...సేవమాత్రం దేవతనా?"— లోలోపల అణిగిన వాక్కులు. నాలిక కొసదాకా వచ్చింది. అవనే అన్నాడు:

"బాబూ! క్షమించండి. నేనే దాచివుంచాను. యింట్లో వున్నాయి"

ఊర్మిల చెక్కబొమ్మలా నుంచుంది. ఏమంటున్నా డితను!!

ముఖం ముడుచుకు వెళ్లిపోతున్న అనిలుని చూచి అన్నాడు రత్నదాసు: "యీ రెండువజ్రాలతో నాభాగ్యం కాదు—నీమాట పోయింది?."

సూదిమొనలపై కాలుపెట్టినట్లు ఇంటికి నడిచాడతను. అతని కిప్పుడు తన మనస్సుమీదే నమ్మకం పోయింది; భార్యా, బంధువులూ ఒక లెక్కా!

వేళగానివేళ గడపతొక్కడం చూచి వేదవతి అనుమానించింది. "ఇంత త్వరగా వచ్చారేం?"

పరాకుగా అన్నాడు: "అంతా క్షేమమేలే—కొన్నాళ్లు పుట్టినింట్లో వుండివస్తానన్నావు...వెళ్లిరా. ఆ రెండూ నీవే వుంచుకో లే"

"ఏరెండూ!"—గాభరాగా వేదవతి అడిగే లోపలే అనిలుడు మనస్సు నొచ్చుకున్నాడు. అయినా యేం? "అందరినీ నమ్మేరోజులుకదూ యివి?"

"చెప్పరూ...ఏం జరిగింది!"

"ఏమీ లేదు. అక్కయ్యను పిలు"

"ఇంతదాకా జగడాలు వేసుకుని నీళ్లకు వెళ్లింది"

"ఏం?"

"మీ స్నేహితుడు పోతూపోతూ 'వారితో వెళ్లివస్తానని చెప్పండి' అన్నాడు. పాపం, వున్నన్నాళ్లూ చేసిన మర్యాద యెరుగుదురుగా—'అల్లాగే' అన్నాను వూరికేవుండక. 'ఛవ్...యిన్నాళ్లూ వుండి, మాటా మంతీ లేకుండా వెళ్తాంటే, ఆపన్యాసి రాయణ్ణి వదలడమేనా! మగవాళ్లింటో లేనప్పుడు అనుచ్చు ఏం చేతబట్టుకు పోయాడో కదా!' అని విరగబడా తిట్టింది..."

అనిలుని కేటూ పాలుపోలేదు. స్నేహితుడా, చెప్పకుండానే వెళ్లిపోయాడు. అక్కయ్య జాగ్రత్తగల మనిషే. అయినా ఏమో!—

"చెప్పరూ"—దీనంగా అడిగింది వేదవతి మళ్లీ.

"ఏమీ లేదు ... కోర్టుపనిమీద కొన్నాళ్లు ఊరికి వెళ్లుతున్నాను. తిరిగి వచ్చేదాకా అక్కయ్య యిల్లు చూస్తుంటుంది. నిన్ను మీ నాన్న రమ్మన్నారు. వెళ్లు."

ఈ జవాబు వేదవతి నేమీ సంతృప్తిపరచ లేదు. "అంత కష్టమైతే వెళ్తాను లెండి" అన్నది.

అనిలుని కీమాటలు బాధను కలిగించినాయి.

వస్తూనే "ఏం బాబూ! ఇంత త్వరగా వచ్చావేం! మావాయిన అలిసిపోయినావమ్మా; వేడినీళ్లు తేనా" అంది కాత్యాయని.

" అక్కా! అతను వెళ్లిపోయేప్పు డేం చెప్పాడు?"

"చెల్ల మొహం వేశాడు. అంత హడావిడిగా వెళ్లడానికి కారణం మాత్రం చెప్పద్దూ...మగవాళ్లు లేరని దులబరించుకు వెళ్లడమేనా ? "

"పోనీ. ఏమీ నష్టంలేదు... మరో పక్షంలో తిరిగివస్తాను. వ్యాపారంమీద వెళ్లడం. యిల్లు చూస్తుంటావు కదూ?"

"అయ్యో బాబూ... యీ ప్రయాసంతా నీ కోసం కాదుట్రా. నే పోయేప్పుడు దమ్మిడీలతో కూడా లెక్క చెప్పి మరీ వస్తాను. ఊ...ఏదిక్కు కేవిటి ?"

"ఇంకా తెలీదు."

"మరి – సరే వెళ్లిరా"—వంటయింట్లోకి పోయింది కాత్యాయని. ఏదో చెబుదా మనుకుని వెను దిరగబోయింది... "ఆ. పదిరోజుల్లో రాడూ. అప్పుడు చెప్పకూడదూ. అయినా మునిగిపోయే సంగతు లేం లేవుగా..."

"వేదా, మరి వస్తాను. బండి పిలుచుకువచ్చి మాట్లాడనా?"

"ఊ."

వాకిలి దాటి వెళ్లాడు. వాకిలిని తిరిగి చూడ లేదు. వీథి దాటి వెళ్లాడు. వెనుదిరగలేదు. "అవును. కాకిని కోకిలగా భ్రమించాను. యీ పుద్యోగం నాకు వద్దు. ఈ ప్రపంచమే నాకు కాదు." తనలో తానే అనుకున్నాడు చాలాసార్లు.

అరగంట గడచినా బండిలేదు. వేదవతి భయ పడింది. వీథి గుమ్మంలోనికి పోయి తొంగిచూడను లేస్తోంది. పరుగులెడుతూ ఊర్మిలగారి పనిమనిషి వచ్చింది.

" అమ్మా...అయ్యగా రేరీ ?"

"ఏం?"

"వజ్రాలు దొరికినాయి."

వేదవతి పంచప్రాణాలూ గిలగిలలాడినాయి.

"ఏం వజ్రాలూ!! "

"పోయిన రెండూను. దాసుగా రివ్వాళ మల్లీ సంచీ వెతుకుతే కనిపించినాయట... చెక్కు చెదర లేదట... ఊర్మిలమ్మగారు దాడు తీయమన్నారు. ఏరీ పాపం! అయ్యగారికి కళ్లనీళ్లదాకా వచ్చింది బాబును నిలేసి అడిగినందుకు...ఏరీ !"

" అమ్మా- నీకు పుణ్య ముంటుంది. ఆ బండ్ల రాస్తాదగ్గర చూడిరామ్మా" — వేదవతి ప్రతిమాలుతోంటే నిర్విణ్ణురాలై పరుగెత్తింది పనిమనిషి.

లోపలికి వచ్చి చుట్టలు చుట్టుకుని ఏడుస్తోంది వేదవతి. కాత్యాయని అంటుంది: "తల్లీ! దేవుడి పీట పడమటింట్లోకి మార్చాను. మైలగుడ్డలతో ఎప్పుడూ వెళ్లకేం..." లోలోపల కుమిలిపోతూన్న వేదవతి హృదయం ఆమె గ్రహించిందా !

ఆమె అంటుంది: "ఒదినగారూ, వా రెప్పుడు వస్తారు మళ్లీ?"

"వస్తారు...తొందరేం ? "

ఇదే సంఘటన మరో యింటిలో జరుగుతోంది. మణిహారం మాటిమాటికీ తళుక్కున మెరుస్తోంది ఊర్మిల చేతులో. యీదినం రెండువజ్రాలు కొరతపడినా యందులో...

పనిమనిషి వచ్చి జాలిగా అంది: " అమ్మా ! వారు కనిపించలేదు. వెళ్లిపోయారు."

ఊర్మిల కొంగుతో కన్నీరు అద్దుకొంటూ అంది: "అబ్బా! మిగిలిపోయింది. శ్రమం చెడ్డా ఫలం దక్కలేదు."

విసురుగా మణిహారం మెళ్లోంచి లాగి బల్ల మీద పడేసింది. అందులో రెండు వజ్రాలు తక్కువున్నా యిప్పుడు!

౪

బ్రతుకు కర్బనంలాంటిది. వీలు చిక్కితే వజ్రమై మెరుస్తుంది. వాలు తప్పితే బొగ్గులా కాంతి విహీనమై కాలితో తన్నబడుతుంది!

దారీ తెన్నూ కానలేని స్థితి వచ్చేప్పటికి, అతివృష్టికి వరదలు పారినట్లు పరిపరివిధాల పోతుంది మనస్సు. మనం చెప్పినట్లు అది నడుచుకోనప్పుడు సర్వస్వమూ విధికి స్వాధీనంచేసి-అదిచెప్పినట్లు మనం నడుచుకుతీరాలి.

ఇంటిముందు రాలిన రేగుపండ్లు మసకచీకటి రంగులో కలుస్తున్నా యిప్పుడిప్పుడు. ఏరుకోవడానికి చేరిన పిల్లగుంపు సన్నగిల్లింది. దూరంగా ముట్టించిన వీధిలాంతరు, రాహుకేతువులు నంజుకున్నట్లు, ముడుచుకుపోయి కొద్దిదూరమైనా కనిపించడంలేదు. రైలుదిగిన మనుష్యులు వడిగా నడిచిపోతోంటే వారికై వచ్చిన మనుష్యులు మారుపడుతున్నారు. వీరిని చూస్తూ, పిండిముగ్గులు చెరిగిన అరుగుమీద చాపపరుచుకుని ఆయన కూర్చునివున్నాడు. దూరంగా వస్తూన్న బండివేపే అతని దృక్కులు. ముఖ మంతకంతకు విప్పారుతున్నది. చుట్టిన చాపచుట్ట సాకరు లోనికి తీసుకువెళ్లాడు. వెండిపొన్నులకర్ర పుచ్చుకుని బండి కెదురు నడిచా డతను.

“మాతల్లి వస్తోన్నట్లుంది!”

దగ్గరకు రాగానే గ్రహించాడు, అందులో ఒక్కరే వున్నారని. కొంచెం బరువుగా తోచింది గుండెల్లో.

“బాబూ .. అమ్మాయి యేదీ?”

“అంతా క్షేమం. వస్తుందిలెండి”—తిరుగుతూ తిరుగుతూ ఆగిన బండిచక్రంచారలో దృష్టి సారిస్తూ దిగాడు అనిలుడు.

“వ్యాపారంపనిమీద వచ్చాను”

ఈమాటలు మామయ్యకు రుచించనట్లు స్పష్టం. “మిమ్మల్ని చూసిపోవడానికి వచ్చా”నంటే ఎంతో తృప్తిపొందేవా డని తర్వాత అనుకున్నాడు.

“అంతా క్షేమమేకదా”

“ఆ”

సంవత్సరంనాడు అత్తవారింటికి వచ్చినప్పుడు మామయ్యను చూడాలన్న వుత్సాహంలో, వెండితీగలా వెలిగిం దొక నవ్వుజీరా. ఆపనే యీనాడు చేస్తోంటే కన్నీరే తక్కువ. మామయ్యకు తీరితార వేదవతీ అనిలులే. ఆబొమ్మలు ఆడుతోంటే చూస్తూ, యీ దీపం ఆరిపోవాలి.

ఎంతో వాత్సల్యంతో మాట్లాడాడు మామయ్య. తను వేదాన్ని తీసుకువస్తానని వ్రాస్తే, కష్టమౌతుందేమో నని యింటికి చేయించిన మరమ్మత్తు లొక్కొక్కటే అల్లుడికి చూపించాడు. ఇన్నాళ్లుగా చూడాలని తాను పడ్డ వ్యథంతా వెళ్లబోసుకున్నాడు.

“పాపం...దాన్ని నీవెంట తెచ్చి వదిల్తే పో యేదిగా”

“అవును”— మామయ్యమాటలు వింటూంటే కుమిలిపోయాడు లోలోపల అనిలుడు. తాను వెళ్లిపోతే—ఎక్కడికక్కడికో వెళ్లిపోతే—యీ మామయ్యకూ తనకూ సంబంధం కలిపిన వేదా న్నిక చూడడు...మామయ్య బ్రతుకగలడా!—

ఇంతలో ప్రపంచం కప్పిన మసకరంగులు ఆవరించినా యతని కళ్లకు. తెరకట్టినట్లు ప్రతివస్తువూ సత్యానికి మరుగుపడిపోయింది...అన్నాడు : “ఏం! మామయ్య బ్రతుకలేడా యేం? మహరాజులా. శాశ్వతంగా కన్నబిడ్డలనూ, చేసుకొన్న భార్యలనూ పోగొట్టుకొన్నవా ళ్లెంతమంది లేరేం?... పెంచుకొంటారు; పెళ్లిచేసుకుంటారు. ఇది లోకం. హు...” తనలో దాగివున్న లోకపు వికృతచ్ఛాయ యీమాటలు అతనిచేత అనిపించివుంటా యప్పటికప్పుడు.

ఊరికే గడచిపోయినాయి నాలుగు దివాలు. తన గమ్యస్థానం అనిలుడు ఆలోచించుకునేలోపలే తనకు చిక్కు వచ్చేట్టుంది. వేద తండ్రికి చెప్పింపించింది, తా నీక్షణమే బయలుదేరి వస్తూన్నట్టు. అది మామయ్యకు సంతోషం. అనిలునికి సంతోషమూ, దుఃఖమూకూడా.

“మామయ్యా...నే రైలుకెళ్లి పిల్చుకొస్తాను”

“అల్లాగే బాబూ. జాగ్రత్తసుమీ.”

వీధి చివరకు సాగిపోయేదాకా శూన్యంలో చూస్తూ నిలబడ్డాడు మామయ్య. మలుపు తిరగగానే చటుక్కున యింట్లోకి పోయి నౌకరుతో అన్నాడు: "ఒరే...గదిలో వుయ్యాలబల్ల గొలుసులు తగిలించు మళ్లీ"

వచ్చే, పోయే బండ్లకు రెంటికీ వేళయింది. తిరిగీతిరిగీ స్టేషన్ చేరుకొన్నా డనిలుడు. రంకుల రాట్నంలా తిరుగుతోంది తల. జేబులో వున్నడబ్బంతా లెక్కించాడు. ఫర్వాలేదు.

దిగిపోయే ప్రయాణీకులను ఎక్కేవాళ్లటకా యిస్తున్నారు ... అందులో వేదవతిని చూచేప్పటికి, వూహించుకోలేనంతగా బాధపడ్డ దతని హృదయం. కొన్న టిక్కెట్టు మరొకడి కిచ్చేసి వెళ్దామని ముందుకు అడుగులు వేస్తాడు. మరికొంతదూరం సాగిపోతే తను వేదవతి కనపడడం తథ్యం...

"ఛీ...మళ్లీ ఆరోంపిలోళ!"—

సైనికునిలా వెనుదిరిగి చివరిపెట్టిలో కూర్చు న్నాడు. వేద వెళ్లుతోంది....వేదవతి వెళ్లిపోయింది. తన్ను చూడకుండా వెళ్లిపోయింది. అనిలుడు పిలిచాడు: 'వేదా'...ఆ పిలుపు రైలుకూతలో కలిసి ప్రక్కవాడికి వినిపించదు.

వేద యిల్లు చేరుకునేప్పటికి పండుగనాడులాగా అలికి ముగ్గులు పెట్టివుంది. అది అల్లుడూకూతుర్ల రాక కని ఆమెకు తెలీదు. అత్తింటి ముచ్చట్లు ప్రాణాన్ని క్రుంగదీసినా, తన పుట్టింటిలో శుభసూచక మొక్కటైనా వినబోతానేమోనని కొంచెం స్తిమితపడింది... ఆయన వేదవతిని చూచాడు. ప్రాణం లేచివచ్చింది.

"నాతల్లి రావే...అత నేడీ!"

వేదవతి కర్థంకాలేదు. "ఎవరాయన?"

చిన్నపిల్లనులా ముద్దుపెట్టుకుందా మనిపించింది. తనతో నోరారా సరసాలాడుతోం దనుకున్నాడు ...

"ఎవరో కనుక్కో"

"చెప్పు నాన్నా...ప్రాణం తీయకు"

వేదవతి యిలాంటి జవా బిస్తుం దనుకోలే దాయన. ఇదేమిటి!

"నిన్ను పిలవబోయిన మీఆయన్ను నీవు పిలవబోవాలా...అనిలుడేడీ?"

"ఆఁ!! ఇక్కడున్నారా?" గడపకు పెట్టిన పసుపుకుంకుమలు ఎముకలూ రక్తంగా కనిపించినాయి వేదవతికి. వ్యాపారంమీద వెళ్లుతానన్న తన భర్త ఆలోచన లేకుండా అత్తవారింటో వున్నాడు. తను వచ్చేప్పటికి మొహం తప్పించడమూ జరిగింది. ముందే అనుమానించింది 'తన మాంగల్యం తనకు దక్కుతుందో దక్కదో' అని...సమ్మెటపోటు తగిలినట్లు బాధగా అంది: "అబ్బా ... వారు వెళ్లిపోయారు. నాకు వేల మైళ్లదూరం పోతారు. పోతున్నారు. యిక తిరిగి రారు...నాన్నా!"

నిజంగానే అనిలుడు వెళ్లిపోతున్నాడు. అతనిలో రేగిన యుద్ధం చల్లారే విధానం కనిపించడంలేదు. ఒక్క అనుమానంమాత్రం వుంది. త నెంతదూరం వెళ్లినా, త న్నంటిపట్టి ప్రపంచం రాగలదా! ఆ ముకికితో అవివాహభావం వుంచుకోండీ మానవుడు బ్రతుకడా? దీని అంతం కనిపెట్టడానికి పూనుకోవాలని అతనికి వుంది. ఎంతవరకు విజయం పొందుతాడో తనే చెప్పుకోవాలి...

పంటపొలాల్లో పచ్చని పైర్లను చూస్తూ గాజు కిటికీకి ఒత్తిగిలాడు. వానిలోని అందం తను ఆస్వాదించడం లేదు. ప్రక్కపెట్టిలోంచి పొగతాగుతూన్న పెద్దమనిషి, నీడలునీడలుగా వూదుతున్నాడు. ప్రక్కవాళ్ల సౌకర్యం తనకు పట్టదు...అనిలునికి కళ్లు తిరుగుతున్నాయి. ప్రొద్దున కొనుక్కుతిన్న మిఠాయి తెవులుకువస్తున్నది. కొమ్ముచెంబుతో కుర్రాడికి మంచినీళ్లు పడుతోం దొకావిడ... "తృప్య...నాకవ కమే..."

పెదవి విరుస్తూ అత నన్నాడు: "ఎన్నాళ్లిలా?"

చపలచిత్తులు చుట్టీ చుట్టీ ముడివేసిన త్రాడు మళ్లీ వెనక్కు లాగినట్లు- ఎన్నోవూళ్లు దాటివెళ్లినా, కదలనట్లే వుంది బండి.

"అరే! ధనపాల్!"

తానున్న పెట్టిలోనికే అతనూ రావడం విచిత్రం వేసింది అనిలునికి. నెమ్మదిగా అడుగులు వేస్తూ వచ్చి

ప్రక్కన కూర్చున్నాడు. మైళ్లదూరం ప్రయాణం చేసినా, తనతోడు వచ్చే దా కాషాయాంబరమే...

"ఎందాకా?"

అనిలుని నోటిదాకా వచ్చింది: "వ్యాపారంపనిమీద" అని...ఛీ ..అని నోరుమెదల్చి అన్నాడు: "ఆఁ...యిందాకే...నీవూ?"

"ఈరైలు వెళ్లేదాకా — చెప్పకుండా వచ్చినందుకు నొచ్చుకున్నావా?"

"సుతరాం లేదు."

"అక్కగా రెలా వుంది?"

"ఆమె కేం...క్షేమం"

"నీతో కొంచెం మాట్లాడాలి.......యిష్టపడతావా"

మళ్లీ ఏ అవాంతరం వచ్చిపడుతుందో అని అనిలుడు కంపించాడు. తల్లికడుపులోంచి పుట్టినప్పుడే తన కలా వ్రాసివుందికాబోలు......అడవిలో దాగినా ఆపదలు తప్పని జీవితాలు కొందరివి...తను పారిపోయినా అవి వదలవు...ఏమిటో...

"కానీయి"

అతను చెప్పడం మొదలెట్టాడు. "తగిలిన వేలికే తగలడం శుభసూచకం అనుకోవాలి. కష్టాలను ఆనందంతో ఆహ్వానించగలిగితే అంతరాత్మ అందివస్తుంది... చూచావూ...నేను మీకు గుర్తుండివుండను......ధనపాల్ను కాదు...మీ బావను. కాత్యాయనిభర్తను..."

గగుర్పాటు చెందిం దనిలుని హృదయం. ప్రశ్నార్థకంగా వంగి నిలువునా చూచాడు తన బావను...ప్రీతిగా దగ్గరకు జరిగి అన్నాడు: "ఎన్నాళ్లకు కనిపించావూ...ధనపాల్ అన్నావేం?"

ఆప్యాయంగా అతను జవాబిస్తున్నాడు:

"నే వ్యభిచరించిన మాట నిజమే. నాతప్పు నే ఒప్పుకున్నాను. మానవమాత్రుడు తప్పు చేయడం సహజం...కించిత్తు హృదయం చూపించకపోయింది మీ అక్క!—ధనపాల్ను ఆశ్రయించాను. సమానునిగా ఆహ్వానించాడు నన్ను....అదీ నాదురదృష్టమే అయింది...పెద్దయినా వాని బుద్ధి మారింది కాదు. ఓ రోజు, నదిలో స్నానం చెయ్యను వెళ్లి తిరిగే రాలేదు. నావిధి అక్కడా నిరాకరించింది నన్ను......నిన్నటి స్నేహితునికూడా గుర్తించుకోని మీ అక్క ఏండ్లనాటి నాబంధుత్వాన్ని కలగానే మరిచిపోయివుంటుందని నాకు తెలుసు...కడసారిగా చూచిపోదామని మొన్న వచ్చాను. కొంచెమయినా కనికరం చూపకపోయింది! కన్నారా నాభార్యనూ, బిడ్డనూ చూస్తే ఆడవాళ్లను కాముకు తాగుతా డంటుంది లోకం... ఊర్మిల ఎవరో తెలుసా! నాకు—అబ్బ!—అక్రమంగా పుట్టిన బిడ్డ. రత్నదాసు పెంచుకున్నాడు. నా రక్త స్పర్శనుండే నాకు గొడ్డలిపోట్లు ప్రాప్తించినాయి. అది దుర్భరమైంది నాకు—"

వింటూన్న అనిలుడు చెక్కబారిపోయినాడు.

"బావా! నే ఎక్కడికో తెలుసా?"

"విన్నాను అంతా. నాతోటే రా."

కాత్యాయని కిప్పు డరవయ్యోపడి దాటింది. కుంగి కృశించిపోయింది ... ఇప్పటికీ వడమటింట్లో దేవుడి పీటక్రింద రెండు వజ్రాలు ముడికట్టివున్నాయి!! ఒక్కొక్కనాడు దీపారాధనచేసి అంటుంది: "స్వామీ! మాతమ్ముణ్ణి పంపించవూ! గడ్డి తిని చేశాను...యీ రెండు వజ్రాలూ, రాగానే, అతనికి వుంగరాల్లో పొదిగిస్తాను"

ఊర్మిల కిప్పుడు నలుగురు బిడ్డలు. మొదటివాని పేరు అనిలుడు. వేదవతి కొక్కతే కూతురు. మేనత్త పేరు పెట్టారు. కాత్యాయని!

# కలగూరగంప

## పిట్ట కథ*

పశుపక్ష్యాదులకు కూడా మనకుమల్లేనే ఆహార నిద్రావిహారాలు సహజాలని అందరెరిగిన విషయమే. పూర్వం మనవాళ్లు వీటి భాష, తీర్పి, వీటి జీవితాల్లోని రహస్యాలను కూడా తెలిసికొనేవారని అనాదిగా పిట్టకథల్లా మనం చెబుకుంటూ వచ్చే వాటి వలన గ్రహించుకో గలుగుచున్నాము. ఇప్పుడు మన కా భాష తెలియదు గనుక, వాటి కథా కమామిషీలు తెలిసికోడానికూడా ఆదుర్దాపడం.

భాష తెలియకపోయినా మూగసైగ్గానే నిటీవల గమనించిన ఒక పిట్టకథ వినండి.

మా యింటి వసారాలో రెండు జతల పిచ్చిక దంపతులు గూళ్లు కట్టాయి—యేజతకాజత ప్రత్యేకంగా. ఈ గృహనిర్మాణమప్పుడు శ్రమపడేదంతా ఆడపిట్టే! మగపిట్ట యెంతసేపటికీ "అరగన్నువెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిగోకుచున్, నిలుగుచు నావులించుచు" ఒక మూల కూర్చొని చూస్తూవుంటుంది! చూచి చూచి, యెప్పుడో తోచినప్పుడు, పాపం! భార్యవొక్కతే కష్టపడుతున్నదనుకొని కాబోలు, యెగిరి వెళ్లి ఏ ముండ్లపుడకనో ముక్కున పట్టుకవస్తుంది! తనకు కలుగబోయ్యే గ్రుడ్లకు యీ పుల్లలు, పుడకలు బాధకలిగిస్తాయనే జ్ఞానంకూడా లేదాయెనని ఆడపిట్ట దాన్ని కాస్తా క్రిందకు త్రోసిపారేస్తుంది! ఈ మగపిట్ట లీల్లా అజ్ఞానంచేత చేసేదానివల్లనే, అవి గూళ్లు కట్టుకొనేటప్పుడు, మన యింటినిండా నిండే చెత్తకు కారణం!

ఈ వొక్క గృహ నిర్మాణ విషయంలోనే కాదు, సాధారణంగా మగపిట్టమీద ఏ బాధ్యతా పెట్టకుండా, కూర్చొబెట్టి మేపి, సుఖపడకేస్తవి ఆడపిట్టలు మగపిట్టల్ని—ఆడమళయాళంలోవలె! ఏ గుంటలోని నీళ్లు స్నానయోగ్యమో, ఏ చెడిన పంపునుండి చినికే నీళ్లు పానయోగ్యమో ముందుగా చూచివచ్చి, ఆడపిట్ట చెబితే, అప్పుడు బయలుదేరుతుంది మగపిట్ట పెండ్లికొడుకులా!

అసలు అందంలో కూడా—ముఖ్యంగా పశుపక్ష్యాదులలో—మగవే చాలా అందంగా వుంటాయి. ఒక పిచ్చికల్లోనే కాదు. పికాలు, శుకాలు, శారికలు వీటినైనా చూడండి! అందాకా యెందుకు? మామూలు కోళ్లను చూడండి, పుంజుకుండే ఠీవి, అందం పెట్టకుంటుందేమో!

సోదరీమణులకు కోపంరాకుంటే యింకా వొక మాట చెబుతా. మానవజాతిలో కూడా యెక్కువ అందగాడు మగవాడే! సృష్టికర్తకూడా మగవాడే కాబట్టి యీ పక్షపాతమేమో!

ఇక మా చూరులో గూళ్లుకట్టాయంటినే, వాటి కథ కొస్తాను. ఆ రెండుజతల పిట్టలూ కొన్నాళ్లు చాలా వొద్దిగ్గానే కాపరాలు చేస్తూవుండేవి. తీరికసమయాల్లో ఆ రెండు జతలూ కలిసి జలక్రీడలు, వనవిహారాలు, ఆటలు, పాటలు, ముచ్చట్లు సాగిస్తూవుండేవి. కాని అవి యెప్పుడు ఎక్కడ కూడినా, ఒకజతలోని ఆడపిట్టకు రెండోజతలోని మగపిట్ట స్పర్శకూడా తగులకుండా చూచుకొంటూవుండేవి! మగజాతి కెంత సంకుచితబుద్ధో!!

ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాటి వేసవి సంధ్యాకాలమున, ఆకసము మేఘావృతమై చల్లని వర్షపుగాలి వీస్తూవుంది. అందులో వో ఆడపిట్ట బయటి కొమ్మ

---

* హైదరాబాదు రేడియోవారి అనుమతితో.

మీద కూర్చొని, మైమరచి అచల్లగాలి ననుభవిస్తూవుంది. ఇంతలో కటికజాతిపిట్టలవాడొకడు మందు పెట్టిన పొడుగాంటి కోటీకఱ్ఱను మెల్లగా పాచి, ఆపిట్ట నణచి పట్టి, రెక్కలువిరిచి, తనబుట్టలో పెట్టుక వెళ్లి పొయ్యేడు! పాపం! అప్పుడా మిగిలిన మూడుపిట్టలూపడిన దుఃఖం యింతా అంతా కాదు. వాలినచోట వాలకుండా, యీ చెట్టుమీదనుండి ఆ చెట్టుమీదికి, ఆయింటిమీదనుండి యీయింటిమీదికి ఎగురుతూ శోకశేషులైపడ్డాయి మూడుదినాలు!

ప్రియావియోగంకలిగిన పిట్ట తన గూడువంకకే పొయ్యేదికాదు. దూరంగా కూర్చొని అరగన్ను పెట్టి చూచుకొంటూవుండేది, అన్నమూ నీళ్లూ విసర్జించి.

రెండోజతలోని ఆడపిట్ట దాని అవస్థ చూచి జాలిపడుతూవుండేది. పూర్వంలా తనజత మగపిట్టతో సరదాగా గంతులువేసేదికాదు. సరసాలాడేదికాదు. పైగా యేదో భర్తతో కిచకిచలాడేది. "చూస్తూ కూర్చోకపోతే కాస్తవెళ్లి అన్నమూ నీళ్లూ లేక అల్లాడుతూవున్న ఆపిట్టను వోదార్చి యింత యేదైనా ఆహారం పుచ్చుకోమని చెప్పరాదూ" అని కాబోలు ఆ కిచకిచ? ఎంతైనా ఆడగుండెకదా!

మగపిట్టహృదయం కరిగిందికాదు. శిలాయించి కూర్చుంది. పైగా పరాయి మగపిట్టమీద దీని కింత జాలెందుకోనని అనుమానించింది కూడానేమో! చురచురా చూచేది! మగధీర!

ఎంత చెప్పినా వింది కాదనీ, చెప్పికూడా లాభం లేదనీ, వోనాడు తనే యెగిరివెళ్లి ఆపిట్ట ప్రక్కనవ్రాలి యేదో వింతైన గొంతుతో మాట్లాడింది. తమగూటివద్దకు పిలుచుకవచ్చింది. భర్త అదిచూచి, ఒకరెక్క సాచి కాలితోగీరి, కోల్లుకులుపుకొని, రెండడుగు లవతలకిగెంతి మొగంత్రిప్పి, ముడుచుక కూర్చుంది. యుద్ధసన్నాహం కాబోలు!

ధర్మం తనపక్షాన వున్నంతవరకూ యెవరికీ వెరవవలసిలేదనుకొంది ఆడపిట్ట. తనే, కూడా యెగిరివెళ్లి, ఆహారవిసర్జితయై దుఃఖిస్తూవున్న మగపిట్టను, ఇంత యెక్కడో పారవేసి వున్న మెతుకులను తినిపించి ఇన్ని నీళ్లు త్రాగించి, తీసుకవచ్చింది. అది తిరిగీ వెళ్లి తనగూటివద్ద స్వస్థానంలో కూర్చుంది.

అది మొదలు యీదంపతు లిద్దరిమధ్యా కిచకిచ లేకాని, కిలకిలలు వినిపించేవి కావు!

ఆతరువాత, వోనాడేమి జరిగిందో, దంపతిపిట్టలు రెండూ కలియబడ్డాయి. మగపిట్ట ఆడపిట్టను రక్కి, పొడిచి, రక్తధారలోలికించింది. ఆడపిట్ట తూలి క్రింద పడ్డది. అప్పటికీ శాంతించక వెంటదూకింది మగపిట్ట! అంతవరకూ భార్యాభర్తల తగాదాలని చూస్తూ కూర్చున్న రెండో మగపిట్ట, ఇక జాగుచేస్తే ప్రాణాపాయం కలుగుతుందని జోక్యం కలుగజేసికొంది. ఎగిరి దూకి మగపిట్టను పిదిల్చిపారేసింది. ఆడపిట్ట ప్రాణం కాపాడింది.

ఆరాత్రంతా మూడు పిట్టలూ మూడు మూలల కొదిగి నిద్రించాయి. తెల్లవారి చూచేసరికి గూటిలోనుంచీ మూడుగ్రుడ్లు క్రిందపడి పగిలివున్నాయి! వాటిని చూచి ఆడపిట్ట యేడ్చిన యేడుపు యింతా అంతా కాదు. ఇల్లంతా ప్రతిధ్వనించిపోయింది. ప్రతిగడ్డీ తిరిగి చూచింది—పాపం! పగిలిపోని తన గ్రుడ్లొక్కటైనా కనిపిస్తవని కాబోలు! మగపిట్ట యీగగ్గోలుకు వణికిపోయింది. మాటా పలుకూ లేకుండా మూల కొదిగి ముచ్చులా కూర్చుంది!

క్రమంగా విషయం గ్రహించుకొంది ఆడపిట్ట. ఛీ! ఛీ! అనుకొంటూ బుర్రని యెగిరిపోయింది. నాటినుండీ ప్రియావియోగియై దుఃఖిస్తూవున్న మగపిట్టకూడా కనిపించింది కాదు.

"కథ కంచికి, మనం ఇంటికి."

పిశిపాటి వెంకటరమణయ్య.

---

## విద్యుచ్ఛక్తిని మొదట కనిపెట్టినది భారతీయులే

నేడు మనం మన గదిలో కూర్చొనే మదరాసులో 'నాయుడు' గారు వాయించే 'ఫిడేలో', కలకత్తానుంచి 'రవీంద్ర సంగీతం', లండనునుంచి నికరమైన యుద్ధ

వార్తలు వినగలుగుతున్నాం. దీనికీ, ఇంకా ఇలాటి మన నిత్యజీవితంలో పనికివచ్చే అనేక పనులకూ కారణమై మిక్కిలీ తోడ్పడేది విద్యుచ్ఛక్తి. నేటి 'సైంటిఫిక్ యుగం'లో ముఖ్యపాత్ర వహిస్తున్న ఈ విద్యుచ్ఛక్తి కొన్నివేలయేండ్లక్రితం భారతదేశంలో భారతీయులచేత కనిపెట్టబడిందిట. దీని క్రిందివిధంగా ఒక పురాతనశాసనాధారమైన కథ వుంది.

కొన్నివేల ఏళ్ల క్రితం--అంటే 'ఏథెన్స్'నగరం మంచి గొప్పదశలో ఉన్నరోజుల్లో--ఖండాంతరాలను గురించీ, సముద్రప్రయాణాలనుగురించీ ఇంకా ఎరగని రోజుల్లో—భారతదేశంలో ఇప్పటి మైసూరురాజ్యము వంటి రాజ్య మా ప్రాంతంలోనే ఉండేదట. ఆరాజ్యంలో గొప్ప గణితశాస్త్రవేత్తలు, ఇంజనీర్లు అయిన ఇద్దరు సోదర శాస్త్రజ్ఞు లుండేవారు. ఆరాజు వారి గొప్ప ధీశక్తిని కనిపెట్టి వారిని తన ఆస్థానములో నుంచినాడు.

వారు రాజాదరణను పొందుతూ అనేక గొప్ప సంగతులు, విషయములు కనిపెట్టినారు. వాటిలో విద్యుచ్ఛక్తి చాలా ముఖ్యమైనది. దీనిని ఆరాజు వారి సహాయంతో తన రాజ్యమంతటా వినియోగించుకొనగలిగాడు. తన ప్రజల కందరకూ 'సప్లై' చేసి విద్యుచ్ఛక్తి ఉపయోగమును పూర్తిగా పొందినాడు.

ఆరోజులలో విద్యుచ్ఛక్తిని ఇప్పటి కావేరీనదీ జలపాతములనుంచినే తీసినారు.

ఇలా కొన్నాళ్లు జరిగిపోయాక ఆసోదరులు ఏదో ఒక గొప్పతప్పు చేశారని రాజాదగ్గరకు ఫిర్యాదు వచ్చింది. ఋజువైనది. అప్పటి శిక్షాస్మృతిప్రకారము నేరానికి ద్వీపాంతరవాసం. అందుచేత వారి నిద్దరిని ఒక చిన్న పడవలో ఎక్కించి సముద్రములో వదలినారు. వారు ఎక్కడికి పోతారో ఎవరికీ తెలియదు.

వారు ఆయుర్దాయం ఉంది గనకా—భారతదేశానికి 'విద్యుచ్ఛక్తికి జన్మభూమి భారతవర్షం' అన్న కీర్తి సంపాదించడం కోసమూ (బహుశా. అలా ఉంది) క్రమంగా అదృష్టవశాత్తు ఏథెన్స్ నగరం చేరుకొని అక్కడ స్థిరపడిపోయారు. వారి శాస్త్ర ప్రావీణ్యం తెలిసి ఏథెన్స్ చక్రవర్తి వారిని రప్పించుకొని



ఆదరించాడు. అక్కడకూడా వారు విద్యుచ్ఛక్తి ప్రవేశపెట్టినారు. అక్కడివారుకూడ అనేకవిధాల ఉపయోగించుకున్నారు. ఆ దేశంలోనూ చక్రవర్తిదగ్గర గొప్ప పేరూ, ఆదరణా సంపాదించినారు.

వీరు ఒకనాడు రహస్యముగా తమ కథ రాజుకు చెప్పినారట. వీరి మరణానంతరం వీరి శరీరాలు పెద్ద రాతితొట్టెలో ద్రావకములు పోసి వాటిలో భద్రపరచినారు. ఆ తొట్టెపైన వేసిన రాతిపలకమీద ఈ పై కథను వ్రాయించినారు. భారతదేశ మొకటి ఉన్నదనీ, తాము భారతీయులమనీ, అచట విద్యుచ్ఛక్తిని కనిపెట్టితిమనీ చెప్పినారని ఆ రాతిపలకపై ఉందిట.

ఈ పై విషయం మన మెంతేనా గర్వించ తగ్గ విషయం.

శ్రీరామశాస్త్రి.

## చీనాధన్వంతరి ఫ్యూహాసి

మన ఆయుర్వేదానికి ధన్వంతరి మూలవిరాట్టని యేలా మనము ఆరాధిస్తున్నామో అలాగే చీనా ప్రజలు తమ వైద్యవిధానానికి, సంఘోన్నతికి, దాని తోపాటు భాషావృద్ధికి 'ఫ్యూహ్‌సీ-షెన్‌నంగ్-హుఆంగ్‌టీ' అనే చక్రవర్తిత్రయం ముఖ్యమని పూజిస్తున్నారు. ఈ ముగ్గురిలోనూ ఫ్యూహ్‌సీయే ప్రథముడు; చీనావారికి సాక్షాత్తు దేవుడు. ఈయన చైనామహాచక్రవర్తి. క్రీస్తుపూర్వం ౨౯౫౩-౨౮౩౮ లో రాజ్యం పాలించాడు. పాములాంటి శరీరం, మానవశిరస్సు, దేవతాప్రకాశం గల ఈయన ఆకారం ఓ ఇంద్రజాలంలాంటి దని వర్ణింపబడివుంది. సృష్ట్యాది ౨౦౦౦౦౦ సంవత్సరాల తర్వాత ఈయననుండే నేటి మహాచైనారక్తం ప్రవహిస్తూందని వారి నమ్మకం. ఈయనకు పిఓహీస్సా అనే యింకో పేరుకూడా వుంది.

చీనావైద్యకళ అంతా ఓ 'అష్టదళపద్మం' మీద ఆధారపడివుంది. దాన్నిబట్టే 'ఇ-చింగ్' అనే ఒక గొప్ప చీనావైద్యగ్రంథం వ్రాయబడింది. ఈ అష్టదళపద్మాన్ని కనిపెట్టింది ఫ్యూహ్‌సీయే. ఈ పద్మాన్ని చీనాభాషలో 'పాకు-ఆ' అంటారు. ఓనాడు ఈచక్రవర్తి 'యెల్లో'నదిలో స్నానంకోసం వెళ్లగా ఆనదిలో ఓ దేవతాశ్వం ప్రత్యక్షమయి తన వీపు చూడమని సంజ్ఞచేసింది. ఆవీపుమీద ఈయనకు ఏవో గీతలులా కనపడ్డాయి. ఆ గీతలతోనే యింటికి వచ్చి ఆ చక్రవర్తి ఈ 'పాకు-ఆ'ను రచించాడు.

ఈ'పాకు-ఆ'యే చీనాప్రజలయొక్క వైద్యం, మతం, వేదాంతం అయివుంది. అది యిప్పటికి అనేక రకాల మార్పులుకూడా పొందింది. 'పాకు-ఆ' ఓ కున్నలా వుండి వంకరగీతలచే విభాగింపబడి చుట్టూ ముక్కోణాలుగా గీతలంకలిగివుంటుంది (మన అంజ నేయబిళ్లలాగ). ఇందులో ప్రతిగడికి ఓ బీజాక్షరం వుంది. నేటివరకు ఇన్ని శతాబ్దాలనుండి ఎంతమంది పండితులు కృషిచేసినా అందులోని ఇంద్రజాలాన్ని కనిపెట్టలేకపోయారు. బంగారు, రాగి మొదలైన లోహాల రేకులమీద ఈ'పాకు-ఆ'ను గీసి దుష్టగ్రహ బాధనివారణకొరకు చీనాప్రజలు తాయత్తుగా మెళ్లోను, మెళ్లోను కట్టుకుంటారు.

ఈ'పాకు-ఆ'ను రచించి చక్రవర్తి యింక రోగాలు, అవి యెల్లా కలుగుతాయి మొదలైన విషయాలు గ్రహించాడు. మనచుట్టూ గాలి ఆవరకాలుగా వుందనీ, సృష్టి పంచభూతాత్మకం అనీ, మానవ శరీరం ఈ పంచభూతాలతోనే తయారయిందనీ వ్రాశాడు. ప్రతిచెట్టూ, ప్రతివేరూ పరీక్షించి గుణగణాలు తెలిసికొని ఓ వస్తుగుణదీపికలాంటిది వ్రాశాడు. నేడు కూడా చైనాలో వున్న 'తొమ్మిదిసూదుల వైద్యం'- అంటే రోగికి తొమ్మిదిరకాల సూదులు ఏవో పసరులో ముంచి నిమ్మళంగా గుచ్చడం (యింజక్షను వైద్యం లాంటిది) ఈయన కనిపెట్టిందే.

ఈయన ఈవిధంగా వైద్యకళను అభివృద్ధి చేయడమేకాకుండా, చీనాభాషయొక్క లిపి కని పెట్టాడు. చేపలు పట్టడం, వంట చేసుకోవడం, గేదెలు ఆవులు మేకలు మొదలైనవాటిని పెంచడం, తమలో తాము పెళ్లిళ్లు చేసుకోవడం నేర్పాడు.

ఇట్టి చీనాభాగ్యవిధాతను నేటివరకు చీనా పూజించింది; యిప్పుడు పూజిస్తోంది; ముందు పూజిస్తుంది.

చాడ విశ్వేశ్వరరావు.



# సాభిప్రాయ విశేషాలు

సారస్వతోత్సవాలు:

ఆశ్వయుజమాసమంతా ఆంధ్ర దేశంలో పండుగలూ, పర్వాలే!

మూలమూలలా వేడుకలూ, వినోదాలే!

మాసప్రారంభంలో దసరా; మాసాంతంలో దీపావళి. ఇవి ఆంధ్రులకు జాతీయమైన పండుగపర్వదినాలు. ఆంధ్రులకు మాత్రమేనా? అఖిలభారతావనికే ఇవి పండుగ రోజులు. అందరితోపాటు ఆంధ్రులుకూడా ఈయేడు అమితోత్సాహంతో, సంతోషకరంగా ఈపండుగలూ, పబ్బాలూ చేసుకొన్నారు. బంధుమిత్రులతో కలిసి వేడుకలూ, వినోదాలూ జరుపుకొని హాయిగా కాలం వెళ్లబుచ్చారు.

అయితే—ఈపండుగ లోకమెత్తూ, సారస్వత క్షేత్రంలో ఈనెల జరిగిన పండుగ లోకమెత్తూగా కనిపిస్తున్నాయి. దసరా, దీపావళి పండుగలకంటే ఆ సారస్వత - పండుగలే మమ్ముల నెక్కువగా కదిలించినాయి.

ఆంధ్రులలో ఇంత ఉత్సాహం ఒక్కసారిగా ఎలా పుట్టుకొనివచ్చిందోగాని గత మాసం ఆంధ్ర దేశంలో జరిగిన సారస్వతోత్సవాలు తలచుకుంటే అమితసంతోషమవుతున్నది. ఇన్ని ఉత్సవాలు ఒక్కనెలలో ఇదివరకెన్నడూ జరిగినట్లు తోచదు.

రాజమండ్రిలో శరత్సాహిత్యగోష్ఠి!

తిరుపతిలో సారస్వతాభ్యుదయోత్సవాలు!

బెజవాడలో వేదశాస్త్రసభలు!

బందరులో కృష్ణామండల సంగీతపరిషత్సమావేశము!

కాకినాడలో సరస్వతీ గానసభవారి గాయకసభలు!

బరంపురంలో సాహిత్యమండలి సాహిత్యసమ్మేళనం!

జంషెడ్పూరులో రాష్ట్రేతరాంధ్రుల సారస్వత పరిషత్తు!

బళ్లారిలో ఆంధ్రమహాసభ కనుబంధముగా విజ్ఞానపరిషత్, సాహిత్యపరిషత్, నాట్యకళాపరిషత్సమావేశాలు!

ఎన్నని ఏకరువుపెట్టగలము? పట్టీ యివ్వబోతే తెగపెరిగిపోతున్నది! రాయలసీమలోనేకాదు, కోస్తా జిల్లాలలోనేకాదు, రాష్ట్రాంతరాలలోనేకాదు ఎక్కడ జూచినా

ఆంధ్రసారస్వతోత్సవాలే। ఎక్కడ విన్నా ఆంధ్రసారస్వతోత్సవ ప్రసంగాలే!

హాయి! హాయి! ఇంతకన్నా ఆనంద ప్రదమైన దేమున్నది? ఆంధ్రసారస్వత క్షేత్రంలో ఒక్కసారిగా ఇంత అనిర్వచనీయమైన చైతన్యం కలిగినందుకు మేము చాలా ఆనందిస్తున్నాము. ఈ ఉత్సవాల కర్తలనూ, కారయితలనూకూడా మేము మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాము.

ఆంధ్రసారస్వతం ముందడుగులు వేస్తున్నందుకు ఈ ఉత్సవాలు ప్రత్యక్షనిదర్శనలు. భాషలో, భావంలో, రీతిలో, పద్ధతిలోకూడా ఆంధ్రసారస్వతం అభివృద్ధిపొందుతూ, క్రొత్త క్రొత్త అభిరుచులను వెదజల్లుతున్నందుకు ఇవి ముంజేతిదర్పణాలు. క్రొత్త తెన్నుల కవికుమారులకే కాదు, పాత తెన్నుల పండిత ప్రకాండులకుకూడా ఆంధ్రదేశం నేడు గొడ్డుపోలేదని బెజవాడ వేదశాస్త్రసభలు ఘంటాఘోషంగా నిరూపించినవి. సంగీత, నాట్యకళలలో ఆంధ్రదేశం గడించిన విశిష్టతను ఆయా సమావేశాలు విశదముగా వెల్లడించినవి. ఆంధ్రతేజము, ఆంధ్రవిజ్ఞానము, ఆంధ్రసంస్కృతి, ఆంధ్రసాహిత్యము, ఆంధ్రకళలు ఈ ఉత్సవాలలో విశ్వరూపముగా వెల్లివిరిసినవి.

ఈ పంశగలనాడు ద్యోతకమైన ఈ ఉత్సాహాన్ని వసివాడనీకుండా కాపాడుకొంటూ, అవసరమయితే ఇనుమడింప జేసుకొంటూ, ముందడుగులు వేస్తూపోయి ఆంధ్ర సారస్వతానికి జగజ్జేగీయమానమైనస్థానాన్ని గడించి పెట్టవలెనని మేము ఆంధ్రకవికుమారులను, ఆంధ్ర విద్వాంసులను కోరుతున్నాము. ఇటువంటి సారస్వతోత్సవాలు ఏ ఏడాదికొక నాడో కాక వీలయినప్పుడల్లా, వీలయిన చోటల్లా జరుగుతూ వుండవలెనని వాంఛిస్తున్నాము. ఆంధ్రసారస్వతాభివృద్ధికి ఇటువంటి ఉత్సవాలే దివ్యమైన దోహదాలని నమ్ముతున్నాము.

* * *

## షష్టిపూర్తి సమ్మానాలు:

బెజవాడపౌరులు ఈమధ్య ఒక పెద్ద ఘనకార్యముచేసి, ధన్యులయినారు. గాయకసార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యగారి షష్టిపూర్తి సందర్భంలో వారు చేసిన సన్మానానికి బెజవాడ పౌరుల కివే మా అభినందనాలు. ఆ సన్మానం అఖిలాంధ్రజాతి చేసిన సన్మానంగా మేము పరిగణిస్తున్నాము. రామకృష్ణయ్యగారు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు. ఆకళయందు ఆంధ్రజాతి ఖ్యాతిని నిలువబెట్టిన పండితులలో ఒకరు. దక్షిణదేశమందంతటా వారి నెరుగని సంగీతజ్ఞుడు లేడు. ఆంధ్ర దేశంలో సంగీతానికి వ్యాప్తిని, ఆదరణను తెచ్చిన మహనీయులలో రామకృష్ణయ్యగారొకరు. అట్టి సంగీత కళామూర్తికి ఈమధ్యనే షష్టిపూర్తి శాంతి జరిగినది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని బెజవాడపౌరులు వారికి ఘనమైన సన్మానం చేసినారు. చేసి, తమ్ము తాము గౌరవించుకొన్నారు.

కళలకు కళాకాంతులు ఏర్పడవలెనంటే ఇటువంటి కళాపూజలు చాలా అవసరం. ఇటువంటి పురస్కారాలు చాలా ముఖ్యం.

ఆంధ్రజాతి చేసిన ఈ మంగళాశాసన ఫలితంగా ఇతోధిక జవసత్వాలతో, కళాయుస్సుపోసుకొని రామకృష్ణయ్యగారు శేష జీవితాన్నికూడా కళారాధనకు వినియోగిస్తారని నమ్ముతున్నాము. ఆంధ్రప్రతిభను దిగంతములకు చాటుతారని విశ్వసిస్తున్నాము.

* * *

కడపలోకూడా ఇంకొక షష్టిపూర్తి సన్మానం జరిగింది. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు కడపపౌరులు ఆదరాభిమానాలతో అందించిన ఆపళ్లెరాన్ని అందుకొని, వారి ననుగ్రహించినారు.

శర్మగారు సుప్రసిద్ధకవులు. పండితులు. రాయలసీమలో వారి నెరుగనివారు అరుదు. ఆంధ్రవాల్మీకి రామాయణము, బ్రహ్మాండపురాణము మొదలైన గొప్పగొప్ప గ్రంథాలను బహుసంఖ్యగా రచించి శర్మగారు ఎనలేని యశస్సు నార్జించినారు. పురాణవాఙ్మయము పైన వారి కెక్కువమోజు. ఆ వాఙ్మయాన్ని కూలంకషముగా మథించి, అందలి సారమును తెలుగువారి కందివ్వ బూనుకొన్నారు. వారి ప్రయత్నము కొనసాగినది. అంతంత బృహత్సంపుటాలను శ్రద్ధాసక్తులతో తిరుగవేయుటకు ఆయన కాఓపిక ఎక్కడనుండి వచ్చినదో, ఊహించుటకుకూడ అలవి గాకున్నది. అరువదేండ్లు నిండిన ఈవృద్ధాప్యములోకూడ ఆయన కాఓపిక అణుమాత్రముకూడ తగ్గలేదు. ఆ ఓపికకే లక్షలవిలువ కట్టవచ్చు. అదియే అంతంతేసి గ్రంథములను ఆయనచేత

చేయించుచున్నదని మా నమ్మకము. నిజముగా, వారి ఈసాహిత్యసేవ మెచ్చుకోదగినది.

రాయలసీమలో శర్మగారి గ్రంథములకు అవిరళప్రచార మున్నది. శర్మగారు రాయలసీమ కొక రత్నమువంటివారు. ఆసీమలోని ప్రాచీన పండితకవులలో శర్మగారు ప్రథమగణ్యులు. కళాప్రపూర్ణులు.

వీరికి పూర్ణాయుస్సునిచ్చి, వీరిచేత ముందుముందు ఇంకా ఎక్కువ సాహిత్యసేవ చేయించవలెనని భగవంతునిప్రార్థిస్తున్నాము.

* * *

కీ. శే. నాగరాజరావుగారు :

ఆంధ్రనాట్యకళాప్రపంచంలో వాసికెక్కిన నెల్లూరు నాగరాజరావుగారు అక్టోబరు 10.వ తేదీనాడు అస్తమించిపోయినారు. కళాప్రపంచానికి ఇది ఒక గొప్ప విషాదవార్త.

నాగరాజరావుగారు ఆంధ్రనాట్యకళకు చేసిన సేవ అమోఘమైనది. కష్టనష్టములను గణించకుండా, చివరివరకూ నాటక కళారాధనకే జీవితముధారపోసిన కర్మిష్ఠి ఆయన. ఆయన నిర్యాణం ఆంధ్రనాటకరంగానికి తీరని లోటు.

దుఃఖితులై ఉన్న వారి కుటుంబానికి మా సానుభూతి నందజేస్తున్నాము. వారి అకళంక కళాసేవకై వారి ఆత్మకు మా జోహారు లర్పిస్తున్నాము.

---



# విమర్శనము

## శ్రీవిద్యాశంకరలీల

పద్యకావ్యము. కర్త: కవితావతంస, కావ్యతీర్థ, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు, తెనాలి. ౫౦ + ౧౦౦ పుటలు. వెల ౩ రూపాయలు.

ఈపద్యకావ్యమున శ్రీ శాస్త్రిగారు శ్రీ ఆదిశంకరాచార్యులవారి చరిత్రమును, సామాన్యముగ లోకులచే చెప్పుకొనబడు అద్భుతవిషయములనుండి నిరుక్తకెనువర్పి, వర్ణింప ప్రయత్నించిరి. ఈప్రయత్న మెంతయును మెచ్చదగియున్నది. ఈకాలమున ఇట్టి చరిత్రములను పద్యములలో చదివి ఆనందింపగల సమయము చాలమందికి తక్కువ. ఈ సిద్ధాంతిని వచనమున రచించియుండినచో పండితపామర సుబోధకమై, గ్రంథమత్యంతము వ్యాప్తిలోనికి వచ్చుటకు అవకాశము లుండెడివి. పండితులు వ్రాసిన పుస్తకముగుటవలన కాబోలు ఇది ప్రౌఢకావ్యమే యనిపించుకొనుచున్నది. కాని, వ్యర్థపదములు అడ్డుదగిలి కొంత మటుకు ధారను అరికట్టుచున్నవి. ఇతరులను, దుండగులను చెడదిట్టుచు విరచింపబడిన 'తొలిపలుకు', 'సంక్షేపశంకరవిజయము మాధవకృతిమా' అను విమర్శయును ఈగ్రంథమును తెరచినతోడనే కనిపించుచున్నవి. ఇవి లేకున్నచో ఈగ్రంథగౌరవ మినుమడించెడిదని నాఆశయము. ఏలయన, సత్యము స్వయం ప్రకాశము. ఇతరులకు శాపవార్థములిడి దానిని ప్రతిష్ఠింపవలసిన అగత్యము లేదు.

'వేదాంతి'

---

## పాకిస్థాన్

మూలము: శ్రీ జవహరలాల్ నెహ్రూ. అనువరణ: పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు. ప్రకాశకులు: సంస్కృతి గ్రంథమండలి, వంగల్ బిల్డింగ్సు, పెరంబూరు, మద్రాసు. వెల ౪ అణాలు.

నేటి రాజకీయాలలో పాకిస్థాన్ ప్రశ్న ఒక విషమసమస్యగా పరిణమించియున్నది. హిందూ-ముస్లిం ఐక్యతాసాధనకే అది ఒక పెద్ద బండరాయిగా అడ్డు తగులుచున్నది. జిన్నాగారు ఏమని దీనికి పూనుకొని పట్టుపట్టుచున్నారో కాని, ఈపాకిస్థాన్ వాదము ఒక వితండవాదమని దీనిని తూరుపారబట్టుచు విమర్శింపని సహృదయుడే లేడు. దీని సాధక బాధకములను, స్వరూపస్వభావములను దేశీయ నాయకులు చాలమంది పరిశీలించి, పరామర్శించియున్నారు. గాంధీగారి తర్వాత గాంధీగారంతటి వారైన నెహ్రూగారుకూడ దేశక్షేమదృష్టితో ఈవాదమును సాకల్యముగా పరిశీలించి, తీవ్రముగా నిరసించియున్నారు. వారి వివిధరచనలలో-ఉపన్యాసాలలో, వ్యాసాలలో, ఉత్తరప్రత్యుత్తరాలలో పెక్కుచోట్ల ఈపాకిస్థాన్ వాదమును ఖండించిన ఘట్టములు విశేషముగాఉన్నవి. వానిలో నెహ్రూగారు వెల్లడించిన భావముల సంపుటమే ప్రస్తుతగ్రంథము. ఒక్కొకటిగానున్న ఆభావములన్నియు ఇందులో బహుపొందికగా, పూర్వాపర సందర్భశుద్ధితో క్రోడీకరింపబడియున్నవి. ఇటువంటి క్రోడీకరణ స్వతంత్ర రచనకంటె కూడ బహు ప్రయాససాధ్యమైనది. అందులోను ఇంత చిన్న గ్రంథములో అంత పెద్ద విషయమును విశదముగా వివరించుట మాటలు కాదు.

ఆ కష్టమునకు తలయొగ్గి, కరతలామలకముగా ఈ గ్రంథమును కూర్చిన కూర్పరి నేర్పు ప్రశంసింపదగి యున్నది. పాకిస్థాన్ వాదమును, దాని నిస్సారతను, దాని పరిష్కారపద్ధతులను స్థూలముగా, సులభముగా తెలిసికొనుటకు ఈ లఘు గ్రంథము చాల ఉపకరింప గలదు.

---

## సోవియట్ సంయుక్త రాష్ట్రం - మన మిత్రరాజ్యం

మూలము : డి. యన్. ప్రిట్. అనుసరణ : 'సామ్యవాది'. ప్రకాశకులు : సంస్కృతి గ్రంథమండలి, పెరంబూరు, మద్రాసు. వెల ౮ అణాలు.

సోవియట్ చరిత్ర, సోవియట్ విదేశాంగ విధానము, సోవియట్ - జర్మను సంబంధాలు, సోవియట్ - బ్రిటిషు సంబంధాలు, యుద్ధము పట్ల సోవియట్ల వైఖరి, బ్రిటిషు చర్యలు - ప్రతీకారములు, సోవియట్ సంయుక్తరాష్ట్రబలము ఇత్యాదికము లిందులోని ప్రధాన విషయములు. ఈ విషయ గౌరవము ఈ గ్రంథమునకు ప్రశస్తి తేగలదు.

---

## ఖుషీమహల్

వివిధరచయితల వివిధరచనల సంపుటి. సంపాదకులు : చెరుకువాడ వెంకటసుబ్బారావుగారు, విస్సా కోడేరు.

భీమవరములో వెలసిన ఒక సాహిత్య గోష్ఠికి సభ్యులు పెట్టుకున్న ముద్దు పేరు 'ఖుషీమహల్'. ఆ గోష్ఠికి మూలకారణమైన అత్తిలి సూర్యనారాయణ మూర్తిగారే ఈమహలుకు మాల్కీ. ఆ మాల్కీకి "తీయని కావ్యద్రాక్ష రసాయనమూ, ఎఱ్ఱగా తళుకులాడే గాఢ కాంక్షలూ, ఘుమఘుమలాడే స్నేహాలూ మిళితం చేసి" పండుగ నాడు, సహచరబృందము అందిచ్చిన మధు పాత్ర ఈ కావ్యసంపుటి. ఆగోష్ఠిలోని వివిధ సారస్వత వ్యాసంగములకు ఇది చక్కని నిదర్శనమై యున్నది. అన్నిరకముల రచనలును ఇందులో ఉన్నవి. రచయితల లక్ష్యమైన ఖుషీవినోదములకు వానిలో లోటు లేదు. ఖులాసాగా చదువుకొనుటకు అవి మిక్కిలి తగియున్నవి. వినోదముతో బాటు సగ పాలుగా విచారము (భావన) కూడ ఈ రచనలలో పాఠకులకు లభ్యమగుచున్నది.

---

## తోలకరి

రచయిత: పెమ్మరాజు లక్ష్మీపతిగారు. ప్రకాశకుడు: అడ్డేపల్లి నాగగోపాలరావుగారు, గవర్నరుపేట, బెజవాడ.

ఇది యొక చక్కని పద్యకావ్యము. వెనుక ఒకానొకప్పు డిది భారతిలో వెలువడినదే. దానికే మరి కొన్ని పద్యము లిందులో జతపడినవి. లక్ష్మీపతిగారి కవిత్వము లక్షణమైనది. మాధుర్యమునకును, ధారా శుద్ధికిని, భావపోషణకును అది ఆటపట్టన్నచో అతిశయోక్తి కాదు. 'వర్షాగమము-కర్షక ప్రవృత్తి'ని బురస్కరించుకొని యల్లిన యీ కావ్యము పై లక్షణముల నన్నిటిని సమగ్రముగా నిండించుకొన్నది. పాపము, ఈ మధురకవి యీ మధ్యనే పరమపదించినాడు. ఇదియు, ఈయన రచించిన చెల్లమాంబాది ఇతర కృతులును ఈయనకవితామూర్తికి శాశ్వత స్మారకములుగా వెలయగలవని నమ్ముచున్నాము.

---

## శ్రీ శారదాదేవి చరిత్ర

రచయిత : చిరంతనానందస్వామిగారు. మైలాపూరు (మద్రాసు) నందలి రామకృష్ణ మఠమువారిచే ప్రకటితమైనది. వెల రు. ౧-౧౪-౦.

పైపేరువల్లనే తెలుసుకోవచ్చు ఇది జీవితచరిత్ర యని. శారదాదేవి ఖండఖండాంతరములలో గూడ ప్రఖ్యాతివడసిన శ్రీరామకృష్ణ పరమహంస వారి ధర్మపత్ని. ఈ పేరును అక్షరశః సార్థకము గావించుకొన్న సాధ్వీమణి. సాధారణ దంపతులకు అనుంగు బిడ్డయై, పురుషోత్తముడు కానున్న గదాధరుని కేవలం అయిదేండ్ల ప్రాయమందే పెండ్లియాడి, యౌవనారంభ కాలమున కేవలము నామమాత్రముగ సంసారసౌఖ్యముల నంది, సంపూర్ణ యౌవనమందే సన్యసించిన పతికి సేవా శుశ్రూషల గావించుచు, వారి నిర్యాణానంతరము పతిపదమునే అధిష్ఠించి అనేక ధర్మకార్యాలకూ,

ధర్మసంపదలకూ కారణభూతురాలై శాంతముతో ఇహమును వీడ్కొన్న పరమభక్తురాలు; సాధ్వీమణి; ఆదర్శప్రాయమైన స్త్రీరత్నము. స్వకీయ భర్తచేత సాక్షాత్తు దేవీమూర్తిగ పూజలందుకొన్న పవిత్ర చరిత్ర. స్త్రీలకే కాదు, అనేక పురుష పుంగవులకుగూడ గురుస్థానము వహించి వారివారి సంశయములను పారదోలి ఉత్తమోపదేశములను గావించి తరింపజేసిన స్త్రీరత్నము. వివేకానందస్వామి యంతటివానిని కార్యతత్పరుని గావించిన దీ తల్లియేయని వచింప నీమె నిష్కలంకజీవన మెంత ఆదర్శప్రాయమైనదో గ్రహింపవచ్చును. కాని ఈమెయు సంసారప్రవాహమున ఎన్ని కష్టములను, ఎన్ని కడగండ్లను అనుభవించవలెనో వానిని గూడా చాలామటుకు చవిచూచినదనియే చెప్పవచ్చును. ధైర్యముతో వాటి నన్నింటి నెదుర్కొని ముందుకు సాగుతూపోయి జీవితసాఫల్యమును పొందగలిగినది. అందరికీ పఠనీయమైన దీగ్రంథము.

---

## నేషనల్ ఇన్సూరెన్సుకంపెనీ లిమిటెడ్ (కలకత్తా)వారి వార్షికనివేదిక, 1942

1942 సం. డిశంబరు 31వ తేదీతో అంతమగు సంవత్సరమున నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీకి లైఫ్ ఇన్సూరెన్సు, కాపిటల్ అల్లిగేషను ఫండుక్రిందను రు. 1,60,53,764 లకు క్రొత్త ప్రపోజలులు వచ్చినవి. రు. 1,41,32,095 లకు భీమా పట్టాలు జారీచేయబడినవి. ఇందు కాపిటల్ అల్లిగేషనుఫండుక్రింద చేసిన భీమా మొత్తము రు. 2,05,567లు. ఈ క్రొత్తవ్యాపారముమీద సాలీనా ప్రీమియము ఆదాయము, రీ-ఇన్సూరెన్సు పోను రు. 6,86,855లు. 1942వ సంవత్సరమున పట్టాలగడువు తీరుటవలన రు. 18,81,710 లకును, మరణములవలన రు. 10,84,572 లకును క్లైయిములు సంభవించినవి. లైఫ్ ఇన్సూరెన్సుఫండు సంవత్సరారంభమున రు. 8,69,81,039 లుండినది సంవత్సరాంతమున రు. 8,86,92,450 లున్నది. కాపిటల్ అల్లిగేషనుఫండు సంవత్సరాంతమున రు. 5,69,847 లుండినది. ఈసంవత్సరము కంపెనీ పెట్టుబడులమీద వడ్డీ, రాబడిపన్ను పోను, రు. 15,29,602 లు వచ్చినది. ప్రీమియము రాబడి మానేజిమెంటు ఖర్చుల దామాయిషా రు. 25.4% లున్నది. రాబడి పన్ను లేకుండ 6% డివిడెండు నివ్వవలసినదిగా కంపెనీ డైరెక్టర్లు సిఫారసు చేసిరి. కంపెనీ విస్తారముగా వ్యాపారము చేయుచుండిన మలయా, బర్మా మొదలగు ప్రదేశములు శత్రుగత మగుటచే ప్రస్తావనపాలున ప్రీమియము ఆదాయము కొంచెము తగ్గినను, యుద్ధపరిస్థితులలో క్రొత్త ఖర్చు లనేకమేర్పడినను ఆయవ్యయ దామాయిషా 1941వ సం॥ కన్న 1942వ సం॥న తగ్గియుండుట గమనింపదగినది.

---

# గ్రంథ స్వీకారము

---

### రామచంద్ర విద్యార్థికోశము

తెలుగు - తెలుగు సంగ్రహనిఘంటువు. రచయితలు: పూతలపట్టు శ్రీరాములు రెడ్డి, శాస్త్రారి ఆరోగ్యం పిళ్ల గార్లు. ప్రాప్తిస్థానము: ఆర్. వెంకటేశ్వర అండుకో, లోకా స్క్వేరు, మద్రాసు. వెల రూ. ౨-౮-౦.

---

### ప్రేమరాగము

ఖండకావ్యసంపుటి. కవి: పెనుమర్తి కామేశ్వరరావుగారు, సారస్వత కుటీరము, తెనాలి. వెల ౮ అణాలు.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.




# లిప్టన్స్

జాకూజా ★ వైట్ లేబిల్
టీగరల్ రకములు

3 TK-52-T8

లిప్టన్స్ టీని సేవించే ఆనందంలో అజాగ్రత్త - సంభాషణలలో మునుగవద్దు.